# సూర్యనారాయణీయము

[సామాన్యసంసారిజీవితకథ





ప్రకాశకుడు:

వల్లూరి సూర్యనారాయణరావు

బి.ఎ., బి.యల్., యల్.టి.

కొవ్వూరు.

**1936**

# సూర్యనారాయణీయము

[ సామాన్య సంసారి జీవితకథ ]





1936

[ వెల 0-10-0 ]



1887 సం॥ రం వయస్సు 21 సం॥ రములు

వల్లూరి శ్రీ సూర్యనారాయణరావు, బి. యే., యల్. టి.,

అసిస్టెంటు సైన్సు లెక్చరర్, టీచర్సు కాలేజి, సైదాపేట.

వారి కుమారుడు

రాఘవయ్యగారి ధర్మం.

D



R. Venkata Subbarao

**Born 3—8—1860 — Died 20—3—1918.**

రెంటాల వేంకటసుబ్బారావు పంతులుగారు

బి. యే., బి. యల్., హైకోర్టు వకీలు, మద్రాసు. A. P. Press. Madras.

E

TO

The Revered Memory

OF

***My Beloved Friend***

**Rentala Venkata Subba Rao**

**Pantulu Garu,** B.A. & B.L.,

*Author of*

'Othello Unveiled' 'Hamlet Unveiled'
'Kamala's Letters' Etc.

*THIS LITTLE BOOK*

*IS*

*Most Respectfully Dedicated*
*in token of My Sincere Admiration*
*and Esteem.*

V. SURYANARAYANA RAU
***AUTHOR***

I presented by
G. K. G. Dutt

# ఉపోద్ఘాతము

త్రిలింగపత్రికలో, మనపురాణములలోని యనేక విషయములు అభూతకల్పనలనియు, పుక్కిటికథలనియు యీగ్రంథకర్త, కొన్నివ్యాసములను వ్రాయగా, ఒక సనాతనధర్మవాది, హేళనగా, "సూర్యనారాయణీయము" అని వానిని విమర్శించదొడగెను. ఇదియు నాకొక మహాప్రసాదమని, ఆపేరును కృతజ్ఞతతో స్వీకరించి యీనాయాత్మకథకా పేరునే పెట్టితిని. ఈఅల్పస్థితి జీవితచరిత్రలో, ఆచరణయోగ్యములైన లక్షణము లేమైన యున్నయెడల, సామాన్యగృహస్థులుకూడ, వానిననుసరించెదరనేయాశతో, దీనిని తిరిగి కొందరుస్నేహితుల ప్రోద్బలమువలన ప్రకటించితిని. మొదటికూర్పులోని, కొన్నిస్వల్పవిషయములను తీసివేసి, నేటివరకు జరిగిన మరికొన్నిటిని చేర్చితిని.

వల్లూరి సూర్యనారాయణరావు.

1. జరయుమృతియులేని జనునట్లు ప్రాజ్ఞుండు
ధనమువిద్యఁగూర్ప దలపవలయు
ధర్మమాచరింపఁదగు మృత్యుచేతల
బట్టి యీడ్వబడినవాడు బోలె.—భారతము.



2. I never knew a man who did a decent action that wanted it forgotten. I never knew a man who did some great and shining act of self-sacrifice and heroic devotion, who did not wish that act remembered. Not only so, but he expected that his living children should chisel the remembrance of it upon the marble that marked his last resting place.—INGERSOLL.

3. It is wicked to die rich. A man of wealth is only a trustee and agent for his poorer brothern.

ANDREW CARNEGIE.

4. A life devoted to the cause of humanity has enthusiasms and passions to offer, which far transcend the selfish personal infatuations and sentimentalities of romance.—BERNARD SHAW.

5. The greatest of all forms of worship of God is the service of Man. There is no religion higher than lightening the load of sorrow which weighs on the whole creation, at least to a little extent.—

SIR V. RADHAKRISHNAN.

6. Do not dismiss me off cheaply with promises of memorial meetings when I am no longer amongst you; offer me succour even now when I sorely need it and leave my memorial in my own hands and time's judgment.—RABINDRANATH TAGORE.

# విషయసూచిక

# సూర్యనారాయణీయము

## అధ్యాయము ౧

### మా వంశము

మేము ఆరువేలనియోగి శాఖవారలము. ఆపస్తంభ సూత్రము, పరాశరసగోత్రము, వశిష్ఠ, శక్తి పరాశరప్రవర గల త్రయార్షేయులము. మా వంశమువారు మొదట నెల్లూరుజిల్లాలోనుండి, యిప్పుడు గుంటూరుజిల్లాలో చేర్చబడిన వంగవోలుదగ్గర వల్లూరు గ్రామస్థులు. ఇప్పటికిని మా వంశీయులు, మాసపిండులు, ఆ ప్రాంతములయందున్నారు. సుమారు నాలుగైదు తరములక్రిందట, వారిలో కొందరు కృష్ణాజిల్లాలోని పామర్రు సమీపమందుండు పెదమద్దాలి గ్రామమునకు వచ్చిరి. ఇచ్చటినుండి, వీరి వంశము తామరతంపరగా అల్లుకొని కృష్ణా, గోదావరి, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో నిండియున్నది. మా యింటిపేరటివారు, యితర గోత్రములవారనేకమంది యున్నారుగాని, వారు బాపట్ల, నరసారావుపేట, బెజవాడ, నరసాపురం మొదలగు పట్టణముల సమీపముననున్న వల్లూరు గ్రామములనుబట్టి వారి యింటిపేర్లుకూడా, మావలెనే యేర్పడినవి. మా యింటిపేరు మాత్రము వంగవోలునొద్దనున్న వల్లూరునుబట్టియే వచ్చినది.

ఈ వంశములో ఉద్యోగములేని, సంగీతము రాని వారు మిక్కిలి అరుదు. కనీసము ఆంధ్రభాషా పాండిత్యము నందును, సంగీతమందును అభిలాష మెండు. మొదట సంస్కృతాంధ్రములు బాగుగా చదువుకొని గ్రామకరణ ములుగాను, బడిపంతుళ్లుగాను ఉండి, తరువాత నవాబులు, జమీందార్ల క్రింద మంత్రిపదవుల నధిష్ఠించి, యిటీవలి బ్రిటీషు ప్రభుత్వములో డిప్యూటి కలెక్టర్లు, తహశ్శీలుదార్లు, మేజస్ట్రీటులు, ప్లీడర్లు, మొదలగువారైనారు. వీరిలో కొందరు వైష్ణవసాంప్రదాయముగల జమీంధార్లనొద్ద దివానులుగా నున్నపుడు వారి దయ సంపాదించుకొనుటకు తిరువణి తిరు చూర్ణధారులై, భుజములమీద చక్రాంకితములుకూడ వేసి కొనుచుండిరి. ప్రభువుల యనుగ్రహముకొరకు యిట్టిమార్పులు తెచ్చిపెట్టుకొని, తమ యిండ్లలో శ్రీవైష్ణవుల కర్చించి, వారు తిని లేచిపోయినతరువాత, వారి విస్తళ్ళను తీసివేసి, మృష్టాన్నమును భోజనము చేయుటకు మొదలుపెట్టిరి. మాలో మరికొందరు తిరిగి స్మార్తమతమును అవలంబించు టయేగాక, నిలువుబొట్టును తీసివేసి, అడ్డబొట్టునే ధరించుచు, శివాలయప్రతిష్ఠలు చేసి, ఆరాధ్యులతో సంబంధ బాంధవ్య ములు కలుగజేసికొనిరి. మా పెత్తండ్రిగారగు వేంకటరత్నము గారు రాజమండ్రిలో మునిసిపల్ క్లార్కుగా నుండగా, ఆయన యల్లుడును, అక్కడ ప్లీడరునైన గోవిందరాజుల భవనాశరావుగారి ప్రోత్సాహమువలన యిద్దరును చక్రాంకి

తములను వేయించుకొన్నారు. ఒకసారి మా పూర్వపు గురువులమని ఒక వైష్ణవబ్రాహ్మణుడు, చక్రాంకితములు వేయుటకు మా యింటికి రాగా, మా అమ్మగారు, ఆరాధ్యకుటుంబమువారి ఆడపడుచగుటచే, నడువు నడువుమని, ఒక చీపురుకట్టతో పాపము! ఆ బ్రాహ్మణుని వెడలగొట్టినది. మా పెత్తండ్రిగారివలెనే, మా నాన్నగారుకూడ భుజములు కాల్చుకొందు రేమో యని ఆమె భయపడినది. అప్పటినుండి నేటివరకు మాకు శైవ వైష్ణవగురువు లెవరును లేరు సరిగదా, నేను మా తండ్రిగారు చనిపోయినప్పటినుండియు చాదు చుక్కబొట్టుమాత్రమే సాధారణముగా పెట్టుకొనుచుందును. నాకొడుకుల కదియు అక్కరలేదు. మాకు మోతవాతలు రెండును లేవు.

నా తాతలలో ముగ్గురుమాత్రమే మగసంతతి కలవారు. వారిలో కడసారివారైన హనుమయ్యగారు, పెదమద్దాలిలోనే తన చిన్నతనమును గడపి, ఉద్యోగముమీద యిప్పటి తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకా మండపేటగ్రామమునకు, బందరు ఉప్పెనకు చాలా పూర్వమే వచ్చినారు. ఆయనను నే నెరుగను. నెలకు యేబదిరూపాయల జీతముమీద Head of the Police అను ఉద్యోగము చేసి చనిపోయినారు. ఆది యిప్పటి తహశీలుదారు పదవివంటిది. గోదావరి ఆనకట్టు కట్టిన కొద్ది సంవత్సరములకు ఆయన చనిపోయెను. నేను మొదటిసారి, మచిలీపట్టణమునకు

ప్లీడరీవృత్తికి 1895 వ సంవత్సరములో వెళ్లినపుడు పెద మద్దాలిగ్రామములో కొందరు వృద్ధులను దర్శించి, మా తాతగారి విషయమై కొన్ని సంగతులను తెలిసికొనుటకు ప్రయత్నించగా, ఆయన బల్లిచిక్కు ఆటలో ప్రసిద్ధి బడసినవాడనియు తన 18 వ యేటనే, ఉద్యోగముమీద గోదావరి జిల్లాకు వెళ్ళిరనియు, వారి తండ్రులు చెప్పగా వినుచుండే వారట. అప్పటికి మాకును, మా పెత్తండ్రి కొమారుడు హనుమంతరావుగారికిని మూడు యెకరముల సర్వదుంబాలాయీనామున్ను నివేశనస్థలమున్ను సమాన వాటాలుగా సరిహద్దులతో యేర్పడియే యుండెను. మాయిద్దరి పేర్లను, వేరువేరుగా ఖత్తులు వ్రాయించితిని. వారిభాగమును వారమ్మికొనిరి. నాభాగమును అచ్చటి శివాలయము విష్ణాలయములకు దానము చేసితిని.

ఇప్పుడు మాకాపురస్థలము, గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా మండపేటయని, యీవైపులను, కృష్ణాజిల్లాలో నున్నపుడు పెదమద్దాలియనియును చెప్పుకొందును. కాని, మండపేటలో నున్న గొప్పలోగిలి 1887 లోనే కోర్టు వేలములో, మాఋణములక్రింద అమ్మబడు పోయినది. ఆనకట్ట కట్టేటప్పటికి, పల్లపుసేద్యము యేమియు లేకపోవుటచే, మా తాతగారు చాలాద్రవ్యము సంపాదించిరి గాని, జిరాయితీకొంచెమైన నెంతమాత్రము సంపాదించలేదు. ఈయన తన కొమార్తెలను బొబ్బిలిలో భావరాజువారికిని, వెదురుపాకలో

వడ్డాది వారికిని, నగరములో కొమరగిరి వారికిని యిచ్చి నారు. ఇప్పుడు నాబొబ్బిలి మేనత్తకుమారుడు భావరాజు నరసింగరావును, నావెదురుపాక మేనత్త మనుమడును ఉన్నారు. నేనీ యిద్దరు మేనత్తలను కూడా యెరుగను. మూడవ మేనత్తకు పిల్లలు లేక, మండపేటలో తన తల్లి రామలక్ష్మమ్మ గారిని కనిపెట్టుకొని యుండేది. మా తాతగారు చనిపోయిన తరువాత, మాతండ్రి పెత్తండ్రులు చిన్నవాండ్రై యుండుట చేత, ఉన్న నిలవడబ్బు అంతయు, మాబామ్మ స్వాధీనము లోనే యుండి, తన కొమాళ్లకు విద్య, వివాహములకు ఖర్చు పెట్టగా మిగిలినది తన వితంతుకోమార్తె సావిత్రమ్మకు స్వాధీనముచేసి చనిపోయినది. అప్పటికి నాకు నాలుగు సంవత్సరముల వయస్సు ఉండెను. ఆమెను చూస్తే నాకు మిక్కిలి భయము. మాతండ్రులే భయపడేవారు. ఇక కోడండ్ర విషయమై చెప్పనేల? మా అమ్మగారు, నన్ను కనుటకు తన పుట్టిల్లు గ్రామమైన, రాజోలు తాలూకా కడలి గ్రామమునకు వెళ్ళుటకు సవారీలో కూర్చొనబోవుచుండగా ఆమె జీవించునో, జీవించదో యని భయపడి ఆమె ఒంటిమీదనున్న నగలన్నియు వదలివేసి పోవలసినదని నిర్బంధించి నగలను దాచుకొన్నదట! మాతండ్రులు సంగీతసాహిత్యముల నలవడ చేసికొనిరి. అప్పటికే, మండపేట, సానివాండ్రకు నిలయమైన గ్రామము పండితుల బంగరపు పీటయని సార్థకనామమును కలిగియుండెను. 1878 సంవత్సరములో నా చెల్లెలకు వివా

హము చేసినపుడు, నవద్వీపములో చదువుకొని, సంస్కృతాంధ్ర గ్రంథకర్తలగు కవు లనేకమంది, యీ సమస్యను పూరించుట నేను యెరుగుదును. మాతండ్రులు తమ తల్లిగారు అన్నము పెట్టినన్నాళ్లు చివుకు చింతలేక, తమ యిష్టమువచ్చినట్లు పురాణపఠనసంగీతాదులతో కాలము పుచ్చిరి. ఉభయుల భార్యలు కాపురమునకు వచ్చిన రెండుమూడు సంవత్సరములలోనే, ఉభయులను, తమ జీవనోపాధిని చూచుకొనవలసిన దని మాబామ్మగారు వెడలగొట్టినది.

గర్భవతిగా నుండిన మాఅమ్మగారు, పుట్టింటికి వెల్లిన ఒకటిరెండు మాసములలో నన్ను కనెనట. నేను రుధిరోద్గారి సంవత్సరములో పుట్టినట్లు, 1884 వ సంవత్సరములో ఒక తాటాకు పుస్తకములో చూచినట్లు జ్ఞాపకము. కాని క్రోధన సంవత్సరములో పుట్టినట్లు మాయింట్లో వాడుచుండిరి. మా అమ్మ తండ్రిగారైన పాలపర్తి మల్లయ్యగారిని నేను యెరుగను కాని, నే నెరిగి నప్పటినుండియు నా మేనమామలు నలుగురును లింగకాయలు కట్టుకొను ఆచారమును మానివేసినారు. తండ్రిగారికి ప్రతిసంవత్సరము ఆరాధన చేసేవారు. మా పెద మేనమామగా రగు రామయ్యగారు ప్రతిదినము పార్థివము చేసేవారు. వీరిది రాజోలుతాలూకా (అప్పుడు శివకోడు తాలూకా) కడలిగ్రామము. అక్కడనే నేను జన్మించితిని. వారికి, సమీపములో నున్న పొన్నమండలో కొంచముభూమి యుండేది. మా అమ్మగారు, పదిమంది మగవాండ్ర తరువాత

జన్మించుటచే, రామునికి చెల్లెలైన శాంత పేరు పెట్టుకొనిరట! ఈమేనమామ మిక్కిలి సాత్వికుడును, దైవచింతనము తప్ప, లౌకిక వ్యవహారములు తెలియని ఋశ్యశృంగునివంటి వాడగు మా తండ్రిగారి కిచ్చుట న్యాయముగానే యుండెను.

నేను పుట్టిన తరువాత, మాతండ్రిగారిని మాబామ్మ గారు యెక్కడికైనను పోయి, భార్యాబిడ్డలను పోషించుకొన వలసినదే గాని, తాను యీయనను కూర్చోబెట్టి పోషించ జాలనని వెడలగొట్టినది. మా పెత్తండ్రిగారు అదివరకే లేచి పోయి, భార్యాబిడ్డలతో, గూడవల్లిలో సముద్దారుపని సంపా దించుకొని జీవించ జొచ్చెను. ఇక మానాన్నగారికి యేమియు తోచలేదు. అంతవరకు, తహశ్శీలుదారు కొమారుడ ననుకొని నిర్లక్ష్యముగా, గ్రామములో సంగీతము పాడుకొనుచు, పండిత సాంగత్యము చేయుచు, వీధి అరుగుమీద కూర్చుని హాస్యము లాడుచు, అందరిని కడుపుబ్బ నవ్వించుచు, పురాణములు, వివిధరాగములలో చదివి వినిపించుచు, భోజనమునకు మాత్ర ము యింటికి వచ్చుచుండెను. ఇట్లెంతకాలము జరుగ గలదు? తన తల్లిగారు, తన సంసారమును పోషించనని నిరాకరించెను. తనకు ఒక్క సెంటుభూమిగాని, ఒక్క దమ్మిడిగాని లేదు. ఈయన తల్లిదగ్గర చాలా ధనమున్నదనియు గొప్ప లోగిలి వీరి కున్నదనియు మామేనమామలు తమచెల్లెల నిచ్చిరిగాని, యిట్టి బీదస్థితి సంభవించునని వారి కెంతమాత్రము అప్పటికి తెలియదు కదా! ఇక సంసారమీదుట యెట్లు? కొంత

కాలము కడలిలోను, కొంతకాలము, మా మూడవ మేన మామగారగు పాలపర్తి వాతేశంగారి గ్రామమగు, రామ చంద్రపురం తాలూకా పెదబ్రహ్మదేవములోను, మా అమ్మ గారితో యుండి నాచిన్నతనము గడపితిని. మాతండ్రిగారు, ఉద్యోగము కొరకు తిరుగుచు, తన కిష్టమున్నచోట స్నేహి తులతోను, బంధువులతోను కాలము గడుపుచుండిరి.

---

## అధ్యాయము ౨

నా బాల్యము

నేను కడలిలోను, బ్రహ్మదేవములోను, తెలుగుబడు లలో చదువుకొనుచుంటిని. నా రెండవ మేనమామగా రగు సుబ్బారాయుడుగారు కాకినాడ వెళ్ళి ఒక షాహుకారునొద్ద గుమాస్తాగా యుండుటచేత, మా నాన్నగారినికూడ అక్క డకు తీసికొనివెళ్ళినాడు. ప్రొద్దున మొదలుకొని మధ్యా హ్నము ఒంటిగంటవరకును దుకాణములో పద్దులు వ్రాసి వచ్చి భోజనము చేయగానే తిరిగి పోయి రాత్రి పది లేక పద కొండు గంటలకు యింటికి రావలసివచ్చుటచే మానాన్న గారు యీ గుమాస్తాపని చేయజాలనని నిరాకరించిరి. ఇక జీవించు టెట్లు? మేము ఫ్రేజరుపేటలో బొబ్బెళ్ళపాటి వెంకట రత్నముగా రింట్లోనుండగా మా అమ్మగారు, యింటిప్రక్క

నున్న హుజూరుశిరస్తాదారగు సాని బంగారయ్యగారి భార్యతో స్నేహముచేసి, తణుకుతాలూకా వెలగదుర్రు గ్రామమునకు రెండవ కరణముగా ఆమె శిఫారసుతో మానాన్నగారికి ఉద్యోగము సంపాదించిపెట్టినది. పురాణములు, శతకములు, సంగీతముతో వినిపించుచు, మంచి మార్దంగికుడుగ ప్రసిద్ధి వడసిన మా తండ్రిగారు ఒక కుగ్రామములో ఒక నిట్రాడ దూలముగల చుట్టుగుడిసెలో రు 7 లు జీతముమీద కరిణీకపు లెక్కలు వ్రాయుటకు మొదలుపెట్టెను, ఆగుడిసెలోనే భోజనము, పడక. గ్రామస్థు లందరు నా వైఖరినిబట్టి నన్ను పొడుముబుడ్డియని పిలచేవారు. తెల్లవారఝామున మాఅమ్మ నన్ను లేపేది. కచ్చికతో పండ్లు తోముకొని ఆ మిగిలిన కచ్చికతోనే మొఖము, ఒడలు పూసికొని తరువాణిఅన్నము తిని బడికి వెళ్ళి అందరికంటె ముందుగా వీధిఅరుగు యెక్కి కూర్చుని తెలుగుశతకమేదో చదువుచుండేవాడను. అమ్మ లక్కలు పాచిపనికొఱకు వీధిగుమ్మముల తలుపులు తీయగానే అదిగో శంభుడు వచ్చినాడని నవ్వుకొను చుందురు. నాకెప్పుడుమాబడిలో శ్రీయేగాని, చుక్కగాని దెబ్బగానిలేదు. మొదటివానికి చేతిలో శ్రీ యనియు, తరువాతవచ్చిన వానికి చేతులో చుక్కయు, అటుతరువాత వచ్చినవారికి, ఒక్కొక్క బెత్తపు దెబ్బయు మాపంతులుగా రిచ్చుట ఆచారము. పౌర్ణమి అమావాస్యలు ఆటవిడుపు గనుక, మేము ఆయనకు ఒక్కొకడబ్బు యిచ్చుకొనవలెను. ఆరోజులకు మాత్రము,

మా మామూలుపుస్తకములలోనిది కాక, ఒక క్రొత్తపద్యమును, పూర్వపురాణములనుండియో, లేక చాటుధారయో, మాకు కంఠపాఠమునకు యిచ్చుచుండేవారు. మేము పై పుస్తకములు పట్టినకొలది క్రిందితరగతుల బాలురకు పాఠములు, ప్రతిదినము కొంతకాలము చెప్పుచుండవలెను. ప్రతిసాయంత్రము మాలో ఒకరు పెద్దబాలశిక్షలోనున్న జాబితాలు యేకరువుపెట్టుచు, తక్కినవారందరిచేత, ఒక్కసారిగా వానిని తిరిగి చెప్పించుచు, దీపంజ్యోతిపరబ్రహ్మ యను శ్లోకముతో ముగించుచుంటిమి. ప్రతివాడును గంటము, తాటాకు చదర, శిరాబుడ్డి, కలము తెచ్చుకొనవలెను. మేము వరువడి, వర్జులు, తాటాకులమీదనే నేర్చుకొన్నాము. తరువాత కొన్నాళ్ళకు పీచుకాకితములు, పలక, బలపములు ఆచారములోనికి వచ్చినవి. తెలుగు, హిందుస్థానిభాషలలో యెక్కములు, అకరన్నకిరీలు (12 డో యెక్కము మొదలు యిరువదవ యెక్కమువరకు) చదువవలసినదే. ప్రతి మానములోను వర్జులు వేయుట నేర్చుకొంటిమి. అనేక శతకములు, భారత భాగవత రామాయణములలోని మంచి మంచి ఘట్టములు కంఠపాఠము చేసితిమి. ఆంధ్రనామ సంగ్రహమును, శేషయ్య వ్యాకరణమును చదివితిమి.

ఒకసారి మా అమ్మ తన మేనమామల గ్రామములగు వడలి, దేవ గ్రామములకు నన్ను తీసికొని వెళ్ళినపుడు, నా తరువాత మా అమ్మకు పిల్లలు కలుగలేదని నా తుంటి

మీద ఒక వేడియట్టును నా మేనమామ కూతురు రమణమ్మ అంటించినది. నేను బాధచేత కెవ్వున కేకవేసి యేడ్చినట్లు యిప్పటికిని జ్ఞాపకము. ఏనుగుకొమ్మువలె నా యేడవ సంవత్సరములో నాకు ఒక చెల్లెలు పుట్టినది. ఆమెకు మా బామ్మ రామలక్ష్మమ్మ పేరు పెట్టిరి. 1874—75 సంవత్సరములలో వచ్చిన కరణముల అరేంజిమెంట్లులో వెలగదుర్రు గ్రామమునకు ఒక కరణ ముంటే చాలునని పై వారు ఉత్తరవులనుబట్టి మానాన్నగారిని కరణీకములోనుంచి తగ్గించివేసిరి. కాని కాంపెన్సేషన్ క్రింద ఒక పుట్టెడు మెట్టయినామును నిచ్చిరి. దీనివలన సాలుకు యేబది రూపాయిలుమాత్రము వచ్చేది. ఇక వెలగదుర్రు వదలివేసి తిరిగి ఉద్యోగముకొఱకు కాకినాడ వచ్చితిమి. పూర్వపుచోటనే ఒక చిన్నయిల్లు అద్దెకు తీసికొని, మా నాన్నగారు ఒక షాహుకారునొద్ద నెలకు యేడెనిమిది రూపాయిలజీతముమీద ప్రవేశించెను. ప్రతి అపరధాన్యము కిరాణావస్తువులలోను కమీషన్ వచ్చుటవలన మా యిల్లు పెండ్లివారి గృహమువలె యెల్లపుడు నుండేది. కాని, ఆకోమట్ల నౌఖరీ చేయుటకు మానాన్నగారికి చాలా కష్టముగానుండేది.

ఆకాలములోనే నన్నింగ్లీషుస్కూలులో ప్రవేశపెట్టిరి. తెలుగు అదివరకే బాగుగా వచ్చి యుండుటచే, నేను యింగ్లీషురీడర్లు కొద్ది మాసములలోనే పూర్తిచేసికొని, రాజమహేంద్రవరములో మా పెత్తండ్రిగారింట్లోనుండి. యిన్నీసుపేట స్కూలులో మూడవక్లాసులో చేరితిని.

ఆకాలములో నేను వడ్డాది సుబ్బారాయుడుగారి శిష్యుడను నేను నలచరిత్ర ఆయినయొద్దనే, యిన్నీసుపేట స్కూలులో చదివితిని. నే నందరియిళ్ల మీద రాళ్లు రువ్వుచుంటి నని మాపెత్తండ్రిగారి భార్య, నన్ను తిరిగి మా తల్లి తండ్రులవద్దకు, కాకినాడకు పంపివేయించినది. నేనేకర్మము యెరుగను. నేను బాగుగా చదువుకొనుచుంటిని. ఆమె సవతి యప్ప పెనిమిటియైన అజ్జరపు రామన్నగారి యింట్లో మాపె త్తండ్రిగారు ఉండుటచే, వారందరు నాయందు మిక్కిలి దయ చూపించే వారు. తరువాత, 1875–76 సంవత్సరములో మాకుంటుబము కాకినాడనుండి రాజమహేంద్రమునకు తర్లింప బడి, అజ్జరపు రామన్నగారి యింటి వెనుక పత్రి నరసింహ్వా రావు పంతులుగారి యింటి దొడ్లో ఒక పెంకుటి పాకలో, అద్దె లేకుండ కాపురముంటూ, జవ్వాజివారి కొట్లలో నున్న ఆంగ్లోవెర్నాక్యులర్ స్కూలులో లోవర్ ఫోర్తుక్లాసులో ప్రవే శించితిని. క్లాసులో మొదటివాడనై యుండగా, నాకు రక్త విరేచనములు ప్రారంభించి, నాఉపాధ్యాయులు అప్పారావు, బాపనయ్యనాయుడుగార్లు, ఆసుపత్రిలో ఔషధము లిప్పించి నను, గంద్రాపు వెంకన్నగారు అటుకులు తినిపించినను, కుద రక పోవుటచే, నన్ను మండపేట తీసికొనివెళ్లి ఒక వైద్యుని చేత రసము పెట్టించగా నోరుపట్టి ఆరుమాసములు బాధపడి నాను. నా మేనత్త సావిత్రమ్మగారు నాకు సమస్తఉపచార ములు చేసి బ్రతికించినది గాని, చాలాకాలము మునిపళ్లి

బాధ కలిగి, తుదకు చెన్నపట్టణములో సుమారు 30 సంవత్సరముల క్రిందట కొన్నిపళ్లను పీకించి నూతనపళ్లను కట్టించుకొంటిని.

నాకు శరీరములో బలము పట్టకమునుపే, చదువు చెడిపోవునని భయపడి నేను రాజమహేంద్రవరము వచ్చెదనని మారము చేయుటవలన మా నాన్నగారు నన్ను మండపేటనుండి నడిపించుకొని తీసికొని వచ్చినారు. త్రోవలో రాత్రి వేమగిరిలో, ఒక పెండ్లివారింట్లో భోజనము దొరకినది. చేతిలో మాకేమియు డబ్బులేకపోవుటచేతనే, యిట్లు జరిగినది. కాళ్ళు వాచి బాధపడుచు రాగానే, మా అమ్మగారు నన్ను కౌగలించుకొని అనేక ఉపచారములు చేసి, కొన్ని దినములకు బాగుచేసినది. ఈమె సుగుణములును, ఫామేదా, తెలివితేటలు యిరుగు పొరుగువారి నందరిని యెల్లప్పుడు మిక్కిలి ఆకర్షించేవి. ఈమెను కొనియాడనివారెవరును లేరు. కడుబీదరాలైనను ఒకరిని యాచించక స్వగౌరవమును, మర్యాదయును నిలబెట్టుకొన్నది.' పసుపుపచ్చని శరీరముమీద యెల్లపుడు పసుపు వ్రాసికొని, కుంకుమబొట్టు పెట్టుకొని, అనేకాభరణములు దాల్చిన దానివలె కనుపడుచుండేది. పుట్టింటికి ప్రతిసంవత్సరము వెళ్లి తనకు ఝరీకోకలు వలదని తన అన్నగార్ల వద్దనుండి రొఖ్ఖసొమ్ము తెచ్చుకొని - 'యింటిఖర్చుకు వాడుకొనేది. ఇంటి సంసారము యీాదలేక, భూములమీాద శిస్తు పట్టుకొని వచ్చెదనని చెప్పి మానాన్నగారు మూాడు

లేక నాలుగేసి మాసములు వెలగదుర్రులో ఒంటరిగా కాలము గడిపే వారు. తణుకు మొదలైన గ్రామములకు బంధువులను, స్నేహితులను చూచుకొనుటకు వెళ్లి, యింటిమాట మరచిపోయే వారు. ఎవరింటిలోనో భోజనముచేసి గాని, కుండతో తాను వంటచేసికొని గాని, కాలము జరుపుచు, బండిసత్రైపతాణీ వారి భాగవతకలాపములు చూచుచు, వానిని చర్చించుచు, సంగీతముపాడుచు, మద్దెల వాయించుచు, పురాణములను శ్రావ్యముగ చదువుచు, గ్రామస్థులందరు సంతోషించునట్లు హాస్యరసపు మాటలు చెప్పుచుండుటయే. గాని, యింటిసంగతి బొత్తిగా మరచిపోయే వారు. ఆయన యింటికి, రాజ మహేంద్రవరము రాగానే, యీ రోజున బియ్యము నిండు కొన్నవి, బియ్యము తెప్పించుమని మా అమ్మ అడుగగా, చక్రరక్షకుడు, యేలాగో తనచక్రము అడ్డువేసి తీరునని చెప్పు చుండును. అప్పుడేలాగుననో తనఒంటినున్న చిన్న ఆభరణమును తాకట్టుపెట్టి, బియ్యము తెచ్చి మా అమ్మ వంట చేయుచుం డును. మా నాన్నగారు, తాలూకా కచ్చేరికి పోయి, అర్జీలు వ్రాసిపెట్టి, రోజుకు రెండణాలు మొదలు నాలుగణాలవరకు సంపాదించి తెచ్చేవారు. మా కుటుంబమునకు యీ స్వల్ప మొత్తము చాలకపోవుటచే, మా అమ్మగారు పారుపల్లి అచ్యుతరామయ్యగారి భార్యగుండా జవ్వాజి శ్రీరాములు గారి పడవలకు సప్లయిగుమాస్తాగా ధవళేశ్వరములో మా నాన్నగారికి పని చెప్పించినది. నేను స్కూలునుండి ఒక మధ్యా

హ్నమున రాగానే, మా అమ్మ యింతమొగము చేసికొని మిక్కిలి సంతోషముతో మానాన్నగారికి నెలకు పదిరూపా యిాల గుమాస్తాగిరి యైనదని నాతో చెప్పగా నాసంతోష మునకు మేరలేదు. గాని, నాచదువు చెడిపోవునని మిక్కిలి విచారపడితిని; కాని మా అమ్మ నన్ను ప్రతిదినము రాజమ హేంద్రవరమునకు తక్కిన బాలురతో ఒక యెద్దుబండిమిాద పంపగలనని నన్ను ఓదార్చినది. మేము 1876-77 సంవత్సర ములో ధాత కరువులో ధవళేశ్వరములో నుంటిమి. రాజ మండ్రి కాలేజీలో నాల్గవక్లాసులో (4th:Upper) చేరుటకు ప్రయత్నించితిని గాని, మార్కులు తక్కువగుటవలన, కాలేజివారు నన్ను చేర్చుకొనలేదు. ఆకాలములో అమాయకు డైన మానాన్నగారు, ఆబోట్లదగ్గర న్యాయముగా ప్రవర్తిం చుట కెట్లు పనికివచ్చును? ఆబోట్ల గుమాస్తాలు, సరంగులు కమిాషనులు కొట్టవలసి యున్నది. రహస్యముగా యీాయన కును చాలా సొమ్మును వారు యిప్పించగలుగుదురు. తలలు మార్చి తలలు తగిలించేవారుంటేనేగాని, ఆగుమాస్తాగిరి సాగ నేరదు. ముక్కుకు సూటిగా పోకూడదు. తాను తినక వారిని తిననీయక పోవుటచే, మా నాన్నగారిమిాద, ఆబోట్ల గుమా స్తాలు యజమానులకు చాడీలు చెప్పి ఆయన అసమర్థుడని నమ్మించి, కొద్దిమాసములలోనే ఆపనినుండి తొలగింపం జేసిరి. మేము ధవళేశ్వరములో నుండగా, మా నాల్గవమామయ్య బాపిరాజుగారు వచ్చి మామూలు ప్రకారము, రెండుమూడు

మాసములకు సరిపోయెడి తిండి సరంజాము కొని యిచ్చి, వెళ్ళిపోయెను. తమ చెల్లెల దారిద్ర్యమును అనుభవించుట చూడజాలక నా మేనమామలు మిక్కిలి జాలినొంది తమ శక్తివంచన లేకుండ, మే మెక్కడ నున్నను, కనిపెట్టి చూచుచు, యెట్టి లోపము లేకుండ చేయుచుండెడువారు.

నేను రాజమహేంద్రవరము టౌనుస్కూలులో Upper 4th క్లాసులో ప్రవేశించినాను. నా సహాధ్యాయులు చింతలూరి లక్ష్మీనారాయణగారును, శిరుగూరి లక్ష్మీనారాయణగారును యిప్పటికి జీవించియున్నారు. మేము యిన్నీసుపేటలో రోజుఖుర్దు లక్ష్మణరావుపంతులుగారింట్లో ఉండేవారము. ఒక అరవాయన శంకరయ్యగారు మాకు హెడ్డుమాస్టరు. ఈయనకు తెలుగు బొత్తిగా తెలియదు. ఈయన పట్టి తిక్కశంకరయ్య. పెన్సిళ్లతో, వ్రేళ్ళముడుసులమీద కొట్టుట, తలను గోడకేసి కొట్టుట, అగ్గిపుల్ల గీసి తలవెండ్రుకలను కాల్చుట, స్లోపుగానున్న డస్కులమీద నిలబెట్టుట, యీ మొదలగు శిక్షలను బాలురకు వేసేవాడు. రాత్రి 9 గంటలవరకు వెన్నెలలో కూర్చుండబెట్టి యూక్లిడ్డులో వరుసగా General propositions గాని, Particular enunciations గాని, లేక proofs గాని, పుస్తకము చూడకుండా మాచేత వ్రాయించేవాడు. తుదకు ప్రాణమువిసిగి, 1878 వ సంవత్సరములో కాలేజీలో జరిగిన పరీక్షలో నుత్తీర్ణుడనై, Upper 4th క్లాసులోనే చేరగలిగితిని. మా డివిజనులోనే

నెల్లపుడు మొదటి పిల్లవానిగానే యుంటిని. మా క్లాసు ఉపాధ్యాయుడు వావిలాల అద్వైతపరబ్రహ్మశాస్త్రిగారు. వారి మేనల్లుడు కొండిభొట్ల శివావధానిగారితో కలసి ఒక క్లాసులోనే చదువు చుండుటచేత, వారియింట్లోనే, ముఖ్యముగా నవరాత్రి ఉత్సవములలో భజనచేయుచు, విందులు కుడుచుచు ఉండేవాడను. ఇన్నీసుపేట ప్రయిమరీస్కూలులో 1876 వ సంవత్సరములో నేను చదువుకొనుచున్నపుడున్న నా ఉపాధ్యాయులు వడ్డాది సుబ్బారాయుడుగారు, నేటికిని జీవించి యున్నారు. వా రారోగ్యవంతులై, జూచునపు డెల్లను నాకు మిక్కిలి సంతోషము కలుగుచుండును.

———

## అధ్యాయము 3

### రాజమండ్రి కాలేజిలో విద్యాభ్యాసము

### (1878 to 1884)

నేను 1878 వ సంవత్సరములో రాజమహేంద్రవరము గవర్నమెంటు కాలేజిలో Upper Fourth class లో చేరితిని. మా చెల్లెలు రామలక్ష్మమ్మకు యేడు సంవత్సరములు రాకమునుపే, మా మేనత్త సావిత్రమ్మగారు, మా యింటి మీద ఋణముచేసి, పిడపర్తివారి పిల్లవానికిచ్చి వివాహము చేసినది. నా కప్పటికి సుమారు 14 సంవత్సరముల వయస్సు ఉండవచ్చును. నాకు కూడా, పెండ్లిలోపెండ్లి చేయవలెనని మా అమ్మగారు పట్టుపట్టినది. నాకంటె 2½ సంవత్సరములు మాత్రము చిన్నగానుండిన నామేనమామ రామయ్యగారి కొమార్తెకు వివాహము చేయదలచి యుండిరి. నామేనమామ, యిట్టి వరహీనవివాహమునుచేయుట మంచిది కాదని యెంతచెప్పినను మా అమ్మగారు, తన పుట్టింటివారి సంబంధము విడిపోవుననిన్ని ఆ పిల్లను నాకీయని యెడల, పెండ్లి తోరణములను త్రెంపివేసెదననిన్ని భయపెట్టుటచే, ఆమె యొక్కరితే, యింటి యాడపడుచగుటచే, ఆమెయందు గల ప్రేమవలన, నాకుకూడ వివాహముచేసిరి. మండపేటలో మా చెల్లెలు వివాహము కాగానే, కడలికి తర్లి వెళ్లితిమి.

నా భార్య నాకంటె పెద్దదిగా కనుపడుటవలన, పల్లకీలో ఒక యెత్తు తలగడా మీద మాఅమ్మ నన్ను కూర్చుండబెట్టినది. చివరదినము, బుక్కా భగ్గుండి నాకళ్లలో నాభార్య కొట్టుట వలన నేను యేడుపు మొదలుపెట్టితిని.

మాచెల్లెలను, మాఅమ్మమ్మగారు పెదబ్రహ్మదేవములో నున్న మా మేనమామ వాలేశ్వరుడుగారింటికి తీసికొని పోయినది. ఆమె వీధిలో కూర్చుని యెవరితోనో మాట్లాడుచుండగా, నాచెల్లెలు దొడ్లో ప్రాయి రాజేయుచు, పరికిణీ అంటుకొని, ఒడలు కాల్చుకొని అరచుచుండగా యీ ముసలమ్మ పరుగెత్తుకొని పోయి ఆ పిల్లమీద చన్నీళ్లు గ్రుమ్మరించినది. కొద్దిరోజులకే ఆ పిల్ల చనిపోయినది. మా తల్లిదండ్రులు, నన్ను రాజమండ్రిలో దిగవిడచి, పెదబ్రహ్మదేవము వెళ్లి, మా చెల్లెలను జీవముతో నుండగానే చూచినారు. ఈ పిల్ల బ్రతికితే యింక నెన్ని బాధలు పడియుండునో! ఈమె యత్తింటివారు కౌండిన్యసగోత్రులగుటచే, వశిష్ఠమహర్షి, ఉభయకుటుంబముల ప్రవరలలోను కలియుటచే, యీమె వివాహము అశాస్త్రీయము, గనుక వరుడీమెను తప్పక వదలివేసి యుండును. నిజముగా యావజ్జీవము వైధవ్య మనుభవించవలసినదే.

1879 వ సంవత్సరములో **5th Form** లో, యేలూరి లక్ష్మీనరశింహ్వాంగారు మా కుపాధ్యాయుడు. మాకు మెట్కాఫుగారు, వారమున కొకగంట ఆంగ్లేయవ్యాసరచనను నేర్పు

చుండెడివారు. మేము 1880 వ సంవత్సరములో ధార్వాడ వెంకటరావుపంతులుగారు క్రొత్తగా కట్టిన యింటిలో ఒక భాగములో నుండేవారము. అంతకు పూర్వము వారును, మేమును, ఫార్షి శ్రీనివాసరావుగారును పత్రి నరశింహ్వారావు గారి యింట్లో అద్దెకుండుటచే, మా కుటుంబమందు వారందరికి మిక్కిలి అభిమానము. నాయందు యెక్కువ వాత్సల్యతను కనుపరచేవారు. మాఅమ్మగారి యందును, మాకుటుంబమందును యెక్కువ దయచూపించి, తమ చేతనైన సహాయమును, వారి యాడంగులు మగవారును కూడ మాకు చేయుచుండిరి. 1880 సంవత్సరములో నేను మెట్రిక్యులేషన్ ప్యాసైనతరువాత ఫార్షి శ్రీనివాసరావుపంతులుగారు, F. A. క్లాసులో జీతము యీయనక్కరలేకుండ చేసిరి. నాపై క్లాసులో నుండిన వేదము వేంకటాచలముగారు నాకు విద్యావిషయములో మిక్కిలి సహాయపడిరి. ఆయన ఒకసంవత్సరము క్రిందటనే చనిపోయిరి. ఆయన తండ్రిగారు వేంకటరమణశాస్త్రి గారు మా కాలేజిలో సంస్కృతపండితులుగాను, అన్నగారు వేంకటరాయశాస్త్రిగారు టౌనుస్కూలు హెడ్డుమాస్టరుగాను ఉంటూ యుండిరి. మాఅమ్మగారు మాసంసారమును గడపుటలో యెంత నైపుణ్యమును కనుపరచినను, ఒక్కొకపుడు ఒంటిపూట భోజనముతో తృప్తినొందుచు, నాకు తనయిబ్బందిని కనుపడనిచ్చేది కాదు. నావలన ముందు సౌఖ్యము పొందగలనని తనకు మిక్కిలి నమ్మకము. నేనెన్నడు స్కూలు

జీత మిచ్చుకొనుట గాని, పుస్తకములు కొనుటగాని సంభ వించలేదు. నా మైనారిటీ వెళ్లగానే, యేపనిలోనో ప్రవేశ పెట్టి తాను సుఖపడవలెనని దేవుని కెల్లపుడు మ్రొక్కుచుం డెను. మానాన్నగారు, విష్ణుమూర్తి యెట్లో తనచక్రము అడ్డువేసి తీరునని చెప్పుచు, కచ్చేరీలకు, వెళ్ళుచు, దినమునకు రెండణాలో, నాలుగు అణాలో తెచ్చేవారు. లేకపోతే లేదు. మాకు భూమిమీద వచ్చు యేబదిరూపాయిలు బొత్తిగా చాలకుండా నుండేవి. నేను క్రిందిక్లాసు పిల్లలకు ప్రయివేటు ట్యూషన్ చెప్పి కొంచము గడించి తెచ్చేవాడను. నామూ డవ మేనమామగారగు పాలవర్తి వాలేశ్వరుడుగారు పెద బ్రహ్మదేవములో, కరణమునకు గుమాస్తాగా నుండి ముప్పది యెకరముల భూమిని సంపాదించి తరువాత అమలాపురములో సబురిజిస్ట్రారు ఆఫీసులో గుమాస్తాగా చేరినారు. ఆయన కాకినాడలో వివాహము చేసికొని, తనభార్య కాపురమునకు రాకముందే అమలాపురములో తాను బసచేసిన బొడ్డపాటి రామలింగంగారి కొమార్తెను తిరిగి వివాహము చేసికొనెను. ఆయన నాకేమైనను సహాయము చేయునేమోయని నేను చూచుటకు వెళ్లగా తాను జబ్బుస్థితిలో నుండి మంచముమీద నుండి లేవజాలకున్నాననియు, యెట్టి సహాయమును చేయజాల ననియు, చెప్పివేసినాడు. తరువాత కొద్దిదినములకే చనిపోయి, యిద్దరు బాలవితంతువులను మాత్రము దిగవిడచినాడు. ఇంతకు పూర్వమే మా నాల్గవ మేనమామ భార్యను, బిడ్డలను

పోగొట్టుకొని, తానుకూడ చనిపోయినాడు. ఇక మా జీవనమునకు నేను, మా నాన్నగారు తణుకు వెళ్లి భూముల నమ్ముకొని, 1881, 1882 సంవత్సరములలో సంసారము గడపినారము. నేను F. A. పరీక్షలో మా కాలేజిలో మొదటివానినిగా ఉత్తీర్ణుడనైతినని మా అమ్మగారు వినగానే తన కష్టము లన్నియు పోయి గట్టెక్కితినని మిక్కిలి సంతోషించెను. నేను బి. యే. క్లాసులో ప్రవేశించెదనని, ప్రయివేటు ట్యూషనువలనను, నాకు రాబోవు స్కాలర్షిప్పువలనను కుటుంబభారమును వహించెదనని ఆమెను యెంత ఓదార్చినను ఆమెకు నచ్చలేదు. కాని, అదివరకు ఆరుమాసములనుండి, ఒక కాలికి నంజుజబ్బు ప్రవేశించి కుంటుతూ ఉండగా యిప్పు డాజబ్బు యెక్కువై యేలూరు సాహేబుగారు యెన్ని యౌషధము లిచ్చినను లాభములేక, కంభం వారి సత్రములో మేము కొన్ని దినములు ఔషధ సేవ కున్నతరువాత 1883 సం॥ఫిబ్రేవరిలో మాఘశుద్ధ యేకాదశీ సాయంత్రము 7 గం॥కు మాఅమ్మ నన్ను కౌగలించుకొనుచు చనిపోయినది. ఆమెకు జబ్బులో సమస్తవిధములను యూడిగముచేసి, నాభార్య ఆమెయెడల ఋణము తీర్చుకొన్నది. నేనే వ్యర్థుడనై అమె కష్టములను తొలగించలేకపోతిని. ఆమె జీవించియున్న యెడల నా మాతృఋణమును కొద్దిగానైనను తీర్చుకొనుటకు ప్రయత్నించియుందును. నేను దురదృష్టవంతుడను. ఆమె మాత్రము స్వర్గము ఒకటియున్న యెడల దానిలో నుండుననుట

కెట్టిసందేహము లేదు. ఆమె సుగుణపుంజములరాసి. ఆమె ప్రతిచోటను, యెరిగినవారందరివలనను మిక్కిలి గౌరవమును పొందినది. ఆమె జీవితకాల మంతయు నా విద్యార్జనకొరకే సకల కష్టములు పడి సంసారము నీదినది. స్వగౌరవమును యెన్నడు పోగొట్టుకొని పొరుగింటికి యేవస్తువుకును, అరువుకైనను వెళ్ళేదికాదు. ఏవస్తువైనను లేకపోయినయెడల, అది లేకుండగనే సంసారమును చక్కబెట్టుకొనేది. ఇంత దారిద్ర్యము ననుభవించి, నేను కొంచెము అక్కరకు రాగానే, నన్ను విడచి వెళ్ళి పోయినది.

మా అమ్మగారు పోయినతరువాత యిన్నీసుపేటకు తిరిగివచ్చి, మా కాలేజి క్లార్కు పందిరి వీరభద్రయ్యగారి యింట్లో ఒక భాగము అద్దెకు తీసికొని నేను, మా నాన్నగారు, నా భార్య, ఆమె విధవఅప్ప సుబ్బమ్మగారు ఉండేవారము. నాకు కాలేజీలో నెలకు యిరువదిరూపాయీల స్కాలర్షిప్పులో పదిరూపాయిలుమాత్రమే నేను పుచ్చుకొని, తక్కిన పది రూపాయిలు నావంటి యితర బీదవిద్యార్థుల కిచ్చుటకు ఒప్పుకొని, నేను సరిపెల్ల గోపాలంగారి కుమారునికి చదువు చెప్పి, నెలకు రు 7 లు తెచ్చుకొనే వాడను. మా తండ్రిగారు మా అమ్మ పోయినప్పటినుండి మిక్కిలి విచారగ్రస్తుడై పోయెను. నా భార్య గర్భవతియై 1884 సంవత్సరము మార్చినెలలో పురిటికి కాకినాడ వెళ్ళినది. నేను, మా నాన్నగారు మాత్రము మా సంసారము నెత్తివేసి, మా కెవరు

స్త్రీదక్షత లేకపోవుటచే, రాఘవయ్యగారి కొట్లలో ఒక కొట్టు అద్దెకు తీసికొని, వంటపూటి యింట్లో నెలకు చెరి అయిదు రూపాయీ లిచ్చి భోజనము చేయుచుంటిమి. మెట్కాపుగారి శిఫారసుమూలమున Miss Haddon కు గణితము నేర్పి F. A. ప్యాసు చేయించుటకు ఆమె కుపాధ్యాయునిగా కుదిరితిని. Halketts Gardens కు ప్రతి సాయంత్రము వెళ్ళి ఒక గంట ఆమెకు చదువు చెప్పినందుకు నెలకు రు 15 లు యిచ్చేవారు. ఈ విధముగా నేను సీనియర్ బి. యే. క్లాసులో నెలకు రు 32 లు నా స్కాలర్షిప్పుతో కూడా కలపి, సంపాదించుకొనేవాడను. దీనిలోనుండి నెలకు స్కూలుజీతము రు 4 లు, భోజనమునకు రు 10 లు పోగా యింకను రు 18 లు, మా బట్టలకు పుస్తకములకు ఖర్చుపెట్టుకొనుటకు చాలినంత ద్రవ్యముండేది. మా అమ్మమాత్రము లేకపోయినది గదా యని మిక్కిలి ఖేదపడుచుండెడివాడను.

ఇట్లుండగా 1884 వ సంవత్సరము జూనుమాసములో ఒక రోజుమధ్యాహ్నము రెండు గంటలకు మా పెత్తండ్రిగారి అల్లుడైన గోవిందరాజుల భవనాశరావుగారి యింటికి నన్ను తక్షణము ఒకసారి రావలసినదని కబురు వచ్చినది. అవి వేసంగిసెలవుదినము లగుటచే, నేను ఒక్కడనే కొట్టులో నుంటిని. మా నాన్నగారు తాలూకా కచేరికి వెళ్ళియుండిరి. నేను తలుపు తాళము వేసికొని వారి యింటికి వెళ్ళగా నా భార్యాయును, పుట్టిన పిల్లవాడునుకూడ చనిపోయిరని మా

పెత్తండ్రి భార్యాయును, ఆమె కుమార్తెయును చెప్పినారు. అకస్మాత్తుగా నా కీవిషయ మెరిగించుటచేత నేను నిర్ఘాంత పడి యేమియు మాటరాక యూరుకొన్నాను. కంట తడి పెట్టలేదు. కొంతసేపటికి నన్ను స్నానము చేయవలసినదని లేవదీసినారు. ఇంతలో మా పెత్తండ్రిగారు మా నాన్న గారిని కలుసుకొని యీ దుఃఖవార్త తెలియచేసి, అక్కడకు తీసికొనివచ్చి, ఆయననుకూడా స్నానము చేయించి, మా కొట్టుకు మమ్మును ఆ సాయంత్రమే పంపివేసినారు. నేను మా నాన్నగారును, చెట్టుమీద పక్షులవలె, పూటకూళ్ల యింట్లోనే భోజనము చేయుచు, మైలదినములు గడపు చుం డగా, నా మేనమామయు, పిల్ల నిచ్చిన మామగారునగు పాలపర్తి రామయ్యగారు తన దుఃఖమును దిగమ్రింగి, నా యెడల గల ప్రేమచేత వచ్చి నాచేత కర్మ యథావిధిగా జరి పించి, నన్ను త్వరగా తిరిగి వివాహము చేసికొనవలసినదని చెప్పి వెళ్ళినారు. ఆ రోజులలో మా పెత్తండ్రిగారి కుటుం బమువా రెవరును రాక తరువాత నా వివాహము విషయమై ప్రయత్నించుచున్నామని మా పెత్తండ్రిగారి భార్యావచ్చి చెప్పినది. మాకు ఆడదిక్కు లేకపోవుట, నాకువైరాగ్యము హెచ్చుచుండుట, మా నాన్నగారు కనిపెట్టి, మనస్సు బేజారై పోయి మంచమెక్కెను. ఆయనకు ఊడిగము చేసేవారు యెవ రును లేకపోవుటచే నే నాయనను ఆసుపత్రిలో పెట్టి కావలసిన సొమ్ము ఖర్చు పెట్టెదనని యెంత చెప్పినను యిన్నాళ్ళు

బ్రతికి, ఆసుపత్రిలో రోగుల ఆరుపులు పెడబొబ్బల మధ్యను చావవలసి వచ్చుచున్న దనిన్ని నేను యేపిల్లనో తక్షణము వివాహము చేసికొన్న యెడల నాయత్తవారు నాకొలకు తనకు సమస్తఉపచారములు చేసెదరనిన్ని నేను తానుచెప్పినప్రకారము వివాహము చేసికోనియెడల తాను దుఃఖముతో ప్రాణము విడచెదననిన్ని, నా జీవితకాల మంతయు నేను పశ్చాత్తాప పడుదుననిన్ని; మిక్కిలి జాలివాక్యములతో ప్రాధేయపడెను. నేను మొండిపట్టు పట్టి, ఆయన జీవించకపోయినయెడల, నే నెవరిని సంరక్షించనవసరము లేనందున, పక్షివలె స్వతంత్ర ముగా కాశీరామేశ్వరములలో కాలము గడిపెదనని చెప్పి వేసితిని. ఆయన రుగ్మత హెచ్చుటకు యిదియు నొక కారణ మగుటచే, ధార్వాడ వెంకటరావు పంతులుగారును, నా స్నేహి తుడు పప్పు వెంకటరామయ్య తల్లి శేషమ్మగారును, మరికొం దరును, నన్ను వివాహము చేసికొనుటకు బలవంతపెట్టిరి. మా కుటుంబ గౌరవమును బాగుగా యెరిగిన వాడ్రేవు పాపమ్మజమీం దారిణీగారు, తమ మేనమామ ధరణిప్రగడ రామన్నగారి కొమా ర్తెను యిచ్చి వివాహము చేసెదననిన్ని నా తండ్రిగారికి యెట్టి లోపములు లేకుండ సమస్త ఉపచారములు చేయించెద ననిన్ని నన్ను ఒప్పించి, మమ్మునిద్దరినితీసికొనివెళ్ళి, ఆమెయేవివాహము జరిగించెను. నాభార్యకప్పటికి యెనిమిదిసంవత్సరములు. నాకు 18 సంవత్సరములు వెళ్లి 19 వ సం॥ జరుగుచుండెను. నాతండ్రి గారికి నా యత్తమామలు యెంతయో ఉపచారము చేసిరి. నేను

చాలాసొమ్ము ఖర్చుపెట్టి మందు లిప్పించితిని. కాని కార్యము-లేకపోయెను. తుదకు 1884 వ సంవత్సరము నవంబరుమాస-ములో కార్తీకబహుళ షష్ఠిరోజున మా తండ్రిగారు హరి సంకీర్తనము చేయుచు పరమపదించిరి. నేను ఆయనమాట-దాటకుండ వివాహముచేసికొనినందుకు నన్ను దీవించిరి. తన తల్లిదండ్రులకంటె యెక్కువుగా నా అత్తమామలు ఉప-చారము చేసినందుకు నే నెల్లపుడు కృతజ్ఞుడనై యుండుమని కోరినారు. నాకు నా అత్తవారుతప్ప నన్నాదరించినవారే లేరుగనుక వారియెడల నేను జీవించునంతవఱకును భక్తివిశ్వా-సము లుండకపోవు. ఇప్పటికిని, ఆ కుటుంబమువారుతప్ప, నా యనువారు నాకు లేరని చెప్పవలసినదే. దూరపుజ్ఞాతు లెంద రున్న లాభ మేమి? కష్టకాలమున కక్కఱకువచ్చినవారే తన వాండ్రు. తక్కినబంధువు లందరు ముఖపరిచితులుగా నెంచ వలసినదే. మా తండ్రిగారు చనిపోయినరాత్రి పట్టిన గాఢ నిద్దుర నేటివరకు నే నెన్నడు ననుభవించలేదు. దీనికి కార ణము హృదయము కొయ్యబారి నాకు ప్రపంచములో మిగి-లిన గొలుసుకొంకి నేటితో విడిపోయినదనిన్ని, నూతనముగా వచ్చిన యీ పసిపిల్లయగు భార్యయం దెట్టి ప్రేమయు జనించక పోవుటచే, నేను సంపూర్ణస్వాతంత్ర్యముతో, యెట్టి గుది కర్రయులేక, యిష్టమువచ్చిన-చోటికి వెళ్లిపోవచ్చుననిన్ని తోచి ప్రశాంతమైన మనశ్శాంతి యొకటి కలిగినది. ప్రొద్దున 7 గంటలకు నా స్నేహితుడు పప్పు వేంకటరామయ్య నన్ను

లేపి, దహనసంస్కారములు మొదలగువానికి కొంతసొమ్ము తెచ్చి కావలసినపను లన్నియు జరిపించినాడు. నా స్నేహితు లలో యితనే ఆకాలములో ముఖ్యుడు. ఈయనతల్లిని చూస్తే మా అమ్మను చూచినట్లుండి వీ రింటికి 1883, 84 సంవత్సరములలో తరుచుగా వెళ్లేవాడను. ఆ యలవాటు చేత, యీయన తండ్రి చనిపోయినతరువాత ఆమె దుఃఖము లో నున్నను, నేను వెళ్లి చూచుచుండేవాడను. ఇతని యాదరణను నే నెన్నిటికిని మరువజాలను. ఇతను 1889 సంవత్సరములో, గోదావరిలో యీదుచూ, అకాలమృత్యువువాత పడిపోయినట్లు నాకు చెన్నపట్టణములో నున్నపుడు తెలిసి, నా కెక్కడలేని దుఃఖము వచ్చి, నాలుగుదినములు అన్నహితవుకూడ పోయినది.

---

# అ ధ్యా య ము ౪



## చెన్నపట్టణములో అధ్యాపకత్వము

## 1885—1888

పూర్వము నలువదిసంవత్సరముల క్రిందట, బి. యే. పరీక్ష మదరాసులోనే జరుపుచుండిరి. పప్పు వెంకటరామయ్యగారు, యఫ్‌యే పరీక్ష ప్యాసుకాగల ననే ధైర్యముతో, తాను మద్రాసు యింజనీరింగుకాలేజీలో చేరెదనని, నాతోకూడ 1884 సం॥ డిసెంబరు నెలలో కాకినాడలో మా మేనమామల యింటికి వచ్చెను. హిమాలయా స్టీమరుమీద చెన్నపట్టణము, మూడవరోజు యుదయమునకు, మేముభయులము చేరితిమి. నేను పందిరి వీరభద్రయ్యగారి యొద్ద ముప్పదిరూపాయీలు బదులు తీసికొని చెన్నపట్టణము వచ్చితిని. అంతకుమునుపే, నా సహాధ్యాయులు, చిత్రపు వెంకటచలంగారు, చెరుకుమిల్లి వెంకటరామయ్యగారు, కస్తూరి మాణిక్యారావుగారు, అగస్త్య కృష్ణస్వామినాయుడుగారు,కొల్లా వెంకటరామయ్యగారు,మైలాపూరులో, బారిస్టరు మిచ్చెల్ గుమస్తాగారైన తోలేటి కేశవరామయ్యగారి యింటియొద్ద ఒక పాలెమ్మను వంటకత్తెగా పెట్టుకొని భోజనము చేయుచున్నారు. మేమును అక్కడనే బసచేసినాము. 1885 సంవత్సరము జనేవరి మొదటి వారములో మా బి. ఏ. పరీక్షలు జరిగినవి. పరీక్షలు కాగానే

చిత్రపు వెంకటాచలంగారు, బి. యల్. పరీక్షకు చదువుకొనుటకు నిలచిపోయిరి. నేనుతప్ప తక్కిన వారందరు తిరిగి వెళ్ళిపోయిరి. నా ఒక్క పొట్టకు చెన్నపట్టణములో జీవనాధారము కలుగచేసి కొనలేనా యనియు, నా కెవరును పోషింపబడుటకు దగ్గరబంధువులు లేరుగదా యనియు, నేను యెక్కడనుంటే యేమనియు మూర్ఖపు పట్టుదలతో, నా స్నేహితు లెంత ప్రతిమాలిసను దేశమునకు రాక నిరాకరించితిని.

చిత్రపు వెంకటాచలంగారును, నేనున్ను, తిరువల్లి క్కేణిలో, పార్థసారథి కోవెలయొద్దనున్న కోమటి బంగాళాయను దానిలో, మేడమీద ఒకకొట్టును అద్దెకు తీసికొంటిమి. ఆయన బి.యల్., క్లాసులో చేరినాడు. నేను యే కచేరీలోనో పాఠశాలలోనో ఉద్యోగము సంపాదించుకొనుటకు ప్రయత్నించితిని. నా చేతిలో డబ్బు అయిపోవు చుండుటచేత, అప్పుడు రివిన్యూబోర్డులో నున్న వల్లూరి జగన్నాథరావు పంతులుగారిని చూడగా, తనకు విజయనగరములో డిప్యూటీ కలెక్టరుపని యైనది గనుక తాను వెళ్ళిపోవుచున్నాననిన్ని తానేమియు చేయలేననియు స్పష్టముగా చెప్పివేసినారు. తరువాత స్మాలు కాజుకోర్టుజడ్జీగారైన పరిగి శ్రీనివాసరావు పంతులుగారిని చూడగా నాకు అరవము రాదుగనుక, యే ఆఫీసులోను చేర్చు కొనరని చెప్పిరి. పచ్చియప్ప కాలేజిదగ్గరనున్న గోవిందప్ప నాయకర్ స్కూలులో, ఆంధ్రపండిత పదవి ఖాళీగా నున్నదని విని, నేనుపోయి హెడ్డుమాస్టరుగారిని చూచి నెలకు యిరు

వది రూపాయీల జీతమునకే యుండునని చెప్పితిని. నేను బి.యే. పరీక్ష ప్యాసుకావచ్చుననియు, నా కాచిన్నపనియిచ్చి ఒకసంవత్సరము జామీనుబాండు తీసికొనుట న్యాయము కాదనియు, ఆ చిన్నపనికూడ నాకిచ్చుటకు నిరాకరించెను. అటుతరువాత, మౌంటురోడ్డుమీద, షాపులవారిని చూచుకొనుచు పోవుచుండగా కొందరు యువకులు బిలబిలలాడుచు, నీలు శిలావిగ్రహమునకు సమీపమున నున్న ఒక మేడలోనుండి బయటకు వచ్చుచుండిరి. అక్కడ ఫారాయిచ్చుచున్న ఒక పోలీసు కానెస్టేబులును, యిది యేమని యడుగగా, కొద్దిఅరవ తెలుగుతో అక్కడ డబ్బిచ్చి, ఆధ్యాపకత్వమును బోధించెదరని చెప్పగలిగెను. నేను చిన్ననాటనుండియు, విద్యనేర్పి డబ్బు కొంచముగా సంపాదించ నేర్చుకొనుటకు అలవాటుపడినవాడనైనందున, నేను సంతోషించి లోనికివెళ్లి అక్కడిక్లార్కును దర్శించితిని. నా స్థితిని, ఆయనకు యింగ్లీషులో మనవిచేయగా నా యందు దయకలిగి, హెడ్డుమాస్టరుగారగు జార్జిడంకను గారి వద్దకు తీసికొనిపోయినాడు. ఆయనకూడ, మీసకట్టు రాని, సుమారు 19 సంవత్సముల చిన్నవాడనగు నన్ను చూచి, తమాషాకు, యే డిపార్టుమెంటులో చేరుటకు నాకిష్టమున్నదని అడిగినాడు. ఆ కాలములో, అందరు బి. యేలు చేరుట కిష్టపడుచున్న రివిన్యూ డిపార్టుమెంటని నేననగానే, ఆత డుగ్రుడై తానేమియు సహాయము చేయననియు, విద్యాశాఖలో నెప్పటికిని ఉండుటకు యిష్టపడిన యెడల, అక్కడకు

రావచ్చుననియు చెప్పి పంపివేసెను. నా తెలివితక్కువతనమునకు నొచ్చుకొని, మరుచటిదినము, ఆయనకు క్షమాపణమొనర్చి మెడికల్ సర్టిఫికెట్టుకొరకు రాయపేట సర్జనుగారికి ఉత్తరము తీసికొని, ఆ సర్టిఫికెట్టుతో జార్జిడంకన్‌గారి నార్మల్ స్కూలులో ప్రవేశించినాను. ఇంకను బి. యే. పరీక్షాఫలితములు రాలేదుగనుక నాకు నెలకు రు 12 ల స్కాలర్షిప్పుమాత్రమే యిచ్చిరి. తెలుగుదేశములో యేస్కూలు మేనేజరుగారు శిపారసుచేసినను, యీవైపు బి. యేలకు నెలకు రు 20లు స్కాలర్షిప్పు యిచ్చే నిర్ణయము. కాని, అక్కడ ట్రెయినింగైన తరువాత, నేను దేశమునకు పోకుండా అక్కడనే యుండవలెనని యున్నదిగనుక, అట్టిసిపారసును నేను కోరలేదు. ప్రయివేటు విద్యార్థిగానే రు 14½ ల స్కాలరుషిప్పు తీసుకొని బి. యే ప్యాసైనను, అక్కడుండుటకు నిశ్చయించితిని. ఒకసారి ఆనార్మల్‌స్కూలు తెలుగుపండితుడు బ॥ శీతారామాచార్యులుగారు ఒకనెల శలవు పుచ్చుకొన్నప్పుడు, ఆయనపనులు నేనే నిర్వహించితిని. అక్కడి తెలుగుబాలురు, నా బోధనకు మిక్కిలి మెచ్చుకొనేవారు. ఇతరవిషయములను నేర్పునప్పుడు కూడ జార్జి డంకన్‌గారు, నా దగ్గరయుండి, నా విద్యాబోధన సామర్థ్యమునకు సంతోషించి, నాకిది యెట్లు పట్టుపడినదని ప్రశ్నించినారు. నేను చిన్నతనమునుండి క్రిందిక్లాసులలోని పిల్లలకుబోధచేయుచు, తుదకు హోడన్ దొరసానిగారిని యఫ్. యే. ప్యాసుచేయించితినని చెప్పగానే

నామీద అమిత దయకలిగి నేను బి. యే. పరీక్ష ప్యాసైన దినమున, అందరు అధ్యాపకులను, విద్యార్థులను స్కూలు హాలులో సమావేశపరచి, నన్ను బరిపెద్దగాను (Monitor) విద్యార్థులమీద సూపరింటెండెంటుగాను యేర్పరచెను. 15 బి.యే.లు, 5 యఫ్. యేలు, 50 మెట్రిక్యులేట్లమీద Monitor పదవిని చెలాయించుచు, వారు పిల్లలకు విద్యాబోధన నెట్లు చేయుచున్నారో కనుగొనుటయే నాపనిగా యేర్పడినది. వారిలో బందరు హైస్కూలు హెడ్డుమాస్టరుగానుండిన S. Muthu అయ్యరుగారును, గుంటూరు హైస్కూలు హెడ్డుమాస్టరు A. M. Sunderasiva గారును ఉండిరి. వారిద్దరు కొద్దిసంవత్సరములక్రిందనే చనిపోయిరి.

నేను స్కూలులోచేరిన మూడుమాసములకే, డంకన్ గారికి ఖాయలా ప్రవేశించి, యింగ్లాండుకుపోవుచు త్రోవలో శింహళద్వీపములోనే ప్రాణములు విడచిరి. అందరును నా యండపోయినదని నన్ను ఓదార్చవచ్చినవారే. నా దురదృష్టదేవత నాకూడానేయుండి నన్ను వదలదాయెను. డంకన్ గారు జీవించియున్నయెడల, యీరోజువరకు విద్యాశాఖలోనే యుండియుందును. నాకు నెలకు వచ్చే రు 14½ జీతములో, పూటకూళ్లమ్మకు రు 7-0-0 గదియద్దె రు 1-0-0 చాకలి మంగలి రు 1-0-0 బట్టలు రు 2-0-0, దీపముచమురు 0-8-0, పోగా మిగిలినది యితర బీదవిద్యార్థుల కిచ్చుచుంటిని. పాత

శాలకు రెండు మైళ్లదూరము నడచి వెళ్లేవాడను. ఎప్పుడైనను నలుగురు విద్యార్థులతో కలసి జట్కామీద 0-1-0 యిచ్చి యెండలలో వెళ్లేవాడను. అందరము కలసి సాయంత్రము నడచి వచ్చేవారము. ఒక్కదినమునను ఆలస్యముగా వెళ్లలేదనియు ఒక్కరోజుఅయినను నాగా లేదనియు, సంవత్సరాంతమున నాకు Wordsworth's works కాలేజి యధికారులు బహుమతి నొసంగిరి. నాసహాధ్యాయి గుంటూరు కాపరస్తుడు, చెన్నకృష్ణమ్మగారిగుండా, నాకు 1885 సంవత్సరములోనే రెంటాల వేంకటసుబ్బారావుగారు పరిచితులైరి. ఆ సంవత్సరములోనే యీయన హైకోర్టులో వకీలువృత్తియందు దసహ్యాతకలిగి, రసాయన శాస్త్రము పదార్థ విజ్ఞాన శాస్త్రము, మొదలగు Made Easy series ను ప్రచుర పఱచుచుండిరి. నేను స్కూలుకు పోవుటకు కావలసిన అత్యవసరములగు దుస్తులను కొనుక్కొని, అవి మాసిపోవునను భయముతో యింటికి రాగానే వానిని భద్రపరచి, రాజమహేంద్రవరమునుండి పట్టుకొనివచ్చిన చిరుగుచొక్కాలను బట్టలను కట్టుకొని, యెవరైనను చూచిపోవుదురని సిగ్గుచేత నా గదిలోనుండి బయటకు వెళ్లేవాడనుకాను. బి. యల్. క్లాసులో చదువుచున్న జయంతి రామయ్యపంతులుగారు, దురిశేటి శేషగిరిరావు పంతులుగారు, చిత్రపు వెంకటాచలం పంతులు గారు, బజ్జెపల్లి సూర్యనారాయణశాస్త్రిగారు మొదలగు స్నేహితులు క్లబ్బులకును, మీటింగులకును వెళ్ళేవారు. నేను

మాత్రము కట్టుకొనుటకు తగిన దుస్తులులేక బయటకు వచ్చే వాడను కాను. 1885 వ సంవత్సర మంతయు యిట్లు అతి దారిద్ర్యము ననుభవించుచున్నను, బీద విద్యార్థులకు నాశక్తి కొలది సహాయముచేయుచు, గొడుగు చెప్పులు కొనకుండానే కాలము గడపితిని.

జార్జి డంకన్‌గారు చనిపోగానే, సాధు శేషయ్యగారు హెడ్డుమాస్టరుగా వచ్చిరి. వీరు మిక్కిలి శాంతస్వభావులు. నా యోగక్షేమములనుగురించి, మా మామగారు వ్రాయ మంటె, మా రాజమండ్రి ప్రొఫెసర్లు సుందరరావు, నాగోజి రావుగార్లు తమస్నేహితులైన యీసాధు శేషయ్యగారికి వ్రాసి సమాచారములు తెప్పించుకొనుచుండిరి. నాకు మాత్రము, బంధువు లెవరియందును దయ దాక్షిణ్యములు లేక పోయెను. గుండె రాయిచేసుకొంటిని. విద్యార్జన యాలోచన తప్ప, నామనస్సు కేమియు యెక్కలేదు. నూతనముగా చేసి కొన్న భార్యయెడల ప్రేమ జనించదుకదా! నాకు తిరువలి క్కేణియే స్వగ్రామము. నేనక్కడనే పుట్టినట్లెంచుకొని, అర వము చదువుట, వ్రాయుట, మాట్లాడుట నేర్చుకొంటిని. ముత్తు అయ్యరుగారు, నాకు అరవమును, నేను ఆయనకు తెలుగును నేర్పునట్లు యేర్పాట్లు చేసికొంటిమి. 1885 వ సం॥ రం డిశెంబరు నెలలో యిద్దరు స్కూలు యిన్స్పెక్టర్లు బిక్కిల్, ఫౌలర్ గార్లు మా విద్యార్థుల నందరిని, అధ్యాప

కత్వములో పరీక్షించిరి. అందరికంటెను నాకే యెక్కువ మార్కులు వచ్చినవి. Chambers' Encyclopœdia బహుమతి చేసినారు. నాతరువాత A. M. Sundarasiva గారికి యెక్కువ మార్కులు వచ్చినవి. మమ్మిద్దరిని, అప్పుడు Director of public Instruction గా నున్న గ్రిగ్గుగారికి సాధు శేషయ్యగారు శిఫారసు చేయగా, అప్పటికి నార్మల్ స్కూలుగా నున్నదానిని టీచర్సు కాలేజిగా మార్చి మమ్ములను ఆయన, లెక్చెరెర్లుగా యేర్పరచెను. నెలకు యేబదిరూపాయలజీతము. సాధు శేషయ్యగారు నన్ను కాకినాడ కాలేజిలో రు 80 లు జీతముమీద పంపవలెనని చూచెనుగాని, నేను నిరాకరించితిని. నేను Telugu Mathematics Trained graduate ను అగుటచే, చెన్నపట్టణమున యేకాలేజిలోగాని చేర్చుకొనుట కెట్టి యభ్యంతరముండదు. ఇంతలోఁ సాధు శేషయ్యగారు బదిలీకాబడి, నూతనముగా యింగ్లాండునుండి మాకాలేజి ప్రిన్సిపాలుగా స్టోనుదొరగారు వచ్చిరి. నేనుకూడా లా క్లాసులో ప్రవేశించవచ్చునా యని అయనను ధైర్యము చేసి యడిగితిని. ఇంగ్లాడులో, యే పెద్దమనిషి యే యుద్యోగములో నున్నను, తన కిష్టమైన లెక్చెర్లు వినవచ్చుననిన్ని అంతమాత్రముచేత ఉద్యోగభంగ ముండదనియు చెప్పుటచే, నేను 1886 సంవత్సరములో లాక్లాసులో చేరితిని. జార్జిడం కన్గా రున్నయడల, ఆయన యిట్టిపనికి యెన్నడును ఒప్పుకొని యుండకపోవును. నాజీతములో నుండి పందిరి వీరభద్ర

య్యగారి అప్పు తీర్చివేయుటయే గాక, నేను రాజమహేంద్రవరము కాలేజీలో నున్నపుడు తీసుకొన్న స్కాలర్షిప్పంతయు నెలకు రు 10 లు చొప్పున, మెట్కాఫు దొరగారికి, బీదవిద్యార్థుల యుపయోగము నిమిత్తము, మనియార్డరు ద్వారా పంపివేయుచుంటిని. బీదవిద్యార్థుల ఫండుకు సరిగా న్యాయముగా యిచ్చినది నేనొక్కడనే యని ఆయన మెచ్చుకొని నాకు త్తరములు వ్రాయుచుండేవారు. నేనెల్లప్పుడు ఆయనకు కృతజ్ఞుడను. తన కాలేజిలో, నాకంటె సన్మార్గప్రవర్తనుడు గాని, ఇంగ్లీషు లెక్కలలో యఫ్. యే. పరీక్ష ప్యాసుచేయించగల సమర్థుడుగాని లేడని, అవివాహితగా నుండిన Haddon దొరసానికి శిఫారసుచేసి, నాస్కాలర్షిప్పుతో పాటు, నెలకు రు 15 లు, బి. యే. క్లాసులో జీతమిప్పించెను. కాలేజిలైబ్రేరి తాళములు నా చేతికిచ్చి, రాత్రిళ్లు రాఘవయ్యగారి కొట్లలో బదులు, కాలేజిలైబ్రేరిలోనే పండుకొనుమని సలహాయిచ్చినాడు. నాకు నాల్గవఫారమునుండి, ఆంగ్లేయ యుపన్యాసము నేర్పి, పైక్లాసులలో నా Composition మెచ్చుకొని, నాకు ఉత్సాహజనకమైన వాక్యములు పలికేవాడు. తుదకు, బి. యే. పరీక్షలో నాకు Optics and Astronomy లో వచ్చినమార్కులు తెప్పించి, నాకు Maximum రాబడినదని వ్రాసినాడు. ఈగ్రంథములే, ఆయన, నాకును, చిత్రపు వెంకటచలంగారికిని, మూడురాత్రిళ్లు తన బంగాళాలో నేర్పెను. అట్టివానిని నా జీవితకాలములో మరచుటెట్లు?—పార్థి శ్రీనివాస

రావుగారు, మొదట నా బీదతనమును గురించి, ఆయనతో చెప్పి మెట్రిక్యులేషన్ ప్యాసైన తరువాతకూడ, కాలేజి వదిలే వరకు Free scholorship యిప్పించెను. వీరినిన్ని, మాకు యిల్లు అద్దెలేకుండా యిచ్చిన ధార్వాడ వెంకటరావు పంతులు గారినిన్ని యీ బొందిలో ప్రాణమున్నంతవరకు మరువ జాలను.

ఆదినములలో, సముద్రతీరమందున్న ఉత్తరసర్కారులకును, మద్రాసుకును రైలుమార్గము లేదు. కాబట్టి మన దేశపు తెలుగువారు మిక్కిలి అరుదు. ఆంధ్రవకీళ్లలో తల్లాప్రగడ సుబ్బారావుగారు, తుమ్మలపల్లి రామారావుగారు, రెంటాల వెంకటసుబ్బారావుగార్లు ముఖ్యులు. మొదటివారు గొప్ప ప్రతిభాశాలురు: స్టాట్యూటరీ శివిలుసర్వీసులో మొదటివాడైనను, శాసనసభలో నుంటూ మిక్కిలి పలుకుబడిగల రెండవ ఆయన కుమారుడు వరదారావుగారికి కలెక్టరు ఉద్యోగము అన్యాయముగా యీయబడినది. మూడవవారు, నావలెనే, స్వకాయకష్టముమీదనే యాధారపడి, తాను చెన్నూరు కరణము కొమారుడైనను స్వతంత్రజీవనమును సంపాదించుకొనవలెనని, కాలికట్టు చర్చి అఫుస్కాల్లెండు, గుంటూరు కాలేజీలలో ఉపాధ్యాయ పదవుల యందుండి, లాకాజీలోచేరి, బి. యల్. పరీక్ష ప్యాసై హైకోర్టు పట్టాపుచ్చుకొని, ఆడ్వకేటు జనరల్ షెప్పర్డుగారివద్ద పనినేర్చుకొని, ఒక సంవత్స

రము మాత్రము ప్రాక్టీసుచేసి, న్యాయవాదవృత్తి, దానివలన కలుగు వరుంబడికిని అసంతృప్తి అసహ్యముకలిగి, స్కూలు పుస్తకములు Made Easy series వ్రాసి అధికధనమును సంపాదించ గలుగుచుండిరి. పెప్పర్డుగారు, ఆయనను ప్రాక్టీసు విడువవలదనియు, హైకోర్టు జడ్జీపదవి ఆయన ప్రతిభావంతు డగుటచే తప్పక లభించుననియు యెంతబోధించినను, హైకోర్టు జడ్జీకంటె, తానెక్కువ సులభముగ, యెక్కువధనమును సంపాదించుకొనగలననియు, తనగౌరవము హెచ్చుగా నుండు నుగాని తగ్గదనియు జవాబు చెప్పుచుండెను. తరువాత పెప్పర్డుగారు హైకోర్టుజడ్జీగానుండి, వీరిద్దరికిని అన్యోన్యస్నేహ మెక్కుడుగ నుండుటచే తిరిగి ప్రాక్టీసుచేయించి తనప్రక్కను కూర్చొనునట్లు చేసెదనని యెంతచెప్పినను, తనస్వాతంత్ర్యమును అట్టి పదవులకు వదలనేరనని స్పష్టముగా చెప్పివేసెను.

మా లాక్లాసులు, బుధవారము సాయంత్రము ఒక గంటయు, శనివారము ప్రొద్దున రెండుఘంటలును మాత్రము పెట్టేవారు. నా కాలేజి ఉద్యోగమునకు భంగములేకుండా, ప్రెసిడెన్సి కాలేజిలో నుండి యీ లా క్లాసులకు సరిగా హాజరు కాగలిగియుంటిని. నేను మంచిదుస్తులు, కొనుక్కొంటిని. జట్కామీద కాలేజికి వెళ్లి, అధ్యాపకవిద్యార్థులమీద కర్రపెత్తనము చేయుచు వారు పాఠములు చెప్పుచుండు సమయములలో నేను సలహాల నిచ్చుచుండుటయే నా విధాయకకృత్యము.

ప్రతిసాయంత్రము, కాలేజీలో, మాప్రిన్సిపాలుగారు మొదలైన వారితో క్రికెట్టుఆడి, యింటికి నడచియే వచ్చేవాడను. నాకు మధ్యాహ్నము నా వంటమనిషి, సూరం సుబ్బయ్య ఫలాహారము తీసుకొని వచ్చేవాడు. ఇతనికి మొదట నెలకు రు6 లును, తరువాత రు8 లును జీతమిచ్చేవాడను, ఇతను నా ఒక్కనికే గాక, కోమటిబంగాళాలో చదువుకొను నా తెలుగు స్నేహితులకు కూడా కలపి వంటచేసి చాలాసొమ్ము గడించేవాడు. ఇతనికి ఒక ముండకూడా యుండేది. భార్యను నెల్లూరుదగ్గర ఒక కుగ్రామములో వదలివేసి, తా నొక్కడే చెన్నపట్టణములో యుండేవాడు. వీరు తుమ్మగుంట ద్రావిళ్లు. కొద్దిసంవత్సరముల క్రిందటనే, బందరువచ్చి, కొంత జమాబంది యీ వైపులకు తనపూర్వపరిచితులనుండి చేసికొని వెళ్లెనుకాని, మిక్కిలి వృద్ధుడగుటచేత చనిపోయి యుండవచ్చును.

1886వ సంవత్సరములో చిత్రపు వేంకటాచలంగారును బజ్జేపల్లి సూర్యనారాయణశాస్త్రిగారును, సీనియర్ బి.యల్. క్లాసులో చదివి 1887 వ సంవత్సరము జనేవరిలో బి.యల్. పరీక్షకువెళ్లిరి. మా వెంకటచెలం ప్యాసుకాక పోవుటచే నాతో పాటు 1888వ సంవత్సరములో తిరిగి పరీక్షకు వెళ్లి ప్యాసైనాడు. నేను 1887వ సంవత్సరము మార్చినెలలో సీనియర్ బి.యల్.క్లాసులో చదువుచు, క్రొత్తగా యల్.టి. (Licentiate of Teaching) అను డిగ్రీని విశ్వవిద్యాలయము వా

రేర్పరుచుటచే దానికి, మాస్టేనుదొరగారి ప్రోద్బలముచే నేను వెళ్లవలసి వచ్చినది. నేను ప్యాసైతినికాని, మాకు గౌనులు మొదలైనవి ఆసంవత్సరములో యేర్పాటు కాకపోవుటచే, 1888వ సంవత్సరముమార్చి కాన్వకేషనులో, బి.యల్. డిగ్రీతోపాటు యల్.టి. డిగ్రినికూడ తీసికొంటిని. ఈమొదటి బాచీలో, నాతో వెళ్లి యల్.టి. ప్యాసైనవారు ప్రెసిడెన్సి కాలేజి ప్రొఫెసరు, పి. సుబ్రహ్మణ్యఅయ్యరుగారు, పచ్చియప్ప కాలేజి ప్రొఫెసరు, టి.ఆర్. రామనాథయ్యరుగారు, వీరిద్దరు కాలము చేసినారు.

1887సం॥ జనేవరిలో జరుగు బి.యే. పరీక్షకు, నా స్నేహితులలో నొకడగు అడవికొలను కనకరాజుగారు చెన్న పట్టణము వచ్చినారు. ఆయన కప్పటికి అయిదుగురు తమ్ములు, వీరిది బహుబీదకుటుంబము. బ్రతికిచెడ్డవారు, కొల్లేరులోని అడవికొలను అగ్రహారీకులు. నా జీతములో, నా ఖర్చులు పోను ప్రతినెలయు కొంత మిగులుచుండుట బట్టి, ఈ మిగి లినది వృథాగా ఖర్చు అగుచుండునేమో యని భయపడి, ఆయనను లా క్లాసులో చేరవలసినదని ప్రోత్సాహపరచి చేర్పించితిని. అతనిభార్యాకూడా కాపురమునకు వచ్చుటవలన, ఒక్కొక శెషనులో కుటుంబముతో చెన్నపట్టణములోనుండుట తటస్థపడినపుడు, నాజీతములో ముప్పదిరూపాయీ లాయన కిచ్చి నేను యిరువది రూపాయీలతోనే కాలము గడుపు

చుంటిని. శెలవులలో ఆయన యూరికి వెళ్లినపుడు నాకు డబ్బు మిగులు చుండునుగాన, మా యిద్దరికిని లా క్లాసు జీతములు సులభముగానే నీయగలిగియుంటిని. ఒకప్పుడు నాదగ్గర చాలినంతసొమ్ము లేకపోయినయెడల, మా రెంటాల వెంకట సుబ్బారావుగారు నే నడుగగానే బదులిచ్చేవారు. నేను నాజీతములోనుండి త్వరగా తీర్చివేసేవాడను. మా కనక రాజును ప్లీడరీప్యాసు చేయించినయెడల, అతని మూలమున అతని తమ్ములందరు వృద్ధిలోకి వచ్చెదరను కుతూహలముతో యీ సహాయము చేయుటకు కారణమైనది. ఇదిగాక, నేను బీద విద్యార్థుల కష్టములను గుర్తెరింగిన వాడనుగాన నా సంపాదన బీద విద్యార్థులకు, సాధ్యమైనంతవరకు ఉపయోగింపవలెనని నాతలంపు. ఇదిగాక అప్పటికి నేను ఒంటరివాడను. కుటుంబ జంఝాటనము లేదు. విరాగిని—డబ్బు దాచుకొనవలెననే బుద్ధి పొడమ లేదు. డబ్బు మిగులుచు కొనుటకు ప్రయత్నించి నయెడల, ఆ చెన్నపట్టణములో దానిని దుర్వినియోగము చేయుదునేమోయనియు, అనవసర వస్తువులుకొని నిరాడంబర జీవనము పోగొట్టుకొందునేమోయనియు నా భయము. నేను కొవ్వూరు ఆంధ్రగీర్వాణ పీఠమునకు సహాయముచేయుటకు, రాజమండ్రిలోనున్న యితర స్నేహితులతోపాటు యీయన నుకూడ కోరియుంటిని. తనకు నలువదేండ్లక్రిందట చేసిన సహాయమునకు బదులు, తాను, అకస్మాత్తుగా 1928 సంవత్సరము, 24వ డిశంబరు తారీఖున నా కిష్టమైన ధర్మమును

చేయమని నా చేతికి రు 500 లు యిచ్చినాడు. నే నిచ్చినది ఋణముకాదు. తాను ధర్మదేవతకు ఋణపడినట్లు యెంచిన యెడల, తానే ధర్మము చేసికొనవలెనుగాని నా యుత్కృష్ట దానమునకు యీనాడు ప్రతిఫలముగ దీనిని అంగీకరించ ననియు నాయింటికి వచ్చినవానిని తిరస్కరించి, ఆ సొమ్ము యిచ్చివేయుట భావ్యముకాదని యెంచి, నాకు కోవూరులో నున్న ఖాళీస్థలములో సత్రముకట్టునప్పుడు, యితనిసొమ్ము అసలీఫాయిదాలతో యితని పేరనే ఒక గది కట్టెదననియు యితనికి ఒక దీర్ఘ యుత్తరము వ్రాసినాను. ఇప్పుడు ఆసొమ్ము ను దానిమీఁద నడ్డీయును ఉపాధ్యాయ మందిరముక్రింద ఖర్చు పరచితిని.

1887 వ సంవత్సరము వేసంగులలో, మా టీచర్సు కాలేజి సైదాపేటకు ట్రాంసుఫరుచేసినారు. అచ్చట, అదివరకు మెసీనియరు దొరగారి యాధిపత్యముక్రింద మంచి హైస్కూలుండేది. యీ కాలేజికి దానిని ప్రాక్టిసింగు స్కూలుగా మార్చెదరని వదంతి పుట్టుటచే, సైదాపేటలోని వారందరు తమపిల్లలను చెన్నపట్టణము పంపుటకు ప్రయత్నించుచున్నారని విని నన్ను వేసంగిశెలవులలోకూడా సైదాపేటలో ఉండవలసినదని డైరక్టరుగారు ఆర్డరువేసినారు. సర్. వి. భాష్యమయ్యంగారి తమ్ముడైన రాఘవాచార్యులుగారి యింటి యెదుట ఒక వైష్ణవుల యింటిలో ఒక భాగమును

అద్దెకుతీసుకొని సైదాపేటలో పదిమాసము లుంటిని. పప్పు శేషమ్మగారు, మదరాసునుండివచ్చి కుండలు మొదలైనవి కావలసిన వస్తువులుకొని, నాకొక సంసారము నేర్పరచినారు. వంట బ్రాహ్మణుడు పట్టణమునుండి తెల్లవారు ఝామున బయలుదేరివచ్చి సాయంత్రముకూడా నాకు వంటచేసిపెట్టి తానుతిని తిరిగి పట్టణము, ముండకొరకు వెళ్లుచుండేవాడు. నెలకు రు 8 లు జీతము మాత్రము తీసికొని, తన ముండను వదలలేక, దానికొరకు ప్రతిదినము 12 మైళ్ళు నడిచేవాడు. శనివారము, ఆదివారములలో, పట్టణములో పప్పు శేషమ్మగారి యింటిలోనే యుండేవాడను. అప్పుడు ఆమె కొమారుడు వెంకటరామయ్య బి. యె. ప్యాసై తానుకూడా నాతో యుండవలెనని యింజనీరింగు క్లాసులో చేరక బి. యల్. క్లాసులోనే చేరినాడు. బుధవారము సాయంత్రము లాక్లాసుకు, జట్కామీద సైదాపేటనుండివచ్చి, మరుచటి దినము ప్రొద్దున యెగ్మూరుకు నడచివెళ్ళి రైలుమీద సైదాపేటకు తొమ్మిది గంటలకే వచ్చేవాడను. ఈ విధముగా మా చిత్రపు వేంకటచలం గారిచ్చిన పుస్తకములనే చదువుకొని, బి.యల్. పరీక్షకు 1888 సం॥రం జనేవరిలో వెళ్ళితిని. ఒక రోజు రాత్రి 10 గంటలకు జట్కామీద మా పప్పు వెంకటరామయ్య వచ్చి, నేనున్ను మా వేంకటచలముకూడ పరీక్షలో నుత్తీర్ణుల మైతిమని చెప్పినాడు. ఆ సంవత్సరము మార్చినెలలో కాన్వొకేషన్‌లో, బి. యల్, యల్.టి. డిగ్రీలను రెంటిని ఒక్కసారే

తీసికొంటిని. ముందుగా బి.యల్. ప్యాసైనవారితో కూర్చుని, గౌనుహుడ్డు తగిలించుకొని, తరువాత యల్. టి. ప్యాసైన తక్కిన యిద్దరితో కూర్చుని, పూర్వపు గౌనుమీదనే మరి రెండవ గౌనుహుడ్డు వేసికొంటిని. ఏకకాలమందు రెండు డిగ్రీలు తీసికొనుటకు విధానము అదివర కేర్పడి యుండక పోవుటచే యూనివర్సిటీ రిజిస్ట్రారు విల్సనుదొరగారు కొంత కష్టించవలసి వచ్చినది.

ఈ1888 సంవత్సరములోనే పల్లెటూరి గ్రామస్థులకు లాసంగ్రహము అనేపుస్తకమును తయారు చేయుచు, విరివిగా ప్రకటనచేసి కంటూల వెంకటసుబ్బారావుగారు అమితధనము సంపాదించుటకు మొదలుపెట్టిరి. ఈపనిలో తనకు సహాయముగా నుండుటకు తన యిద్దరుచెల్లెండ్ర పెనిమిటులను వారి పిల్లలను రప్పించి తన యింటిలోనే యుంచుకొనెను. నా యందు మూడేండ్లనుండియు అత్యంత ప్రేమవాత్సల్యములు కనుపరుచుచున్నవా డగుడచే, నన్ను మిడిల్‌స్కూలుకు ఒక గణితగ్రంథమును వ్రాసిపెట్టవలసినదనియు, రు1500లు నాకు పారితోషిక. మిచ్చెదననియు, యిన్ని పరీక్షలు ప్యాసై, గవర్నమెంటుక్రింద యేబదిరూపాయీల జీతముమీద నేమి సంపాదించుకొనగలననియు, చాలాకాలమునకు గాని పెద్ద యుద్యోగము నాకు లభించదనియు నాకు నచ్చచెప్పిరి. అప్పుడు యింగ్లీషు, గణితము, చరిత్ర, యీ మూడింటిలో

యమ్. యే. ప్యాసుచేసెదననియు, నాకు నెలకు రు 100 జీత మైనను తక్షణము గవర్నమెంటు కాలేజీలలో యిప్పించగలిగిన యెడల యెప్పటికిని విద్యాశాఖలో నుందునని డైరక్టరు గారితో మనవిచేసితిని. ఆయన మద్రాసు, కుంభకోణము, రాజమండ్రికాలేజీలు మాత్రమే గవర్నమెంటుక్రింద నున్నవనియు నాకంటె ముందుగా పది సంవత్సరములక్రింద పనిలో ప్రవేశించిన మల్లాది వెంకటరత్నంగారికి రు 75 లు మాత్రమే జీతము నిచ్చుచున్నారనియు, ఆ జీతమునకు నన్ను డిప్యూటి యిన్స్పెక్టరుగా పంపెదననియు చెప్పగా నేను దాని కంగీకరించక ఉద్యోగమునకు రాజీపెట్టినాను. ప్రవేసించినపుడు, నేను వ్రాసిన బాండుషరతుల ప్రకారము మూడు సంవత్సరములైనను విద్యాశాఖలో పని చేయనందున నేను పుచ్చుకొన్న స్కాలర్షిప్పు మొత్తము రు 170 లు తిరిగి గవర్నమెంటు వారికి దాఖలు చేసికొనవలసివచ్చినది.

———

# అధ్యాయము ౫



## రెంటాల వేంకటసుబ్బారావుగారితో సాహచర్యము

## 1888—1894

ప్రప్రథమమున యీయనజీవితచరిత్ర, సంగ్రహముగా తెలుపవలసియున్నది. ఈయన నివాసస్థలము, కృష్ణాజిల్లాలో గుడివాడ తాలూకా చెన్నూరుగ్రామము. ఆ గ్రామకరణము గార్లగు రెంటాల శేషయ్యగారికీయన రెండవకొమారుడు. ఇప్పుడీయన అన్నగారగు లేటు వేంకటరామయ్యగారి దత్త పుత్రుడు నారాయణరావుగారు చెన్నూరు గ్రామకరణముగానున్నారు. తమ్ముడు నరశింహ్వారావుగారున్ను చెల్లెలు లక్ష్మమ్మగారున్ను యిప్పుడు జీవించియున్నారు. మన సుబ్బారావుగారు, గుడివాడ తాలూకా దగ్గుమిల్లిగ్రామములో, తన మేనమామలగు పింగళి పున్నయ్య, బాపిరాజు, తాతయ్యగార్ల యింట్లో ది 3-8-1860 తేదీని జననమొందిరి. చిన్నతనములో గుడివాడ స్కూలులో చదువుకొనుచున్నపుడు మందపాడులో, యీయన పినతల్లి తుమ్మలపల్లి వెంకమ్మగారి యొద్ద నుంటూఉండెను. తరువాత బందరునోబిల్ కాలేజీలో చదివి, ఎఫ్. యే, పరీక్షలో మొదటివాడుగా కృతార్థుడై మిషన్‌వారి స్కాలర్షిప్పుతీసికొని, మద్రాసుక్రిస్టియన్ కాలే

జీలో బి. యే. పరీక్ష ప్యాసుచేసెను. బందరులో, పూట కూళ్లమ్మయింట్లో భోజనముచేయునపుడు, అక్కడకు, పర దేశములనుండి వచ్చిన యింద్రజాలికులతో స్నేహముచేసి, వారివిద్యకొంత సంపాదించెను. ఆపూటకూళ్లమనిషి యింటి లోని చెంబులు మొదలగునవి, యింటిమీదికిని, దొడ్డిలోనికిని పోవుచు, మటుమాయమగు చుండుటవలన, యీయనగొప్ప మంత్రవేత్తయనినమ్మి, అచ్చటనుండి వెడలగొట్టబడగా, మాకర్లవారి సత్రములో స్వయముగా వంటచేసికొని జీవించవల సినవాడాయెను. ఈయన బి. యే. పరిక్షప్యాసయేవరకు మిక్కిలి పొట్టిగానుండి, తరువాత అకస్మాత్తుగా ఒకటిరెండు సంవత్సర ములలో, మిక్కిలి పొడుగువాడాయెను. డాక్టరు మిల్లరుగారు, యీయనను మిక్కిలి ప్రేమించుటచేత, బి. యే. ప్యాసుకాగానే, కాలికట్టుకాలేజీలో సైయన్సు లెక్చరరుగాపంపెను. అక్కడ పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రములేగాక, శారీరశా స్త్రముకూడ బోధచేయవలసి వచ్చినపుడు, అప్పటికాయా శాస్త్రములలోని యుద్గ్రంథములనన్నిటిని సేకరించిచదివి, విద్యార్థులకు బాగుగానుపదేశించుటచేత, యీయనయందు విద్యార్థులందరు మిక్కిలి గౌరవముచూపుచుండిరి. ఈయన శిష్యులలో హైకోర్టు జడ్జీగానుండిన లేటు పి. ఆర్. సుందర య్యరుగారొకరు. ఈజడ్జీగారు చనిపోయేవరకు, మనసుబ్బా రావుగారియందు వీరు గురుభావమును కనుపరచుచుండేవారు.

సుబ్బారావుగారు, బి. యల్. పరీక్షకు చదువవలెనని, మద్రాసులోని చర్చిఆఫ్‌స్కాట్లెండు మిషన్‌స్కూలులో ఉపాధ్యాయపదవిని సంపాదించి రెండేండ్లు అక్కడపనిచేసి బి.యల్ పరీక్షకు వెళ్లిరిగాని తన ఉపాధ్యాయవృత్తిలో మగ్నులైయుండుటచే, ప్యాసుకాలేదు. తరువాత గుంటూరులోని మిషన్ స్కూలుకు హెడ్డుమాస్టరుగానుండి ఒకసంవత్సరము మాత్రము అక్కడపనిచేసి, బి. యల్. ప్యాసై చెన్నపట్టణములో, ఆడ్వకేటుజనరల్‌గానుండిన షెప్పర్డుగారియొద్ద అప్రెంటిసుగానుండి, హైకోర్టువకీలు పట్టాతీసుకొన్నారు. ఇంతకుమునుపే, తన ఉపాధ్యాయ వృత్తిలోని అనుభవ జ్ఞానమును బట్టి విద్యార్థులకు మిక్కిలి సులభముగ నర్థమగునట్లు Made Easy Series అను గ్రంథములను, యింగ్లీషు,ఫిజిక్సు, కెమిస్ట్రి,గణితము మొదలగు విషయములలో వ్రాసి, ప్రకటించుటకు మొదలు పెట్టిరి. ఆకాలములో ప్రకటనలకు వేలకువేలు ఖర్చుచేసి, గ్రంథములను విక్రయించుపద్ధతి, యీయనకు తెలిసినట్లు, మరియితరులకు తెలియనందున, యీయన గ్రంథములు, భారత దేశములోని అన్నిప్రాంతములందును విరివిగా ఖర్చగునట్లు చేయగలిగిరి. నేను 1905 వ సంవత్సరము డిసెంబరునెలలో కాశీకాంగ్రెసుకు వెళ్లినపుడు అక్కడ ఒక వంతెనమీద కూర్చుని ఒక విద్యార్థి యీయన వ్రాసిన గ్రంథములను, తన పరీక్షకు చదువుచుండగా చూచితిని.

ఈయన ఒక్క సంవత్సరముమాత్రము హైకోర్టులో, వకీలువృత్తిలోనుండెను. పార్టీయిచ్చుస్వల్పఫీజుకు, ఒక అప్పీలులోనే, యెన్నిసార్లుకోర్టుకు వెళ్లవలసివచ్చెనో, ఎంతకాలము అక్కడ వేచియుండవలసి వచ్చెనో లెఖ్ఖవేసికొని, తన తెలివితేటలతో తానింటివద్ద కూర్చుని తానెంతసంపాదించుకొనుచుండెనో అంచనావేసి, యీ వకీలువృత్తివలన ధనార్జనమంతగా లేకపోవుటయేగాక తన దేహారోగ్యముచెడునని భయపడి, ఆవృత్తిని ఛీదాగా 1884 లోనే మానివేసెను. తన సీనియరుకిచ్చినఫీజు, తనకుముట్టజెప్పవలెనను యీయన పట్టునకు, యీయన స్నేహితులగు శింగరాజు సుబ్బారాయుడు మొదలగువారాశ్చర్య పడుచుండిరి. తానుపఠించిన న్యాయశాస్త్ర ధర్మములు, ఆంధ్రములో ప్రజలకు తెలుపుట మంచిదని, లాసంగ్రహము, పీనల్ కోడ్డు, హిందూలా మొదలగు గ్రంథములనురచించి, వానిని అరవము, కన్నడము, గుజరాతీ, మహారాష్ట్రిభాషలలో అనువదింపించి, లక్షలద్రవ్యమును గడించిరి. తన యిద్దరిచెల్లెండ్ర కుటుంబములను మద్రాసుకు పిలిపించి, వారిని బాగుచేసెను. వారిపిల్లలకు చదువుసంధ్యలు చెప్పించెను. తనకు పోయినవాళ్లుపోగా, ఒక కొమార్తెయు, ఒక కొమారుడు ఉండేవారు. నేను 1885 వ సంవత్సరములో మద్రాసులోని తివరువల్లిక్కేణి పార్థసారథి కోవెలవద్ద కోమటిబంగాళాలో నుండగా, గుంటూరువిద్యార్థి చెన్న కృష్ణమ్మగారు, నార్మల్ స్కూలులో నాతోపాటు

విద్యార్థిగానుండి సుబ్బారావుగారియింట్లోనే నివసించుటచేత యీయనగుండా నాకు సుబ్బారావుగారితో పరిచయము కలిగినది. నావలెనే, స్వశక్తిమీద నాధారపడుటయే గౌరవమని గ్రహించి కష్టపడుచున్న సుబ్బారావుగారిమీద నాకమితాభిమానముకలిగి, ఆయనను చూడకుండ ఒక్కదినమైనను నేను గడపలేను. ఈకారణముచేతనే, యీయనసలహామీద నేను సైదాపేట టీచర్సుకాలేజిలోని లెక్చరరువృత్తిని మానివేసి ఆయన Made Easy series లో Middle School Arithmetic అను గ్రంథమును వ్రాసిపెట్టినందుకు మూడుమాసములలో ఆయనవలన రు 1500 లు గ్రహించితిని. ఇట్లు 1888 వ సంవత్సరమునుండి, ఆయనతోనే 1894 వ సంవత్సరము ఆఖరువరకు ఉంటిని. ఈయనభార్య 1890 వ సంవత్సరములో చనిపోవుట మాఫోటోమాన్యుఫ్యాక్టరీ తీసివేయుట, 1891 లో అమితద్రవ్యము ఖర్చుపెట్టి యీయన తిరిగి ఒక దక్షిణాదిపిల్లను వివాహము చేసికొనుట యామె కూడ ఒకసంవత్సరములోనె, కాపురముచేయుచు చనిపోవుట, నేను 1892 ఆగష్టుమాసములో, యీయన ప్రోద్బలమువలన నాభార్యతో మద్రాసువచ్చి అప్రెంటిసుచేసి హైకోర్టువకీలు నగుట, ఆసంవత్సరములోనే. యీయన పిల్లలకు సంరక్షకురాలుగా నుండెడు యీయన మరదలు చనిపోవుట తాను ఖర్చు చేసిన ధనమును తిరిగి శీఘ్రముగ రాబట్టుకొనుటకు 1891—93 సంవత్సరములలో యీయన గవర్నమెంటుపత్రముల జూద

ములోఁదిగి (Speculation in the sales and purchases of Government Promissory notes) లక్షరూపాయీలు నష్టపడుట, అప్పటినుండి యీయనకు ఆర్థికకష్టములు సంప్రాప్తించుట మొదలగు విషయములను గురించి విస్తరించి నేను వ్రాయదలచుకొనలేదు. వీనికితోఁడు, యీయన నన్ను 1895 వ సంవత్సరము మార్చిలో బందరుకు పంపిన తరువాత, యీయన కొమారుడు, కొమార్తెకూడా చనిపోయినారు. ఈకష్టములే, యీయన తెలివితేటలను బాగుగా ప్రజ్వరిల్లచేసినవి. ఇవి సంభవించనియెడల, యీయన, అమితధనార్జనమునకు అనేకసులభమార్గముల నరయుచు, తనకాలము నంతయు వినియోగించుచునే యుండును. అట్లుగాక, తనకష్ట దశలో సర్వాల్టరుస్కాటు, వేనర్లి నవలలను వ్రాసినట్లే, యీయనయొక్క ప్రపంచానుభవమును, విరక్తియు, అతని మెదడులోని అంతఃశక్తిని బయటకుతీసి, యీయనచేత Othello Unveiled, Hamlet Unveiled, Kamala's letters to her husband అను గ్రంథములను వ్రాయించి, యీయనకు శాశ్వతకీర్తిని గడింపజేసెను. షేక్స్పియరు మహాకవిమీద భాష్యములు వ్రాసిన యింగ్లాండు, అమెరికాలోని మహామహుల పొగడ్తలను యీయన పొందినారు. ఈయన యేయాంగ్లేయగ్రంథమునైనను, దానిలోని పదిపేజీల పఠనముతోఁ తృప్తిజెంది, ఆగ్రంథకర్తశైలిని అతిసులభముగా అనుకరించగలిగియుండెను. ఈయన విద్యార్థుల పఠనీయగ్రంథములు

Made Easys seris మొదలగునవిన్ని, తెలుగులో లాసం గ్రహము, హిందూలా పీనల్ కోడ్ను గ్రంథములేగాక మర్మశాస్త్రము అదృష్టదీపిక, కధారత్నావళి, వరశుల్కనాటకము, కేసరీవిలాసము, మొదలగునవిన్ని వ్రాసినారు.

ఈయన కొమారుడు సుమారు పది సంవత్సరములు యీడులోనే చనిపోయెను. కొమార్తెకూడ ఒక కుమారుని కని చనిపోవుటచేత, యీయన ఒక్కడే మోడుగానుండగా, యీయన యల్లుడు, పదమూడు దినముల తనగ్రుడ్డును యేలూరుకు, ఒకతొట్టెలోపెట్టి తీసికొనిపోవుటకు ప్రయత్నించెను. అప్పుడు సుబ్బారావుగారు నాచేత ఆశిశువును ఒకగదిలోపెట్టి తాళమువేయించెను. దాదులను పెట్టి ఆపిల్లవానికి 15 సంవత్సరములు యీడువచ్చేవరకు పెంచి, తన జీవితాంతమువరకు, అతనితండ్రికి కనుపడకుండజేసెను. ఆపిల్లవానిని తనకు పుత్రికాపుత్రునిగ, పూర్వపు హైందవాచారము, ప్రకారము భావించి, వానికి తన కొమార్తె పేరుపెట్టి సుందరరావు అను నామధేయముతో, తాను దత్తతచేసికొని, తనయాస్తి, అనగా మైలాపూరులోని మేడను ఆపిల్లవానికి వ్రాసియిచ్చి ది 20–3–1918 తారీఖున పరమపదించెను. ఈపిల్లవాడు బి. యే. పరిక్షప్యాసై, ఆమేడలోనే ఒకభాగములో నివసించుచు తక్కినభాగమంతయు అద్దెలకుయిచ్చి పూర్వమునుంచియున్న సుబ్బారావుగారి విక్టోరియాడిపోను మేనేజిచేయుచు, ఆయన గ్రంథములు, మందులు, నగల, అమ్మకవ్యాపారములోనే యున్నారు.

ఈయనకు ఉర్లాంజమీాందారుగారు తమ యేకపుత్రికనిచ్చి, వివాహాముచేసిరి. ఈయన దత్తతతండ్రిగారగు సుబ్బారావు గారికి మిగిలియున్న ఋణములనుతీర్చి యీ పిల్లవానిని వృద్ధిలోనికి తెచ్చినది, సుబ్బారావుగారి మేనకోడలి పెనిమిటి యగు మా కాశీనాథుని నాగేశ్వరరావుగారుగనుక, యీయన యందెల్లపుడు యీ పిల్లవాడు కృతజ్ఞుడై యుండుట కెట్టిసందేహాములేదు. సుబ్బారావుగారు జీవించియుండగానే, ఆయన మేనల్లుడు మల్లాప్రగడ రామచంద్రరావునకు నాకొమార్తె నిచ్చుటచేత, యీ కుటుంబమువారే నాకాత్మబంధువులు. నాకువేరే, అన్నదమ్ములు, అప్పచెల్లెండ్రు లేకపోవుటవలన, గతయేబది సంవత్సరములనుండి, వీరందరినే, నాస్వకుటుంబముగా భావించుకొనుచున్నాను.

1888వ సంవత్సరము యేప్రియల్ మెయి మాసములలో, సుబ్బారావుగారి సహాయ సలహాలతోనే, Middle School Airthmetic ను తయారుచేసితిని. దాని మొదటి కూర్పు విక్రయము వలననే ఆయనకు పదివేలరూపాయీాలు, ఖర్చులన్నియు పోగా లాభము వచ్చినది. మేమిద్దరము వీణె నేర్చుకొని రైడింగుస్కూలులో గుర్రపుకవాతు నేర్చుకొంటిమి. క్రొత్తగావచ్చిన Safety bicycles మీాద తిరుగుచుంటిమి. ఈసంవత్సరమంతయు మేమిద్దరము యెల్లపుడు కలిసియుండుటచేత స్వతంత్రజీవనమునందు నాకున్న యిష్టమును కనిపెట్టి, ఆయనచేతిలో పుష్కలముగ ధనముండుటచేత, కోటీ

శ్వరుల మెట్లగుదుమని అనేకప్లానులు వేసివేసి, తుదకు యిం గ్లాండు, అమెరికా మొదలగు పాశ్చాత్యదేశములకు యిండి యాకు సంబంధించిన అనేకవిధములైన ఫోటోలను కాపీరైటు చేసి పంపించుచున్న యెడల, అవిలక్షలక్రింద ఖర్చులగునని నిశ్చయించితిమి. నాకు యీ వర్తక వ్యవహారజ్ఞానమేమియు తెలియదు. సుబ్బారావుగారు నాధైర్యముచూచి, ఆయనకే ఆశ్చర్యము కలుగుచుండెడిది. ప్లీడరీ వృత్తియందు, ఆయనకు వలెనే నాకును యిష్టములేనందున, తనతోపాటు నన్ను ధనవం తునిచేయవలెననేకుతూహలముతో, నన్ను భాగస్వామిగా చేర్చుకొని ఒకగొప్ప ఫోటోకర్మాగారమును యేర్పరిచినారు. తిరువల్లిక్కేణిలో శింగరాచారి వీధిలో తాను అద్దెకుంటూ సమీపముననున్న వేంకటేశనాయకు వీధిలో ఒకగృహమును యేడువేలరూపాయీలకు కొని, దానిని పడగొట్టి ఫోటో కర్మాగారమునకు వీలగునట్లు, అనేకరంగుల అద్దముల కిటికీలు మొదలగు వానితో, చాలామార్పులు చేయించినారు. నన్ను బొంబాయికి పంపించి కావలసిన ఫోటోగ్రాఫు పరికరములను Marion and Co., వారివద్ద కొనవలసినదని, నాతో ఒక ఫోటోగ్రాఫరునుకూడా జతయిచ్చి పంపిరి. 1888 సం॥ డిసెం బరు మాసమంతయు, మేము బొంబాయిలో గడపితిమి. అక్క డివర్తకము అయిశ్వర్యము, మాకు మిక్కిలి ఆశ్చర్యము కలుగ చేసినది.

మాకర్మాగారము 13 డిపార్టుమెంటులుగా విడదీయబడి యేబదిమంది పనివాండ్రకు పనికల్పించెను. Sensitising fixing, toning, washing, mounting, burnishing మొదలగు వివిధశాఖలకు ప్రత్యేకగదులు, వానివానికి తగినట్లు యేర్పరచబడినవి. దినమునకు వేయిఫోటోలు తయారుకాబడుచు, ప్రపంచమంతలో, పెద్దదైన స్కాట్లండులోని దగు Valentine and Co., తప్ప మా కంపెనీవంటిది మరియొకటిలేదు. ఇతరులు, యిక్కడ తమ ఫోటోలను తీయించుకొనుటకెట్టియవకాశము నీయదలుచు కొనలేదు. మేము తయారుచేసినవి ప్రపంచమంతయు కొనవలెననియే మాయుద్దేశము. ముఖ్యముగా డిసెంబరు మాసములో, యిండియాదేశములోని తెల్లదొరలందరు, మాఫోటోలను, క్రిష్టమసుకార్డులుగా, తమయింగ్లాండులోని స్నేహితులకును బంధువులకును పంపించుకొనేవారు. అడ్వర్టైజుమెంటు విరివిగా జరుపుటకును, వచ్చిన ఆర్డర్లను సరఫరాచేయుటకును, అరడజన్ క్లార్కులెల్లపుడు నుండేవారు. మమ్మునుచూచి, యితరులుకూడా, యిట్టిదానిని స్థాపించెదరేమో యనిభయపడి, వారు పోటీకిరాకుండా ఒక్కసారిగానే యింగ్లాండునుండి రావలసిన సామాగ్రికంతకును ఆర్డర్లు పంపించితిమి. వాటిబేళ్లు స్టీమర్లమీదవచ్చి, ప్రతివారము పడుచుండెడివి— ఈదేశములోను, అన్యదేశములలోను, అనేకవిధములైన యిండియాకు సంబంధించిన ఫోటోలు Indin beauties, Bride and Bridegroom

Brahmin Dinner మొదలగు మనసాంఘిక సంబంధమైనవి అమ్మగలుగుచుంటిమి. రెండుసంవత్సరములు, యిట్లువ్యవహారము జరుపగా, యింగ్లాండులోతప్ప, యితర దేశములలో మాకుకాపీరైటు లేకపోవుటవలన, అన్ని దేశములలో వీనిని అతిసులభముగ పునర్ముద్రణచేసి యమ్ముచుండుటచే, మా అమ్మకము తగ్గజొచ్చినది. ఇంగ్లాండులో కూడ రహస్యముగ అనేకమంది ఫోటోగ్రాఫర్లు, మాఫోటోలను multiply చేయుచుండిరి. నేనుయింగ్లాండు అమెరికాకువెళ్ళి వానినిఆపి, వర్తకమును వృద్ధిచేసెదనని చెప్పగా, సుబ్బారావుగారు నన్ను ఒక్కనినే, ఆ దేశములకుపంపుటకు యిష్టపడకపోయిరి. మాకు ఖర్చులుపోగా నెలకు చెరిమూడువందల రూపాయీలు యీ రెండుసంవత్సరములు ఆర్జించితిమి. ఈమాత్రపుసొమ్ముకా, యిద్దరు బి.యే. బియల్లులము యిట్లుకూర్చుని పాటుపడ వలసినది? మేముపెట్టిన మొత్తముమీద నూటికి నెలకు రెండణాలైనను వడ్డీ రాకపోయెను.

1890వ సంవత్సరము వేసంగులలో సుబ్బారావుగారి యిద్దరు మేనకోడళ్లకును వివాహములు జరిగినవి. పెద్దపిల్లను, యిప్పుడాంధ్రపత్రికా ప్రొప్రయిటరును లక్షాధికారియునగు కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారికిని, రెండవపిల్లను; యిప్పుడు గుడివాడలో ప్లీడరీచేయుచున్న ఉప్పలూరి మల్లిఖార్జునరావు పంతులుగారికిని యిచ్చి, యేకకాలమందే వివాహములు అతివైభవముతో జరిపిరి. మానాగేశ్వరరావు

గారు అప్పుడు క్రిస్టియన్ కాలేజిలో బి.యే.క్లాసులో చదువు చుండెను. ఆయన లింగధారి యగుటచే ఆయన తల్లిగారు యిష్టపడదేమో యని మేము భయపడగా, తాను ఆమెచేత ఒప్పించగలనని మాకు ధైర్యముచెప్పి వివాహము చేసికొనెను. ఈవివాహమునైన కొలదిమాసములకే, సుబ్బారావుగారి భార్య కాలముచేసినది. ఈమెతో కుటుంబలక్ష్మి తొలగి పోయినదని చెప్పవచ్చును. ఈమెజబ్బుతో నుండగానే, పై వివాహములు జరిగినవి. మిక్కిలి గుణవంతురాలు. ఒక్క కొమారుడు, ఒక్క కొమారిత, మాత్రము అదివరకు పుట్టి చనిపోయిన వారుగాక, యీమెకుండిరి. వీరిని కనిపెట్టుకొని యుండుటకు, సుబ్బారావుగారి చెల్లెండ్రిద్దరు పట్టణములోనే యీయనవద్ద యుండవలసివచ్చినది. ఈభార్యపోయిన తరువాత యీయన యెంతసంపాదించ కలుగుచున్నను చేతిలో ఒక దమ్మిడీలేకుండ ఖర్చుపడుచు, క్రమక్రమముగ అనేకకష్టముల పాలాయెను. కాని తాను చనిపోయేవరకు దినమునకు కనీసము తనపుస్తకముల విక్రయములలో యిరువదిరూపాయిల మణీ ఆర్డర్లు రాకుండనుండలేదు. అనేకవిధములైన మందులమీదను గ్రంథములమీదను, యిలెక్ట్రికు బంగారు నగలమీదను, సొమ్ము సంపాదించేవారు. చేతిలో పుష్కలముగ సొమ్ము వచ్చుచునే యుండెను. ఇదియంతయు, అప్పులవాళ్లకే యీయవలసి వచ్చెను. ఈయప్పు లెట్లయినవో ముందువ్రాసెదను.

సుబ్బారావుగారు, తనభార్య చనిపోయిన తరువాత ఫోటోగ్రాఫు కర్మాగారమువలన తగిన ఆదాయము రాలేదని దానిని తీసివేసి, కామిరా మొదలైన సామానులను, అక్కడి పనివాండ్రకు బహుమతీక్రింద యిచ్చివేసి, తయారైన ఫోటోలు, కార్డుబోర్డులు, మొదలైనవానిని, దొడ్లో పెద్దగోయితీసి, దానిలో పాతిపెట్టించినారు. ఆకర్మాగారసంబంధమైనదేదియు, యితరులచేతిలో పడకూడదనియే, ఆయన యిట్లు జరిగించిరి. నామామూలు త్రోవను నన్ను పోనీయక 1888, 1889, 1890 సంవత్సరములలో తనతో నన్ను కూడ లాగివేసి, నాకు నష్టము కలుగజేసితిని గదా యను విచారముతో నాకు అయిదువేల రూపాయిలిచ్చెదననియు, హైకోర్టు వకీలగుటకు నన్ను అప్రెంటిసు చేయవలసినదనియు తనభార్యపోయిన దినములలో నాతో ముచ్చటించెను. కాని, ఆకష్టకాలములో ఆయనను వదలియుండుటకు నిరాకరించితిని. కాని తరువాత కొంతసొమ్మును, చెన్నపట్టణములో నున్న కొందరు ధనవంతులనుచూచి సంపాదించుకొని, ఆయన యిచ్చు మొత్తముతో బారిష్టరుపరీక్ష చదువుకొనుటకు యింగ్లాండుకు పోవలెనని నిశ్చయించుకొంటిని. మా రాజమండ్రి కాలేజిలో నాకుపాధ్యాయుడుగా నుండిన డాక్టరు సత్యనాథముగారిని చూచితిని. చల్లపల్లి రాజాగారు, ప్రివికౌన్సిలులో ఆప్పీలుచేసి యుండుటచే నాతో బి. యల్. ప్యాసైన మెల్లేపెద్ది వెంకటరామశర్మగారిగుండా, రెస్పాండెంటగు చల్లపల్లి చినరాజాగారి తరపున,

యింగ్లాండుకు వెళ్ళుటకున్ను, వారు పదివేలరూపాయిలు నా చదువు కర్చు౯ యిచ్చుటకును బేరము పెట్టితిని. హిందూపత్రికాధిపతియగు జి. సుబ్రహ్మణ్యముఅయ్యరుగారును, సత్యనాథంగారును యింగ్లాండులోని తమస్నేహితులకు, శిఫారసు ఉత్తరములనిచ్చెదమని వాగ్దానము చేసిరి. ఈ సంగతులన్నియు కనిపెట్టి, సుబ్బారావుగారు, తనభావ మరదియైన మల్లాప్రగడ వేంకటరత్నముగారిచేత, నాకు తెలియకుండా, రాజమహేంద్రవరములోనున్న నా మామగారికి, నేను కిరస్తానులలో కలసిపోయి సీమకు వెళ్లబోవుచున్నాననియు, నాభార్యవ్యక్తురాలు కాకపోయినను, ఆమెను తక్షణము తీసుకొనివచ్చి, మద్రాసులో దిగవిడిచి పోవలసినదనియు ఉత్తరము వ్రాయించిరట! నా సీమప్రయాణము ఆగిపోయినపిమ్మట, సుబ్బారావు, వెంకటరత్నంగార్లే యీసంగతి నాకు తెలియజేసిరి. నేను సీమకు వెళ్లుటకు ప్రయాణమగుచుండగా నా కిచ్చెదనన్న సొమ్ము తానీయచాలననిన్ని, చెన్నపట్టణములో నాకు వాగ్దానము చేసిన పెద్దమనుష్యులు సహాయము చేయకుండ తాను చర్య తీసుకొనవలసి వచ్చుననిన్ని తాను, నేనుకూడా కలసి, M. L. పరీక్ష చదివి, బారిష్టరుతోతుల్యమైన అడ్వకేటుపదవికి, దొర్ల దగ్గర ఉభయులము అప్రెంటిసుచేతమనిన్ని చెప్పి నన్నుఒప్పించి నా ప్రయాణమునుఆపుచేసి, యమ్. యల్. పరీక్షకు కావలసిన పుస్తకములన్నియు కొన్నారు. మేముభయులము చదువుటకు ఆరంభించినాము. పైకితానుకూడా శ్రద్ధతో చదువుచున్నట్లు

నటించి, నన్ను దగాచేసి యీ లాయరు జదువులో నన్ను తిరిగి చల్లగా దింపినారు. నాకు నెలకు కావలసినది యిచ్చు చుండేవారు. నేను బ్రాహ్మణవంటవానిని తీసివేసి, హోటలులో ప్రవేశించితిని. తాను యీ ఫోటో కర్మాగార మున్న యింటిలో ప్రవేశించెను. ఇద్దరు చెల్లెండ్రు, తమ అత్తిళ్ళకు కృష్ణాజిల్లా బొమ్మలూరు, కలవగుంట గ్రామములకు వెళ్ళి నారు. ఆయనతనపిల్లలకు సంరక్షకురాలుగా వితంతువైన తన భార్యా చెల్లెలను తెచ్చుకొన్నారు.

నేను రెండుసంవత్సరములు చదువు చెప్పించిన కనకరాజుగారు బి. యల్. పరీక్ష ప్యాసుకాకపోవుటచే, నేను సుబ్బారావు గారికి శిఫారసుచేయగా, ఆయనచేత ఒక యిండియన్ జాగ్రఫీషీటును తయారుచేయించి ఇంగ్లీషుగ్రవాత బాగుపరచి, చాలా పెట్టుబడిపెట్టి, తుదకు ఆయనచేత (First grade) ప్లీడరుపరీక్ష ప్యాసుచేయించినారు. మేముచేసిన సహాయము వలననే యీ కనకరాజుగారి తమ్ములు, వృద్ధిలోనికి రాగలిగిరి. పెద్దతమ్ముడు భీమేశ్వరరావుగారు, సబుజడ్జీపనిచేసి, పెన్షనుపుచ్చుకొని, పిల్లలచదువు కొరకు మద్రాసులో యిప్పుడున్నారు. రెండవతమ్ముడు వేణుగోపాలరావుగారు సబుజడ్జీగానుండి పెన్షన్ తీసికొని యిప్పుడు విశాఖపట్టణములోనున్నారు. క్లార్కు, స్కూలుమాష్టరు, మొదలగు ఉద్యోగములలోనున్నారు. వీరికుటుంబమునందు నాకిప్పటికిని అత్యంత ప్రేమ.

సుబ్బారావుగారివలన, అదివరకువలె నెలనెలకు ముప్ప దేసి రూపాయిలు పుచ్చుకొనుట కిష్టములేక, హోటలులో నే ప్రవేశించి, నా స్నేహితుడైన న్యాపతి బాలకృష్ణారావుగారి యింటిలోనే బసచేసుకొని యుంటిని. నాకు యే కొద్దిపాటి సొమ్ము కావలసినప్పుడు ఆయనయొద్దకు వెళ్ళుచుంటిని గాని, యితరసమయములలో ఆయనయింటికి పోవుటమాని వేసితిని. దీనికికారణము ఆయనమీద నాకు గలిగినకోపమే. ఆయనకు నా యందు మిక్కిలి గౌరవభావమే. ఫోటోలు తీసి నపుడు, సొమ్మిచ్చి, అనేకమంది అప్సరసలగు, భోగమువాం డ్రను తెప్పించి వారి ఫోటోగ్రాఫులు తీసికొనేవారము. నేను బహిరంగముగా, అందరి భోగమువాండ్రింటికి వెళ్లేవాడను. వారందరు రోహిణినక్షత్రము రోజున, రాత్రిళ్లు కలిసికొని, పాటకచ్చేరీలకు మమ్ము నిద్దరను, వారి మిండగాండ్రతోపాటు ఆహ్వానములు పంపించితే, సంగీతమందుండు ఆశచేత నేను తప్పక వెళ్ళేవాడను. మా సుబ్బారావుగారు నా నైతిక ప్రవ ర్తనను గురించి తెలుసుకొనుటకు అనేకకుట్రలు మాయోపా యములు పన్నుచుండేవాడట! అక్కడ నేనున్న యేడుసంవ త్సరములలో నేను యినుపకచ్చడము కట్టుకొన్న నిజమైన ముని వలె యుండుటచే నేను నపుంసకుడనని ఆయన బాగుగానమ్మి నాకు దుర్బుద్ధి పుట్టించుమార్గములను వదులుకొన్నాడు. నా సాహసోత్సాహములకు జంకి నన్ను వెనుకకు లాగుటకు అనేక విధముల ప్రయత్నించెను. నాకు వివాహమైయుండని యెడల,

అపుడు బ్రహ్మచారిగా దేశాంతరములకు పోవలసియే యుండి యుందును. చేతిలో సొమ్ములేదని వెనుకకు తగ్గియుండకపోదును. ఏ దొరకైనను బట్లరుగానో నౌఖరుగానో యుండి యింగ్లాండు అమెరికాలకు పోయి యుందును. ఆయన, నన్ను వంచించి, సమయమునకు సొమ్ము సహాయముచేయక కల్లబొల్లి మాటలు చెప్పి విదేశములకు వెళ్లకుండా చేసెనుగదా యను కోపము తప్ప మరి వేరుకారణములు లేవు. ఆయన సదుద్దేశ్యముతోనే, ఒంటరిగానున్న నా మీద వాత్సల్యముచేతనే, దూరమందున్న నా చిన్న భార్యామీద కలిగిన జాలిచేతనే, యిట్టిపని జరిగించెనని నాకు తెలుసును. నేనును, నా విధ్యుక్తకార్యములను, యితరులయెడల చేయవలసివచ్చినది గనుక, ఆయన సలహాకు తలయొగ్గవలసి వచ్చినది. ఆయనమీద నాకు కోపము వచ్చి యిక చేయగలిగిన దేమి? తిరిగి ఉపాధ్యాయుపదవికి పోవుటకు మనస్కరించలేదు. మూడుసంవత్సరములు వృథాగా గడపి రాజమహేంద్రవరమునకు తగుదునమ్మా యని యెట్లు పోగలను? పోయినను బి. యల్. పరీక్షప్యాసై, యిన్ని సంవత్సరములకు హైకోర్టు వకీలై తేతప్ప, ప్లీడరీ పట్టాకూడా యీయరు. ఈ హైకోర్టువకీలు పట్టాకు ఒకసంవత్సరము అప్రెంటిసుపని మరియొక పెద్ద వకీలువద్దచేసి, ఆయనకు కొన్నివందల రూపాయిలిచ్చి, మరి యైదువందలు స్టాంపు కట్టవలెను. దీనికంటె సుబ్బారావుగారి సలహా ప్రకారము యమ్. యల్. ప్యాసై $1\frac{1}{2}$ సంవత్సరములు అప్రెంటిసు షిప్పు చేసినయెడల,

బారిష్టరు పదవితో సమానమైన అడ్వకేటు బిరుదమునే సంపాదించుకొనవచ్చును కదా యని ఆ సంవత్సరము (1890) రాత్రింబగళ్లు నిద్రాహారములేక కష్టపడి, అన్ని లాపుస్తకములకు నోట్సువ్రాసుకొని, అప్పటివరకు జరిగినపరీక్షా పత్రములను, విషయముల వారీగా, సుబ్బారావుగారు, తమ గుమాస్తాల చేత వ్రాయించిన ప్రశ్నలన్నిటికిని జబాబులు వ్రాసికొని దినమునకు కనీసము 16 గంటలు విద్యా వ్యాసంగము చేయుచుంటిని. సెప్టెంబరు మాసములో అప్లికేషన్ ఫీజు రు100లు కట్టితిని. అప్పటినుండి నాకు తలపోటు ప్రారంభించినది. ఆ సంవత్సరములో వర్షములు బొత్తిగాలేవు. ఎండ వేడిమి అతి మిక్కుటమై హోటలు తిండికూడ సరిపడలేదు. సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు మాసములలో యెంతమంది డాక్టర్లచేత సుబ్బారావుగారు మందులిప్పించినను క్రమముగా తలనొప్పి హెచ్చి తుదకు నిద్రకూడ పట్టక, సకలబాధలు పడితిని. Hypodermic injections, chloroform, catharidies spanish blister, మొదలగునవి యెన్ని వేసినను తలకొట్టిన కోడిపిట్టవలె కొట్టుకొంటినిగాని, ఒక్కకునుకుకూడ పోలేదు. తుదకు లేవలేనిస్థితికి వచ్చితిని. డాక్టరు స్మైత్తు, వరదప్పనాయుడు, మెయిల్లెండు మొదలగువారు, నూతనముగా యూరపులో కనిపెట్టిన మందులన్నియు వాడిచూచిరి. తుదకు డాక్టరు బ్రాన్ఫుట్ గారు, తమ యింగ్లీషుమందులే, యీజాడ్యము నింతవృద్ధి చేసెననియు, నే నెక్కడ నా చిన్నతనము గడపి

తినో అక్కడకు తక్షణము వెళ్లి, వ్యవసాయముతప్ప మరి యొక వృత్తిలోనికి దిగవద్దని సలహాచేసి పంపివేసెను.

ఈ రోజులలో సుబ్బారావుగారికి, ఆలోచనపరులు కనకరాజుగారును, యీయన శిఫార్సువలన, దగ్గరకు చేర్చుకొనబడిన కాకినాడ కాపరస్థుడు, మర్ధ్వుడు భీమసేన రావుగారును, ముఖ్యులు. అప్పటికి దాసుశ్రీరాములుగారి కొమాళ్లు నారాయణరావు, మాధవరావుగార్లు, బి. యే. చదువుటకు అక్కడకు వచ్చియుండిరి. సుబ్బారావుగారు, వీరిలో యెవరి సలహానైతే నేమి, తనకు స్వయముగా తోచుటవలన నేమి, తనకు కొడుకు కుమార్తెయు యున్నను నా కెంత మాత్రము తెలుపకుండా, తిరుచనాపల్లిలో, నియోగిమర్ధ్వులకు, దేశస్థులకు సంబంధములు కలసిన ఒక దక్షిణాదిపిల్లను, తిరుచునాపల్లి వెళ్ళి వివాహము చేసికొన్నారు. వివాహమునకు నన్ను పిలువలేదు. నన్ను సంప్రదించలేదు. నేను బొత్తిగా అట్టి ముక్కుమొగమెరుగని సంబంధమున కిష్టపడనని ఆయనకు స్పష్టముగా తెలుసును. నా చదువులో నేనుంటిని. నాకును, సుబ్బారావుగారికిని తరుచుగా ఆ కాలములో నెమ్మదిగా మాటలాడుకొనుటకు సావకాశములే లేకపోయినవి. వివాహము చేసికొనివచ్చిన తరువాత కనకరాజుగారు నన్నొకసారి ఆ పెండ్లికూతురను చూడమని తీసికొనివెళ్ళినాడు. పిల్ల చక్కనిది. మంచిపసుపు వన్నెకలది. చూపులకు అందముగానేయున్నది. కాని, అవయవతీరు మొదలగు వానిని జాగ్రతతో అనేకమంది బోగము

స్త్రీలను పరీక్షించినవాడను గనుక, ఆమె వారు వర్ణించునంత త్రిలోకసుందరి కాదు. ఆ మాత్రపు పిల్లలను మన యాంధ్ర దేశములో దొరకక పోయిరాయని నా యభిప్రాయమును సూచించగా దానిని కనకరాజుగారు మా సుబ్బారావుగారికి జారవేసినట్లు యీయన వలననే నాకు తరువాత తెలిసినది. అయినను, తాను వలచినదిరంభ, తాను మునిగినది గంగయను సామెత ప్రకారము, మా సుబ్బారావుగారి కళ్లతో నే నెట్లు చూడగలను? ఈ వివాహమునకు ఆయన తన సర్వస్వమును ధార పోసినారు. అనేకవేల ధనము ఖర్చుపెట్టినారు. పెండ్లివారు, బజారుకు వెళ్ళి, యెవరు కోరుకొన్న చీరెలకు, రవికెలకు, యీయన ఖరీదు లిచ్చివేయుటయేగాని మారుమాట లేదట! ఎంత సొమ్ము తన పుస్తకములనుండి వచ్చినను అదియంతయు ఖర్చు కాగా, అప్పులుకూడా చేయ మొదలిడెను. ఒక్క తెలుగు, అరవ లా సంగ్రహముల ప్రథమ ముద్రణములోనే యీయనకు లక్ష రూపాయీలు నికరాదాయము వచ్చుట నేను స్వయముగా యెరుగుదును. ఫోటో కర్మాగారములో పోయినది పోగా, యిల్లుగాక చాలా ధనము యీయనవద్ద నిలవయుండవలెను. అది యంతయు యెక్కడకు పోయినదోగాని, తనకు స్నేహితుడుగా నటించిన యీ భీమసేనరావు వలలో తగుల్కొని గవర్నమెంటు ప్రోనోట్లను లక్షలకొలది కొనుట అమ్ముటయను జూదములో ప్రవేశించెను. ఒక్కొక్కరోజున కొన్నివేలు గెలుపు. మరియొక దినమున కొన్నివేలు ఓటమి. ఈవిధముగా జరుగుచున్న

కాలములో నేను మంచమెక్కితిని. ఒకరోజు ప్రొద్దున తన కప్పటికి లక్షరూపాయిలు, యీ జూదములో నష్టము వచ్చిన దనియు, బాకీదారులు, ఆ సొమ్మునకు ప్రోనోట్లు వ్రాసియిచ్చిన గాని తనతో తిరిగి జూదమాడుటకు నిరాకరించిరనియు, డాక్టర్ల సలహా ప్రకారము నేను నా దేశమునకు వెళ్లవలసినదని చెప్పి, స్టీమరులో రెండవక్లాసు టికెట్టుకొని, నా జేబులో మూడు వందల రూపాయీలు మందు ఖర్చులు వగైరాలకు కర్రెన్సి నోట్లు వేసి, నన్ను ఆయనస్టీమరెక్కించెను. కాకినాడ సీకస్టమ్సు వారికిని, అక్కడి గుమాస్తాయును, నా స్నేహితుడునగు నొక రికి టెలిగ్రాము యిచ్చినారు. ఆ సమయమములో ఆయనను విడు చున్నానేయని దుఃఖము పట్టజాలకపోతిని. నేను ఆయనకు బలువే నైతినిగాని, ఆయన కెట్టి సహాయము చేయలేకపోతిని గదాయని, నేనును, నన్ను యిట్టివ్యాధితో అత్తవారింటికి పంపు చున్నానే యను విచారముతో ఆయనయు పరిపరి విధముల విచారించితిమి. నాకు ఆయన తప్ప యీ ప్రపంచములో, సోద రుడు, స్నేహితుడేడీ! దేశము విడిచి యేడునంవత్సరముల్లకు యీ విధముగా, నే నెట్లు వెళ్లుదునని మనస్సు మిక్కిలి పరితపించినది. ఇక నాయండయే పడిపోయినప్పుడు నేను చేయవలసిన దేమున్నది? తాను తన కాలు చేయి కొంచెము కూడ దీసుకొన్నతరువాత, నా శరీరము బాగైనతరువాత, నా భార్యతో రావలసినదని చెప్పి స్టీమరు లంగరెత్తేవరకు ధైర్యముతో

ఆయన నాతో మాటలాడుచునే యుండిరి. మే మిద్దరము, అట్లు ఒకరినొకరు విడువవలసి వచ్చినది.

నాతోనున్న డాక్టరు మొదటిరాత్రి, నేను పడిన బాధ చూడలేక రెండవ రాత్రి నాతో చెప్పకుండ నామందులో బ్రాందికలిపి పోసినాడు. నేను కాకినాడలో దిగినపుడు నాకు స్పృహలేదు. నా మేనమామగారి యింటికివచ్చిన తరువాత, బాధ యెక్కువైనది. ఆ కాలములో కాకినాడనుండి రాజమహేంద్రవరమునకు రైలు లేకపోవుటచే, బోటుమీద, కాకినాడ కాలవను ప్రయాణముచేసి, ధవిళేశ్వరము వచ్చి, అక్కడినుండి బండిచేసికొని మా మేనమామయు, నేనున్న మా మామగారి యింటికి పగలు 1 గంటకు వచ్చితిమి. ఏడు సంవత్సరములనుండి ముఖపరిచయము కలుగని నన్నానవాలు పట్టుదురో లేదో, చూతామని కోర్కెజనించి, మా మేనమామను బండితో వెనుకనుండి నెమ్మదిగా రమ్మనుమని నేను ఒక్కడినే వెళ్లితిని. నేను లోపలకు వెళ్ళిచూడగా మామగారు పాదుకు పందిరి వేయుచున్నారు. అత్తగారు, పిన్నత్తగారు అంట్లు తోముకొనుచుండిరి. నాభార్య తన అప్పగారివద్దకు కడియము వెళ్ళినది. నా భావమరిది స్కూలునుండి యింకను రాలేదు. నేను యెవరినని, యెందుకువచ్చితినని ప్రశ్నింపగా, మా యింటిపేరు పందలపాటి వారనియు, నాపేరు సుబ్బారావనియు, నాకు కొంచెము మంచి తీర్థము కావలెననియు చెప్పితిని. నాకు ఒకచెంబుతో మంచి నీళ్లిచ్చి యెవరి పనివారు చూచుకొనుచుండిరి.

తనుగట్ట త్రాళ్లు తా తెచ్చుకొన్నట్లు, నేను నాహాస్యమునకు పశ్చాత్తాపము పడుచుండగా మా మేనమామ బండితో వచ్చి, నేనుచేసిన మోసమునకు వగచి, వచ్చినవాడు తన మేనల్లుడు, వారిఅల్లుడు అనిచెప్పి వేసెను. వారందరు మిక్కిలి ఆశ్చర్య పడి, పట్టణములో బయలుదేరిన విషయమును తమకు ముం దుగా తెలియకపోవుటవలనను, మీసకట్టు రాకమునుపే దేశ మునుండి వెళ్ళుటచేత, యిప్పటి 25 సంవత్సరముల మనిషి తమ అల్లుడని గ్రహించ లేకపోవుటవలనను, తమరానవాలు పట్ట లేకపోవుటకు లజ్జపడి, మమ్మును స్నానముచేయించి భోజనము పెట్టిరి. నేను భోజనము చేయుచుండగా మా మామగారికి చెన్న పట్టణమునుండి యే టక్కరియైనను నా పేరు పెట్టుకొని, తనకో మా రైకొరకు, మా మేనమామను కూడా మోసము చేయ కూడదాయని సందేహించి, నా సహాధ్యాయిగా బి. యల్. క్లాసులోనుండిన చిత్రపు వేంకటాచలంగారిని తీసికొనివచ్చి చూపించి తన సందేహనివృత్తి చేసికొనెను.

ఏలూరుసాహేబుచేత యూనానీవైద్యము చేయించి, దానివలనగుణముకనుపడకపోవుటచే కడియములో ఆయుర్వేద వైద్యునిచేత మందిప్పించిరి. దానివలనను లాభము లేకపోవు టచేత జేగురుపాడులో ఘనవైద్యుడగు బృందావనం వెంక టాచార్యులుగారికి కనుపరచగా, ఆయన తన యింటికి తీసికొని వెళ్లి మంగలిచేత తల యంతయు నున్నగా గొరికించి స్నానము చేయించి యేదియో నొక ఆకుకూరతోను, మజ్జిగతోను, భోజ

నము పెట్టి, తానదివరకు 15 సంవత్సరముల క్రిందట పిఠాపుర మహారాజుగారిదగ్గర ఆస్థాన వైద్యుడుగా నుండి వైద్యపాలు గా దాచియుంచిన భృంగామలకతైలమును తలకు మర్దనా చేసి, లోపలకు వసంతకుసుమాకరము, ఆవు వెన్న పంచదారతో యిచ్చి పండుకొనబెట్టెను. నే నప్పుడు పోయిననిద్రనుండి 18 ఘంటలతరువాత లేచితిని. ఇట్లు నెలరోజులు ఆయన మందిచ్చి, వ్యాధి నివారింపజేసెను. ఈ రోజువరకు నేను తలనొప్పి యనునది యెరుగను. నా భార్యకు 15 సంవత్సరములు వెళ్లి 16 వ సంవత్సరము జరుగుచుండగా వ్యక్తురాలు కాగానే నాకు 1892 సం॥ మార్చి యేప్రియల్ నెలలో శోభనము కావించిరి. ఆ సంవత్సరము వేసంగియంతయు రాజమహేంద్రవరములోనే గడిపితిని. నేను కడియములో నుండగానే, మన తిరుపతి వేంకటేశ్వరకవులు, బ్రహ్మయ్యశాస్త్రిలవారియొద్ద చదువుకొనుచు, నాతో ఆత్మానాత్మవిచారణ చేయుచుండేవారు.

సుబ్బారావుగారు నన్ను మరచిపోలేదు. మాకు ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచునే యున్నవి. మాకు వీణె నేర్పు, వేంకటేశశాస్త్రిగారిచే రచియింపబడిన సంగీతపుస్తకమును, తమచే రచింపబడిన అదృష్టదీపికయను గ్రంథమును పంపుచు, కేరళశాస్త్రమును కాశీనాథుని నాగేశ్వరరావుగారు, భీమసేనరావు సహాయముతో, యెట్లు బయలుదేరతీసినది వ్రాసినారు. నేను 1892 సంవత్సరము ఆగష్టునెలలో బోట్లమీద బెజవాడ వచ్చి, అక్కడనుండి చెక్రాలబోటుమీద కృష్ణ దాటి నంది

యాలు, గుంతకల్లుమీదుగా నూతన రైలుమీద ప్రయాణము చేసి రాజా తుమ్మలపల్లి రామారావుగారియొద్ద అప్రెంటి సుషిప్పు ప్రారంభించినాను. నేను వచ్చిన నెలరోజులకు నా మామగారు, నా భార్యను, నా మేనమామ కొమార్తెయగు రమణమ్మగారిని తీసికొని కాకినాడలో స్టీమరెక్కి చెన్నపట్టణము చేరిరి. తిరువల్లికేణిలో శింగరాచార్యులగారివీధిని ఒక యింటిలో భాగము అద్దెకు మాట్లాడుకొని అక్కడ 1892 సం॥ డిశెంబరు ఆఖరువరకుంటిమి. నేను రాజమహేంద్రవరమునుండి రాకమునుపే సుబ్బారావుగారి రెండవభార్య గుడివాడతాలూకా బొమ్ములూరులో ఆయన పెద్ద భావమరదియింట్లో చనిపోయినది. నేను మద్రాసు వచ్చిన కొద్దిరోజులకే ఆయన మొదటిభార్య విధవచెల్లెలుకూడ చనిపోయినది. అప్పుడాయన తన కొమారుడు, కొమార్తెలతో తిరువల్లికేణిలోని యిల్లు అమ్మివేసి, మైలాపూరులో ప్రవేశించినారు. తెలుగులా గ్రంథములు, మహారాష్ట్రి గుజరాతీభాషలలో ననువదింపించి సొమ్ము సంపాదించుచున్నను, కొద్దిగా గవర్నమెంటు ప్రోనోట్లు కొనుట, అమ్మట, ఆపలేదు. భీమసేనరావు ఆయనను వదలలేదు. ఇతడాయనకు శనిగాడని చెప్పదగును. నేను, ముగ్గురుకోర్టు క్లార్కులతో కలసి జట్కాలో హైకోర్టుకువెళ్లి వచ్చేటప్పుడు సుబ్బారావుగారి ఆఫీసులో ఆయనను కలసికొని తిరువలికేణికి ఆయన రెండుగుఱ్ఱములబండిమీద వచ్చేవాడను. నన్ను దింపి ఆయన మైలాపూరు వెళ్లుచుండేవాడు.

ఈయన speculation లో హైకోర్టువకీలు కల్లేనారాయణ రావుగారుకూడా చేరి తమకుభయులకు వచ్చిన నష్టమును సుబ్బారావుగారి తలమీందనే రుద్ది తన బంధువునకు ఆయన Made Easy Seriesపుస్తకముల కాపీరైటునంతయు తాకట్టు పెట్టించెను. తుదకు ఆయన ప్రెస్సుకూడా తాకట్టు పెట్టబడెను.

నేను 1893 సంవత్సరపు వేసంగులలో నా భార్యను పుట్టింటికి కాన్పునకు తీసికొనివెళ్లి తిరిగి హైకోర్టు తీసినపుడు నేను ఒక్కడనే వచ్చి మైలాపూరులో సుబ్బారావుగారితోనే యుంటిని. అప్రెంటిసుషిప్పు పూర్తిచేసి, 1893 సం॥ సెప్టెంబరులో హైకోర్టువకీలు పట్టా తీసికొంటిని. 1894 సం॥ జనేవరిలో యమ్. యల్. పరీక్షకు వెళ్లితినిగాని ఒక్క Constitutional Lawలో మార్కులు తగ్గుటచే పరీక్ష తప్పినది. తరువాత నా భార్యను, నాపెద్దపిల్లవానిని మద్రాసు రావించుకొని, మరియొకమారు ఆ పరీక్షకే చదివితినిగాని, యీసారి రెండు గ్రంథములలో మార్కులు తగ్గినవి. ఈ పరీక్షజూదమును ఆపివేసి రాజమహేంద్రవరము, లేక కాకినాడలో ప్రాక్టీసు చేయుటకు నిశ్చయించుకొనగా తాను బందరువాడననిన్ని, మాలోమాకు యెల్లపుడు సంబంధము విడిపోకుండ బందరులోనే మేముంటే తాను వచ్చి చూచుచుందుననిన్ని తన మేనల్లుళ్లు బందరులోనే చదువుకొందురనిన్ని చెప్పి అప్పు డక్కడకు వచ్చియున్న ముచ్చర్ల వెంకయ్య, రామబ్రహ్మంగార్ల సలహాతో నన్ను బందరుకు పంపించినారు. నాకు కావలసిన పాత్రసామాగ్రి,

బల్లలు, కుర్చీలు, లా రిపోర్టులు మొదలగు గ్రంథములు స్టీమరుమీాద బందరుకు యెగుమతి చేయించిరి. నేను 1895 వ సంవత్సరములో రాజమండ్రికివెళ్లి నా భార్యయిద్దరు మగపిల్ల వాండ్రతో మార్చి నెలలో బందరుకు వచ్చితిని. నా అత్తవారికి బందరు వెళ్లుట యెంతమాత్రము యిష్టములేదు. నిక్షేపమువంటి గోదావరిజిల్లా వదులుకొని, నే నెప్పుడు యెరుగని బందరుపరకు వెళ్లుట, అక్కడందరికిని ఆశ్చర్యము వేసినది. కాని నాకు నిజమైన స్నేహితుడును, అన్నగారివంటివాడు నగు వెంకటసుబ్బారావుగారిమాట తీసివేయజాలకపోతిని. నన్ను ఆయన కుబేరుని చేయవలెననియే ప్రయత్నించెను. నా కిష్టము లేని ప్లీడరీవృత్తికి నన్ను పంపవలసివచ్చెను గదాయని ఆయన మిక్కిలి విచారించెను. దైవఘటన మరియొక విధముగనుండగా, నా యదృష్టమిట్లుండగా, అన్యథా యెట్లు జరుగును ?

---

# అధ్యాయము ౬

## బందరులో ప్లీడరీవృత్తి.

(1895–1925)

బందరులో దేవర్సు సుబ్బారావుగారి యింట్లో వీధి భాగమును, భగవంతురావు పంతులుగారి మేడభాగమును కలిపి నెలకు రు 5 ల అద్దెయిచ్చే పద్ధతిలో 13 సంవత్సరము లుంటిని. తరువాత దినవహి హనుమంతరావుగారి మేడ నెలకు రు 15 లకు అద్దెకు తీసికొని 17 సంవత్సరములుంటిని. మొదట రెంటాల వెంకటసుబ్బారావు పంతులుగారు నెలకు రు 100 లు నా ఖర్చులకు పంపించేవారు. మూడుమాసము లిట్లు పంపిన తరువాత, యిక నేమాత్రము పంపనక్కరలేదని వ్రాసినాను. నాకు కావలసిన సొమ్ము నేను సంపాదించుకొన గలుగుచుంటిని. నేను బందరువచ్చిన మరుచటి సంవత్సరమే, అనగా 1896 లోనే, యేలూరు సబుకోర్టును బందరుకు మార్చినారు. నా స్నేహితులు, యేలూరునుండియు, రాజమహేంద్రవరమునుండియు వచ్చి, నన్ను తమతో రాజమహేంద్రవరము రమ్మనుమని మిక్కిలి బలవంతపెట్టిరిగాని నేను వెళ్లుటకు యిష్టపడలేదు. 1897 వ సంవత్సరములో పల్లూరు జమీపార్టిషన్ కేజులో యిండ్లు, తోటలు పంచుటకు నన్ను కమీషనరుగా, ఉభయపార్టీల సలహామీద యేర్పాటుచేసిరి. నన్ను రిశీవరుగా

74.A



V. Suryanarayana Rao

1907 సం॥ రం వయస్సు 41 సం॥ రములు

హైకోర్టు వకీలు, మచిలీపట్టణము.

74 B



1936 సం॥ రం వయస్సు 69 సం॥ రములు

వల్లూరి సూర్యనారాయణరావు, బి. యే., బి. యల్.,

యల్ టి., హైకోర్టు ఆడ్వకేటు—కొవ్వూరు.

కూడ యేర్పాటుచేసి జిల్లాజడ్జీగానున్న Munro దొరగారిచేత ఆర్డరు వేయించినను, మరునాడు, తనకు Cardew దొరగారు, పెన్షను తీసికొని యుండిన గుడిపాటి వేంకటరామయ్యగారికి శిఫారసుచేసినారు గనుక, నన్ను రిశీవరుపనిని యేలాగైనను తనకొరకు దయచేసి వదులుకొమ్మని చెప్పగా, నేను దానిని వదులుకొన్నాను. ఈ Munro గారే గోదావరిజిల్లాజడ్జీగా నున్నపుడు, నిడదవోలు జమీపార్టిషన్ దావాలో నన్ను రిశీవరుగా యేర్పాటుచేయదలచెను, నా స్నేహితుడున్ను నావలన దానిలో నొకపార్టీయగు మీర్జాపురం జమీందారగు నరశింహ్వా అప్పారావుగారి తరఫున వకాలతు పొందినవాడున్ను అయిన ములుకుట్ల అచ్చుతరామయ్యగారు అదివరకు తన కేదియో సంబంధమేర్పడి, మా మామగారి యింటి యెదుటనున్న మాడపాటి వేంకటేశ్వరరావుగారితో లాలూచీపడి, ఆ రిశీవరుపని ఢిల్లీ జగన్నాధరావుగారికి యిప్పించెను. సర్భాభ్యంగారు, దానిలో వాదియైన పార్ధసారథి అప్పారావుగారి తరఫున వకీలుగానుండి నాకిప్పించవలెనని ప్రయత్నించెనుగాని తక్కిన యిద్దరు పార్టీలు మరియొకరిని కోరుకొన్నారు గనుక, నాకా పని యియ్యలేదు. ఈ సంగతి తెలియగానే, మీర్జాపురం జమీందారుగారు, తన మాటకు వ్యతిరేకముగా జరిగించినందుకు, అచ్చుతరామయ్యగారి కిచ్చిన వకాలతునామా రద్దుపరచి, మోచర్ల రామచంద్రరావు పంతులుగారికి వకాలతు యిచ్చినారు. ఇట్టి ద్రోహము జరుగనియెడల, యీ ప్లీడరీవృత్తి మానివేసి 13 సంవత్సర

ములు రిశీవరుగా నుండి యుండును. నేను రాజకీయసాంఘిక విషయములలో, మొదటినుండియు పాల్గొనుచు, జిల్లాసంఘము నకును, కృష్ణాక్లబ్బునకును కొన్ని సంవత్సరములు సెక్రటరీగా యుంటిని. జిల్లా కాన్ఫరెన్సులకు యేటేట పోవుచుంటిని. నోబిల్ కాలేజిలో ఉపాధ్యాయుడుగా నున్న చోడవరపు జగన్నాథ రావు బి. యే. గారు, తన మొదటి భార్యను పోగొట్టుకొని, ఆమె చెల్లెలున్ను, అక్షతయోని యగు వితంతువున్ను 13 సంవత్సరముల యీడుగల పిల్లను తాను పునర్వివాహము చేసికొనుట యుచితముకాదా యని నాతో సంప్రదించినప్పుడు, నేనతని యుద్దేశమునకు మెచ్చుకొని, నా స్నేహితులగు చెన్నాప్రగడ భానుమూర్తి, కొండా వెంకటప్పయ్యగార్ల సహాయముతో గ్రామములో యేబదిమంది సంపన్న నియోగి గృహస్థుల దస్కతులతో, జిల్లాయంతయు శుభలేఖలు పంపించి దిగ్విజయముగా అయిదురోజులు వల్లూరు రాజాగారి మేడలో వివాహము జరిపించితిని. మమ్ములనందరిని రెండుసంవత్సరములు అక్కడి వైదికులందరు వెలివేయగా భట్లపెనుమర్రు గ్రామమునుండి పద్ధతినియోగులను తెప్పించి, కర్మబాహ్యులము కాకుండ చేసికొంటిమి. తరువాత వైదికబ్రాహ్మణులు కాళ్లబేరమునకు వచ్చి కస్తూరి శివశంకరశాస్త్రిగారి అధ్యక్షతక్రింద గోడుగుపేట శివాలయములో బ్రాహ్మణసమావేశము కావించిరి. అక్కడకు నేను స్మృతిప్రమాణముల మీాద వాదించి, ధర్మజ్ఞసభ యేర్పడు నంతవరకు, ఒండొరులను ఆంక్ష చేయుటకు

వలను పడదని తీర్మానము వ్రాసుచేయించితిని. ఆతీర్పు, నే టికిని బందరులో అమలులో నున్నట్లే యెంచబడుచున్నది.

నాప్లీడరీ వృత్తిలో, నానడతను గురించిగాని నిర్భ యమును గురించిగాని, నేనుచెప్పుకొనుట యుచితముకాదు. కృష్ణాజిల్లావారందరికిని తెలుసునుగనుక యది యనవసరము. కాని, యీవృత్తిలో, నేనొకటిరెండుసార్లు ముద్దాయిగా నుంటినిగనుక, వానిని గురించిమాత్రము క్లుప్తముగా వ్రాయ దలచితిని. 1904వ సంవత్సరములో, బందరులో డిప్యూటి కలెక్టరుగా నుండిన పండిత నాగేశరావుగారితో తగాయిదా పెట్టుకొనుట తటస్థించినది. ఈయనక్రింద అప్పుడు, అవని గడ్డ, బందరు, గుడివాడ మేజస్ట్రీటు లుండేవారు. వీరు ము గ్గురు తీసికొను లంచములలో, సగభాగము నాగేశరావుగారి కిచ్చేటట్లున్న వారి తీర్పులమీద వచ్చు అప్పీళ్ళను యీయన ఖాయపరుచునట్లును యేర్పాటుండెనని గొప్పపుకారు, జిల్లా యంతయు బయలుదేరినది. దీనిలో యెంతవరకు సత్యముకలదో నాకు తెలియదుగాని, మిక్కిలి తెలివిగలవాడును, పట్టుదలగల వాడును, నాకు 1895వ సంవత్సరమునుండి ముఖ్యస్నేహితుడు నగు భట్రాజు వేంకటరాయుడుగారు, బాల రామయ్యఅను భూమి ఖామందుతరఫున ప్లీడరుగానుండి, తన క్లయింటుమీద, బందరుమేజస్ట్రీటు వెంకటరమణయ్యగారును యీ డిప్యూటి కలెక్టరు పండిత నాగేశరరావుగారును జరుపుచున్న దౌర్జన్య మును సహించలేక, సబుకోర్టులో నేనున్న కొండా వెంకటప్ప

య్యగారున్ను ఉండగా వచ్చి మమ్ములను డిప్యూటి కలెక్టరు గారివద్దకు తీసికొనివెళ్లి సదరు బాల రామయ్యను అక్రమముగా అరెస్టుచేయకూడదని పిటీషను పెట్టించినాము. దానిలో దురుద్దేశముతోను, కార్పణ్యముతోను, అవనిగడ్డ మేజస్ట్రీటుకు ప్రాపకుడవై యిట్టిపని జరిగించితివని ఆ పిటీషనులో స్పష్టముగ వ్రాసితిమి. కాని ఆ పిటీషనుమీద పార్టీదస్కతు పుచ్చుకొనలేదు. బాల రామయ్యవలన అఫిడవిట్టున్ను పుచ్చుకొనలేదు. బహుతొందరగా నాగేశరావుగారి యింటికి వెళ్లి ఆయనచేతికే యిచ్చినాము. ఆ పిటీషను చేతికీయగానే, అది చదువుకొని. గడగడ వణకి, తరువాత ఆర్డరు వేసెదననియు, బాల రామయ్యతో అవనిగడ్డ మేజస్ట్రీటువద్దకు ఒక నిర్దిష్టమైన తేదీలోగా హాజరయ్యేవరకు, పూచీఖత్తు తనకుయిచ్చి తీరవలెనని చెప్పినారు. అయిదారుదినములు గడచిన తరువాత, దిర్శివల్లి బాచిలో, తాను వాదిగానున్నను నేను ప్రతివాదుల తరఫున పని చేయుచుండుటచే నా మీద యీర్ష్యవహించిన పబ్లీకు ప్రాసిక్యూటరు శ్రీ రంగాచార్లుగారి సహాయముతో మద్రాసులోనున్న పి. శివస్వామయ్యరుగారికి వ్రాసి సలహా తెచ్చుకొని, నాకును, వెంకటప్పయ్యగారికిని, బాలరామయ్యకును, పీనల్ కోడ్డు 228 శెక్షనుక్రింద నేరము మోపి, యేల మమ్మును క్రిమినల్ కోర్టులో ప్రాసిక్యూటుచేయకూడదో సముజాయిషీ యీయవలసినదని నాగేశరావుగారు నోటీసులను జారీచేయించిరి. ఈ సంగతులన్నియు మాకు ముందే చూచాయగా తెలిసి,

బాలరామయ్యచేత ప్రమాణపత్రమును తీసికొని క్లబ్బులోనే, మెంబరగు వేమూరి సుబ్బారావుపంతులుగారు, ఆనరెరీ మేజ స్ట్రీటుగా నుండుటచే, ఆయనయెదుట ధృవపరపించి, చర్యలో దిగితిమి. మేము హైకోర్టువరకుపోయి తుదకు 1905 సంవత్స రము సెప్టెంబరు మాసములో మేము నిర్దోషులమని యెంచ బడి, నాగేశరావుగారికి చీవాట్లు సంభవించినవి. ఈ కేజు 29 మద్రాసు 100 పేజిలో రిపోర్టు చేయడెను.

1895 వ సంవత్సరములో బందరు సబుకోర్టు యేలూ రుకు మార్చబడినది. అప్పుడు రెంటాల వేంకటసుబ్బారావు గారు నన్ను మద్రాసులోనే ప్రాక్టీసుచేయవలసినదని చెప్పగా ఒప్పుకొంటినిగాని, యింటికివచ్చి పుస్తకములు ప్యాకేజీచేయు చుండగా మాగుమాస్తా భాగవతుల పిచ్చయ్యగారు, నాకు క్లయంట్లువలన, వారిలో ముఖ్యముగా మీర్జాపురం జమీం దారువలన రావలసిన బాకీలు వసూలుకానందున వెళ్లుటకు వీలులేదని నాప్రయాణము నప్పటికి మానిపించినారు. నాక్లయం టైన మీర్జాపురం జమీందారుగారికి నిడదవోలు రిశీవరు యొద్దనుండి రావలసిన సుమారు ముప్పదిమూడువేలరూపా యిల చెక్కుకు అప్లికేషను పెట్టితిని. అది నాపేర ఆర్డరైనది గాని, యింతలో బందరు సబుకోర్టు యేలూరుకు ట్రాన్సుఫరు అగుటవలన అక్కడిప్లీడరు మోచర్ల రామచంద్రరావుగారికి తాజా వకాలతునామా యిచ్చి సొమ్మురాబట్టమని జమీం దారుగారికి నేనే వ్రాసినాను. తరువాత నేను నామేనమామ

కొమారుడు పాలపర్తి శివరావుగారి గృహప్రవేశోత్సవమునకు వెళ్లగా యేలూరు సబుకోర్టు శిరస్తాదారగు కస్తూరి కృష్ణానందంగారు, నాపేర చెక్కు వ్రాయబడి సిద్ధముగా నున్న దనియు, నన్ను తీసికొని పోవలసినదనియు చెప్పగా, ఆచెక్కును పుచ్చుకొని, బందరు ట్రెజరీలో మార్చి యెనిమిదివేల రూపాయిలు మాత్రము నాఖాతాబాకీక్రింద యుంచితిననిన్ని, తక్కినది పంపివేసితిననిన్ని, వారింకను కొంతపంపమంటె మరి నాలుగువేలరూపాయిలు మాత్రము పంపెదననిన్ని జమిాందారుగారికి వ్రాసితిని. నేనదివరకు నూజవీడువెళ్లి యావత్తు లెక్క తేల్చుకొని ఆరువేలరూపాయిలకు లెక్క జమాఖర్చు, నాదస్కతుతో వారికిచ్చియుంటిని. అట్లయినను, దానిలో రెండువేలరూపాయిలు బాకీ కనపరచినట్లు వారు జబాబు వ్రాయగా, నేను వ్రాసియిచ్చినలెక్క జాబితాలో కొన్ని అంకెలుదిద్ది ఫోర్జరీచేసి యుండవలెననియు, అసలుకాపీని చూపించినయెడల నిజము తేలుననియు స్పష్టముగా వ్రాసివేసినాను. ఇంతటితో యీవిషయము ముగిసినది. దీని దరిమిలాను కూడా, జమిాందారుగారి తరఫున వ్యాజ్యములలో పనిచేయుచునే యుంటిని.

ఇట్లుండగా, అకస్మాత్తుగా 1907 సం॥రం మెయినెలలో నేను నందిగామజిల్లా కాన్ఫరెన్సుకు ప్రెసిడెంటుగా వెళ్లుటకు ప్రయాణమగుచుండగా, ఆదివారము పగలు 9 గంటలకు పండిత నాగేశ్వరావుగారు నాఆఫీసులోని కొన్ని కాగితములకు

సెర్చివారంటు పంపినారు. నామీదను మీర్జాపురం జమీం దారుగారు, తనసెక్రటరీ పార్థసారథిచేత, యీడిప్యూటీకలె క్టరుగారియొద్ద సొమ్మపహరించిన నేరమునకు క్రిమినల్ కంప్లై యింటు దాఖలుచేయించెనట ! నేను నాప్రయాణమును ఆపక నాగుమాస్తా భాగవతుల పిచ్చయ్యగారిని నాస్నేహితులైన భట్రాజు వేంకటరాయుడుగారిని, సామ్యుయల్ గారిని నాఆఫీసులో నుంచి, నేను జట్కామీద, పెడనకువెళ్లి, అక్కడకు నూతనముగా వేయుచుండిన రైలుబండిలో బెజవాడకు వెళ్లితిని. ఆ వెనుకటిదినమే లాలాలజపతిరాయిగారి అక్రమపు అరెస్టునుగురించి జరిగిన మీటింగులో మాట్లాడియున్నాను. విక్టోరియా మెమోరియల్ హాలు యొక్క నిబంధన విషయమై పురాణం వెంకటప్పయ్యగారి చర్యను ఖండించుచు మీటింగులు చేయుచుంటిని. ఎల్లేపద్ది జానకిరామయ్యగారు, ఒక వితంతువు ఆస్తిని, ఆమె ప్లీడరుగానుండి, అన్యాయముగా తానుకొని ఆమెను దత్తుచేసికొనకుండా ఆంక్షలో నుంచగా ఆ యాంక్షను నిర్లక్ష్యముచేసి ఆమెకు దత్తతచేయించితిని. వెంకటప్పయ్యగారి తండ్రి ఒకసభాపతిగా నుండి మమ్ము నాంక్షచేయించినందుకు నేను పబ్లికు మీటింగులుచేసి ఆ యాంక్షను నిర్మూలన మొనరించితిని. ఈ బృందమువారి సలహాపైని, నా విరోధియగు నాగేశరావుగారి యెదుట ఆ స్వరాజ్యాందోళన దినములలో చార్జియిచ్చిన యెడల ఆయన నాకు తప్పక కఠినశిక్ష వేయుననియు అప్పీలులో తెల్లదొర ఖాయముచేయక మాన

డనియు వీరందరు గూడుపుఠాణిచేసి యీ చర్య నా మీద జరిపినారని నేను గట్టిగ నమ్ముచున్నాను. నేను నందిగామ నుండి వచ్చినతరువాత నా కేజు వాయిదా దినముననే యీ నాగేశరావుగారి ప్రాపకుడగు పార్సన్సుగారు వెళ్ళిపోయి మారిసుదొరగారు డిస్ట్రిక్టు మేజస్ట్రీటుగా వచ్చినందున, ఆయన యెదుట కేజు ట్రాన్సుఫరు చేయవలసినదని పిటీషను పెట్టితిని. అదివరకు మా కిద్దరుకు జరిగిన ప్రొసీడింగ్సు చూపగానే ఆయన కేజును తక్షణము నా కోరికపయిననే బెజవాడ సబు కలెక్టరు బర్కెట్టుగారివద్దకు ట్రాన్సుఫరు చేసినారు. 1907 వ సంవత్సరము జూలైనుండి డిసెంబరు ఆఖరువరకు ప్రతినెల మొదటివారమున నా వీలుకొరకు కేజునుకోర్టువారు తీసికొను చుండిరి. ప్రతివాయిదాకు చెన్నపట్టణమునుండి టంగుటూరి ప్రకాశంగారిని, బందరునుండి వేమవరపు రామదాసుగారిని తెప్పించుకొనుచుంటిని. కంప్లెయినెంటు రాజుగారు చెన్నపట్ట ణమునుండి దినమునకు రు 250 లు యిచ్చి గవర్నమెంటు ప్లీడరు పవలుదొరగారిని రు 75 లు యిచ్చి వెనుకటి క్రిమినల్ కేజులో నా తరపునయున్న డాక్టరుస్వామినాధంగారిని తెప్పిం చుకొనుచుండిరి. ఆ కాలములో ఒక సంవత్సరమునుండి నాకు డొక్కలో శూలనొప్పి ప్రవేశించినది. నా మీద చార్జినిలిపి నా యుత్తరసాక్ష్యము తీసికొని నా మీద చార్జీని కొట్టివేసి నేను నిరపరాధినని బర్కెటుగారు ఒక దీర్ఘమైన తీర్పుయిచ్చి నారు. ఈ కేజులో మా జమీందారుగారికి పదిహేడు వేల

రూపాయిలు ఖర్చు అయినదట! దీని ఫలితమును బట్టియే యీా యన నా మీద హైకోర్టులో పెట్టిన పిటీషన్ కూడ రద్దు అయి నది.

ఒర్కిటుదొరగారు డిసెంబరు శలవులలో తీర్పు చెప్పెద మనియు, నేను పూచీకత్తుమీద నున్నను యిక రా నక్కర లేదనియు చెప్పుటచేత నేను, ప్రకాశంగారు, రామదాసుగారు కలసి సూరతు కాంగ్రెసుకు వెళ్లినాము. తిరిగి వచ్చేటప్పుడు నాసికాత్రయంబకములకు వెళ్లితిమి. అదివరకు 1905, 1906 సంవత్సరములలో కాశీ, కలకత్తా కాంగ్రెసులకు పోయి అయోధ్య మొదలగు పుణ్యస్థలములను చూచి వచ్చితిని.

మిర్జాపురం జమీందారుగారు నామీద నింకను కార్ప ణ్యము వహించి రు 12000 లు పై వ్యవహారములో నాయొద్ద తన సొమ్ము వడ్డీతో నిలవయున్నదని దావా వేసెను. నేను కూడా నామీద తాను తప్పుడుచార్జి యిచ్చినందుకు రు 10000 లకు దావా తెచ్చితిని. ఈ రెండు దావాలును చాలకాలము బందరు జిల్లాకోర్టులో పెండింగులోనుండి తుదకు యేలూరుకు ట్రాన్సుఫరు చేయబడినవి. అక్కడ నాతరపున పెద్దాడ సాంబ శివరావుగారును, రాజాగారితరపున మోచర్ల రామచంద్ర రావుగారును వకాలతులు తీసికొన్నారు. రాజాగారు చని పోవుటచే కొమాళ్లు మైనర్లుగాన, యెస్టేటు కోర్టు ఆఫ్‌వార్డ్సు చేతిలోనికి వచ్చినది. అప్పుడు కలెక్టరు బ్రెయిత్‌వ్యుడ్డుగారు నన్ను పిలిపించి రాజీగా పైసలు చేసికొమ్మని చెప్పగా, ఆయ

నకు పూర్వపు క్రిమినల్ కోర్టు జడ్జిమెంటు చూపించి, విషయము లన్నియు తెలియచేసితిని. ఉభయుల ప్లీడర్లు ఖాయపరచిన అక్కౌంటు ప్రకారము సొమ్ము పుచ్చుకొనవలసినదనియు, నాకు అయినఖర్చులు డామేజస్సు తన తీర్పుకు వదలివేయవలసినదనియు ఆయన చెప్పినారు. నేను ఒప్పుకున్నమీదట నాదగ్గరయున్న రాజాగారి యెనిమిదివేల మొత్తములో నాకీయవలసిన దంతయు పోగా, నేను రు 700 లు మాత్రము తిరిగి వాపసు చేయవలసి వచ్చినది.

ఈ పండిత నాగేశరావుగారు యిప్పటికిని బందరులో పెన్షను పుచ్చుకొనుచూ జీవించియేయున్నారు. నా కీయనమీద కోపమేమియు లేక, త్రోవలో కనుపడినపుడు పలుకరించుచుందును. ఈయనమీద బాలరామయ్య వేసిన డామేజస్సు వ్యాజ్యములో నేను తప్ప మరి యెవ్వరును ప్లీడరుగా నుండక, నిరాకరించుటచేత, మా స్నేహితుడు వెంకటరాయుడుగారు యేకారణముచేతనైతేనేమి తన పట్టుదల వీడి, యెవరి ఖర్చులు వారు భరించి, వ్యాజ్యము యెత్తివేసికొనేటట్లు తనకును నాకును క్లయంటైన బాలరామయ్యచేత ఒప్పించినాడు. ఈ నాగేశరావుగారితో తప్ప యీముప్పది సంవత్సరములలో కోర్టులలో యెంత నిర్భయముగ వాగ్వాదము జరుపుచుండినను యే డిప్యూటి కలెక్టరు, కలెక్టరు, జిల్లాజడ్జి, సబుజడ్జి, మునసబుతోగాని నేను జగడము పెట్టుకొనలేదు. నాలో యెంత రాజసతామసగుణములున్నను, అధికారులయెదుట మర్యాద

తప్పి యెన్నడు ప్రవర్తించలేదు. వారందరు నాయందు భక్తి, భయము, విశ్వాసము, గౌరవము నుంచేవారు. మాలో లోపము లేనివారు యెవరునులేరు గనుక యెంత వాగ్వాదములు జరుగుచున్నను, అన్యోన్యహృదయములు నిర్మలముతో కూడుకొన్నపుడు యెట్టి చిక్కు సంభవించలేదు. ఈయుద్యోగస్థులలో కొంతమంది లంచగొండ్లున్నపుడు వారిండ్లకువెళ్లి రహస్యముగా యిది తగదనియు, జనులు విడ్డూరముగా చెప్పుకొనుటకు అవకాశమీయవలదనియు మందలించుచుంటిని. నే నెవరికిని వంగి వంగి సలాములు చేసి యెరుగను. నేను గవర్నమెంటు వారిచ్చు బిరుదులను, గౌరవపదములను కోరకపోగా, వారి పరిపాలనతో సంబంధించిన మునిసిపల్, లోకలుబోర్డులలో ప్రజల తరపున యెన్నుకొనబడుటకుకూడ నిరాకరించి, వానితోకూడ యెట్టి సంబంధము పెట్టుకొనలేదు.

ఈ ప్లీడరీవృత్తిని 1920 వ సంవత్సరములో గాంధిమహాత్ముడు బందరువచ్చి చేసిన ప్రోత్సాహమువలన నాస్వలాభము మానుకొని, ఆయన కిష్టములేకపోయినను, ధర్మాదాయ దేవాదాయ సంరక్షణకొరకు, నేటివరకును, యీవృత్తిని వదలక, కోర్టులలో ఉచితముగా పని చేసిపెట్టుటకు వెళ్లుచున్నాను. ఈయుద్యమచరిత్రను యిటుతరువాత వచ్చు అధ్యాయములో విపులముగ వ్రాయుచున్నాను.

---

# అ ధ్యా య ము ౭

దేవాదాయధర్మాదాయరక్షణ.

(1913–1935)

ఆ 1911 వ సంవత్సరములో మద్రాసుకు మా పెద్దపిల్లవాడు చెన్నపట్టణము ప్రెసిడెన్సి కాలేజిలో చేరుటకు ఒక్కనినే పంపినప్పుడు నా స్నేహితులు కొందరు మద్రాసులోనే నన్ను ప్రాక్టీసు మొదలుపెట్టుట మంచిదని సలహా నొసంగిరి. కాని, నేను ద్రవ్యమును ఎక్కువగ సంపాదించకపోవుటచే నేను పట్టణములో అనవసరచిక్కులకు లోబడుదునేమో యని నా స్నేహితుడైన వేమవరపు రామదాసుపంతులుగారిని వెళ్లమని పురికొల్పి పంపితిని. నేను వెళ్లినయెడల తాను బందరులోనే నిలచిపోదునని ఆయన చెప్పగా ఆయన నాకంటె చాలా చిన్నవాడును తెలివైనవాడును, ఆస్తిపరుడును అగుటబట్టి నేను ఆయనకు అప్పీళ్లు పంపుచుండవచ్చుననియు ఆయన హైకోర్టు జడ్జీ కావచ్చుననియు యెంచి నా ప్రయాణమును విరమించుకొంటిని. ఆయన చెన్నపట్టణము వెళ్లినందుకు యెట్టి పశ్చాత్తాపము పొందనక్కరలేకుండ యిండ్లు, భూములు గాక రొఖ్కఆస్తిని రెండులక్షల రూపాయీల పైగా సంపాదించుకొని తన కుటుంబముతో సుఖముగా చెన్నపట్టణములో కాలము గడపుచున్నారు. ఈయన హైకోర్టు జడ్జీ కాకపోవు

టకు రాజకీయాందోళనములో తగుల్కొనుటయే ముఖ్య కారణము. ఇప్పుడు సహకారోద్యమములో చాలా కష్టపడి పనిచేయుచున్నారు. ఈయన మంచివక్తయు, లేఖరియునగుట బట్టి ప్రజోపయోగకరమైన యుద్యమము లన్నిటిలో పాల్గొనుటకు సమర్థుడుగ నుండి తనశక్తివంచన లేకుండ పాటుపడు చున్నారు.

ఈయన చెన్నపట్టణము వెళ్లేటప్పుడు కృష్ణాకలెక్టరు గారి సాంక్షను నిమిత్తము యిందుపల్లి దేవస్థానమును గురించి పిటిషను పెట్టియున్నారు. సాంక్షను యీయబడిన తరువాత నేను బందరు సబుకోర్టులో (O. S. 12 of 13) గా సబుజడ్జి త్యాగరాజయ్యరుగారి వద్ద ప్లయింటు దాఖలు చేసినాను. ఇదియే నాప్రథమస్కీము వ్యాజ్యము. దీనిని కొంతపట్టుదలతో నేను నడపితిని. నిత్యనైవేద్యధూపదీపారాధనలకని యీ నాము స్టేటుమెంటులలో అర్చకులు వ్రాసికొన్నమాటలకు అర్థము చేయవలసివచ్చినది. సబుజడ్జీగారు పూర్ణముగా విచారించి యీనాములు స్వామివారికే యీయబడినవనియు, వాని మీద వచ్చు అయివజు స్వామివారికి కావలసిన కార్యముల కన్నిటికిని వినియోగించవలెననియు, అయివజునంతయు అర్చకులే తినకూడదనియు, దానిలో తగుమాత్రము వారిజీవనోపాధికి ఖర్చు చేయవలెననియు, యీ అర్చకులే మేనేజర్లుగా నుండుటకంటె వేరుగ ట్రస్టీలు యేర్పడుట మంచిదనియు తీర్పు చేసిరి. ఈతీర్పుమీద హైకోర్టుకు అప్పీలుచేయగా త్యాగ

రాజయ్యరుగారి తీర్పు మెచ్చుకొనుచు ముఖ్యన్యాయాధిపతి యగు ట్రాటరుగారు దానిని ఖాయపరచిరి. రెండవన్యాయాధి పతి కే. శ్రీనివాసయ్యంగారు కూడ ఆమోదించిరి. (31 మ. లా. జ. 202 పేజి) ఈ తీర్పు ఆధారముగా చేసికొని కె. కృష్ణ మాచార్యులవారియొద్ద పెదముత్తేవి దేవాలయమునకు స్కీము వ్యాజ్యము వేసితిని. (O. S. 7 of 1915) ఇదికూడా హైకోర్టు వరకువెళ్లి స్కీము యేర్పరచబడినది. క్రమక్రమ ముగా 1925 సంవత్సరమువరకు జిల్లాలో నుండే పెద్ద దేవాల యము లన్నిటికి ఆయాగ్రామస్థులు వచ్చి నాచేత ననేకవ్యా జ్యములు వేయించి స్కీముల నేర్పాటు చేయించుకొను చుండిరి. ఇట్టి వ్యాజ్యములు గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో హెచ్చినవిగాని, యీపనికి ఉచితముగా ప్లీడర్లు తోడ్పడినగాని గ్రామస్థులకు ఉత్సాహము పుట్టదనియు, పని బాగుగా సాగనేరదనియు నేను కనుగొంటిని. ఒక్క కృష్ణా జిల్లాలోనే అనేక దేవాలయములకు స్కీముల నేర్పాటు చేయ వలసి వచ్చినది. నేను మామూలు ప్రాక్టీసు చేసికొన్నంత కాలము యీదేవస్థాన సంరక్షణకు తగినంత కృషిచేయజాల నని తోచినది. ధర్మరక్షకసభను చెన్నపట్టణములో సర్ సుబ్రహ్మణ్యయ్యరుగారు స్థాపించినట్లే స్థాపించవలెనని ప్రయ త్నించితిగాని, నాకు యే ప్లీడరును తోడ్పడకపోయెను. ఇంతలో గాంధిమహాత్ముడు బందరు వచ్చి కోర్టులను బహి ష్కరించవలయునని న్యాయవాదులకు బోధించగా వేమూరి

రామచంద్రరావుగారు రొక్కరుమాత్రము తనప్లీడరీ వృత్తిని మానివేసిరి. ఇంటివద్ద పంచాయతీకోర్టు పెట్టుకొని కొద్దిగా సంపాదించుకొనేవారు. నేను మొదటినుంచి రాజకీయవిషయములలో పాల్గొనుచున్నను, మహాత్ముని విధానమునం దంతగా నమ్మకము కుదరలేదు. అయినను రాజకీయస్వాతంత్ర్యము నకు కాకపోయినను, ఆత్మస్వాతంత్ర్యమునకైనను అది మార్గము చూపుచున్నదని యెంచి, ద్రవ్యార్జనను విరమించి కోర్టులలో ఉచితముగ దేవాదాయధర్మాదాయ సంరక్షణకు పని చేయనిశ్చయించి ప్రయివేటు పార్టీలతరఫున కేజులు పట్టనని 1921 సంవత్సరములో వార్తాపత్రికలలో ప్రచురించితిని. అప్పటినుండియు స్వరాజ్యవాదులు శాసననిర్మాణసభల నెట్లుబహిష్కరించక వానిలోకిపోయి వానిని భగ్నముచేయుట కెట్లు ప్రయత్నించిరో ఆవిధముగనే కోర్టులద్వారానే స్కీముల నేర్పాటుచేసి మన దేవాదాయధర్మాదాయములను మతవిద్య, జాతీయవిద్యల కుపయోగపడునట్లు చేయవలెననియు, కోర్టులకు వచ్చు పార్టీలను పంచాయతీసభలకు పంపుచుండవలెననియు నేను సంకల్పించితిని.

అనేకమంది మేధావంతులున్న బందరు పట్టణములో కోర్టులలో నిలవయున్న వ్యాజ్యములను మధ్యవర్తులగుండా గ్రామస్థులు పరిష్కారము చేసికొందురేమో యని ఒకపంచాయితీ కోర్టుబల్లను మా యింటిగోడకు రెండు సంవత్సరములు తగిలించి నేను నా దేవాదాయధర్మాదాయపని నిమిత్తము

కోర్టునకు వెళ్లునప్పుడెల్లను పార్టీలను రమ్మనుమని బోధచేయు చుంటిని. ఒక్క కేజులో మాత్రము యీ రెండుసంవత్సరము లలో నాకును, మరియిద్దరు హైకోర్టు వకీళ్ళకును ఉభయపా ర్టీలు పంచాయితీఖరారునామా వ్రాసియిచ్చిరి. మేమువిచా రించి, తీర్పుయిచ్చి ఉభయపార్టీలకు చదివి వినిపించిన తరు వాత వారిలో కొంచముగా ఓడిపోయిన ఒకపార్టీ మమ్మును తీర్పుచెప్పక నిలుపుదలచేయవలెననియు, ఆర్బిట్రేషను వదలు కొంటిననియు మా ముగ్గురుమధ్యవర్తులపేరను రిజస్టరు నోటీసు పంపించెను. తుదకు కోర్టులో మా తీర్పునుగురించి వ్యాజ్యము జరిగి మాసాక్ష్యముమీద డిక్రీయయినది. ఈపంచాయతీదార్లు పక్షపాతమువహించిరని, కోర్టులో వ్యాజ్యములు వేయుటయు, వారు తమ నడతనుగురించి కోర్టులో సాక్ష్యమిచ్చుకొనుటయు సంభవించుచుండుట తప్ప, యెట్టిలాభము కలుగలేదని యెంచి మా యింటికి కట్టుకొన్నబల్లను బ్రద్దలుగొట్టి తీసిపారవేసితిని. అహంకారపూరితులై, స్వార్థపరులై, ఒక్కవాళ్ళను హైకోర్టు వరకు యీ జూదములో లాగి అన్యాయముగ వీత్తమార్జనచే యుటకు గ్రామపెద్దలే సిద్ధముగనున్నపుడు వీరుపంచాయితీల తీర్మానములకు ఒప్పుకొందురనుమాట ఒట్టి కల్లయని ధ్రువ పడినది. కాబట్టి కోర్టులకుపోయి దేవాలయములు, సత్రములు మొదలగు పబ్లికుసంస్థాపన లయినను. మంచిపునాదుల మీద నుంచుటకు ప్రయత్నించి, నేను బందరులో 1924 వ సంవత్స రము ఆఖరువరకు, దావాలువేసి రిశీవర్లనుగాని ట్రస్టీలనుగాని నియమింపజేసినవి కొన్నిటిని ఈ క్రింద పొందుపరచుచున్నాను.

| సంవత్సరము | జ్ఞాపనము నంబరు | గ్రామము | సంస్థాపనము | సాలువారీ అయివజు |
|---|---|---|---|---|
| 1913 | 12 | ఇందుపల్లి | విష్ణాలయము | 3000 |
| 1915 | 7 | పెదముత్తేవి | శ్రీలక్ష్మీపతిస్వామివారు | 4500 |
| 1917 | 20 | కరఅగ్రహారము | శ్రీసోమేశ్వరస్వామి | 1000 |
| 1917 | 11, 12 | మచిలీపట్టణము గొడుగుపేట | శ్రీగోపాలస్వామివారు | 4000 |
| 1918 | 2 | గురుజాడ | శివాలయము | 1500 |
| 1918 | 3 | గురుజాడ | విష్ణాలయము | 1500 |
| 1918 | 40 | మచిలీపట్నం బచ్చుపేట | శ్రీ వేంకటేశ్వరస్వామివారు | 8000 |
| 1918 | 56 | కాతరం | శ్రీ గౌతమేశ్వరస్వామివారు | 1000 |

| సంవత్సరము | ఖాతా నంబరు | గ్రామము | సంస్థాపనము | సాలువారీ అయివజు |
|---|---|---|---|---|
| 1918 | 57 | కౌతరం | విష్ణాలయము | 1000 |
| 1919 | 14 | గుడివాడ | బ్రాహ్మణసత్రము | 1600 |
| 1919 | 78 | గుడివాడ | శ్రీభీమేశ్వరస్వామివారు | 2500 |
| 1920 | 7 | గురుజ | శ్రీమదనగోపాలస్వామివారు | 2000 |
| 1920 | 37 | గుడివాడ | శ్రీఆంజనేయస్వామి | 1000 |
| 1920 | 24 | మచిలీపట్టణము | శ్రీరామలింగేశ్వరస్వామివారు | 1500 |
| | – | రాబర్టుసన్ పేట | | |
| 1920 | 66 | చేతవోలు | విష్ణాలయము | 1500 |
| 1921 | 60 | పులయ్యూరు, బెజవాడ వగైరా గ్రామాదులు | మాడపాటి వేంకటేశ్వరరావుగారి ధర్మసంస్థాపనము | 10000 |

| | | | | |
|---|---|---|---|---|
| 1921 | 48 | మచిలీపట్టణము ఖొజ్జిల్లిపేట | శ్రీ నాగేశ్వరస్వామివారు | 1700 |
| 1921 | 48 | గూడూరు | శ్రీ రామలింగేశ్వరస్వామివారు | 2000 |
| 1921 | 29 | వడాలి | శ్రీ జగన్నాథస్వామిరువారు | |
| 1922 | 12 | | | |
| 1921 | 51 | నందివాడ | విష్ణాలయము | 800 |
| 1922 | 80 | దండిగానిపూడి | ధర్మచెరువు | 400 |
| 1922 | 50 | మచిలీపట్టణము రాబర్టుసన్ పేట | శ్రీ రంగనాయకస్వామివారు | 2000 |
| 1922 | 23 | అంగలూరు | శ్రీ అమరేశ్వరస్వామివారు | 1500 |
| 1922 | 83 | మోటూరు | శివాలయము | 1000 |
| 1923 | 32 | దండిగానిపూడి | మరియొక ధర్మచెరువు | 400 |
| 1923 | 12 | శాయపురం | శివాలయము | 800 |
| 1923 | 34 | కలిదిండి | విష్ణాలయము | 1200 |
| 1924 | 20 | మండవల్లి | విష్ణాలయము | 1000 |
| 1924 | 23 | మచ్లీపట్నం, గొడ్డుపేట | శ్రీ వేంకటేశ్వరస్వామివారు | 1500 |

| సంవత్సరము | శాసనము నెంబరు | గ్రామము | సంస్థాపనము | సాలువారీ అయినజు |
|---|---|---|---|---|
| 1924 | 3 | కాటూరు | విష్ణాలయము | 800 |
| 1924 | 25 | అకులమన్నాడు | విష్ణాలయము | 1200 |
| 1924 | 68 | మొలమర్రు | శివాలయము | 1500 |
| 1924 | 69 | మొలమర్రు | విష్ణాలయము | 1200 |
| 1924 | 41 | గొల్లపల్లి | విష్ణాలయము | 4000 |
| 1924 | 20 | పమిడిముక్కల | శివాలయము | 1500 |
| 1924 | 41 | విన్నకోట | విష్ణాలయము | 3000 |
| 1924 | 27 | వెంట్రప్రగడ | శివాలయము | 1000 |
| 1925 | 1 | ద్వారకాతిరుమల | శ్రీ వేంకటేశ్వరస్వామి | 25000 |
| 1925 | 51 | కాటూరు | విష్ణాలయము | 1000 |
| 1925 | 7 | గుడివాడ | శ్రీ గోపాలస్వామివారు | 3000 |
| 1925 | 105 | శింగరాయపాలెం | విష్ణాలయము | 4000 |

కృష్ణాజిల్లాలోని దేవాలయములకేగాక, గుంటూరు, నెల్లూరు, గోదావరి జిల్లాలవారికి సలహా లనుదినమును యిచ్చుచు, వీరినిగురించి వ్యాసములు వార్తాపత్రికలకు వ్రాయుచు, కలెక్టర్లకు పెర్మిషన్ పిటీషనులు, ప్లయింటు కాపీలు ఆన్సర్లు వ్రాసిపెట్టుచుంటిని. నేను మచిలీపట్టణము కోర్టుల జూరిసుడిక్షనులోని కేజులను స్వయముగా నడుపుచు యితర కోర్టులలో యిట్టి కేజులలో ఉచితముగా నావలెనే పని చేసిపెట్టమని ప్లీడర్లను ప్రార్థించినాను. గుంటూరులో గోవిందరాజుల శ్రీనివాసరావుగారిని, బాపట్లలో కొండా కోటయ్యగారిని, బెజవాడలో పెద్దిభొట్ల వీరయ్యగారిని, యేలూరులో వల్లూరి కోదండరామయ్యగారిని, నరసాపురములో వల్లూరి వెంకటరావుగారిని, రాజమహేంద్రవరములో వీరఘుంటల లక్ష్మీనృశింహ్వాంగారిని, కాకినాడలో లక్క రాజు సుబ్బారావుగారిని నే నేర్పరుచుకొంటిని. కేజులలో, కోర్టువారిచ్చు ఫీజులను వారే తీసికొనవచ్చుననియు, విచారణరోజులలో నేను రావలసియుంటె, వచ్చెదననియు వారికి వ్రాయుచుంటిని. గొప్ప దేవాలయుములకుతప్ప తక్కినవాని కన్నిటికిని కలెక్టర్ల సాంక్షనులు తీసికొనుచుంటిని. నా పెద్దకొమారుడు కృష్ణమోహను యమ్.యె.,బియల్. గారును, ఆయన మామగారు వేమవరపు రామదాసుగారును, చెన్నపట్టణములో ప్రాక్టీసు చేయుచుండుటచే, వారిసహాయము నాకు తరుచుగా అప్పీళ్లలో కావలసివచ్చుచుండెను. రామదాసుగారు మాటి

మాటికి గ్రామాంతరములకు కేజులమీదనే పోవుచుండుట చేత పార్టీలకు యిబ్బంది తటస్థపడుచుండుటవలన పి.ఆర్. గణపతయ్యరుగారిని మాపిల్లవానితో జత చేయవలసివచ్చెను.

1925వ సంవత్సరములో దేవాలయపుబిల్లు ప్యాసైనది. అధిక జీతములు తీసికొను కమీషనర్లకు పై సూపర్విజన్ తప్ప యెట్టియధికారమును చట్టమునుబట్టి లేకపోవుటచే, వారు దేవాలయపరిపాలనలో అసమర్థు లగుచున్నారు. ఇది సాకు చూచుకొని అర్చకులు, దేవాలయపుభూములు తమవేయనియు, లేక అవి తమ సర్వీసుమాన్యములనియు, వాదనచేసి భూములను స్వాధీనపడనీయకుండ నున్నారు. బోర్డువారు స్కీములను కాగితములమీదవ్రాసి, తమ రేర్పరచిన ట్రస్టీల కిచ్చి వారిని కోర్టులలో పెట్టుబడిపెట్టి అర్చకుల నుండి భూములను స్వాధీనపరుచుకొండని చెప్పుచున్నారు. వారి సాంక్షను యిస్తేనేగాని, నేను స్కీముదావాలు యీ యాక్టుక్రింద వేయకూడదు. ఈబోర్డువారె అందువలన పరువు నష్టమని తమరే స్కీములను ప్యాసుచేసి, ట్రస్టీలను కోర్టులో స్వాధీనము నిమిత్తము పిటీషనులు పెట్టమని చెప్పెదరు. అట్లు పిటీషనులు పెట్టగా, అర్చకులు భూములు తమవేయని నిర్ధారణ చేయుటకు డిక్లరేటరీ దావాలువేసి యింజక్షనులు చేయించుచుందురు, ఇప్పుడివి వందలకొలది రాజమండ్రి, యేలూరు, గుంటూరు జిల్లాకోర్టులలో పెండింగులో నున్నవి. ఈబోర్డు కమీషనర్లకును, వీరి తాబేదార్లకును, యెస్టాబ్లిషుమెంటు

కును, వీరందరి ప్రయాణపు ఖర్చులకును, సామ్మ్రచాలక గవర్నమెంటు వారివలన లక్షలకొలది ఋణముచేసి దానిని వాపసు చేయవలసినదని కోరుచు తమకును, తమ కమిటీలకును సులభముగా కమీషన్ రాబట్టుకొనుటకై దేవాలయఆస్తిని అమ్మించుటకు అధికార మీయవలసినదని ఒక సవరణబిల్లును శాసనసభలో తెప్పించుకొని ప్యాసుచేయించుకొన్నారు. ఈ కారణముచే నాకు దేవాలయములనుగురించి కోర్టులకు తరచుగా పోవుట తప్పినది. సత్రములకు, వనంతోటలకు, మామూలు స్కీము లేర్పాటుచేయుటకు కోర్టులకు పోకతప్పదు. ఈ యాక్టు కూలంకషముగ మార్చినగాని దేవాలయములు తప్పక దుస్థితిలోకి వచ్చును. ఇదివరకే ప్రజలలో దైవభక్తిలేక, గ్రామములు పంచమహాపాతకపట్టణములై సగుణోపాసనను నిరసించి, విద్యావిహీనులైన పూజారులచే మేనేజి చేయబడు దేవాలయములును దర్శించక, శూన్యగృహములుగ చేయుచున్నారు. అర్చకులకుకూడ నోట మన్నుగొట్టి, పలుకుబడి రహితులే దేవాలయముల యీనాములమీద వచ్చు అయివజును మ్రింగివేయుచున్నారు. దానివిషయమయే గ్రామములో పార్టీలు యేర్పడుచున్నవి. దీనికితోడు చిల్లరఆఫీసర్లు స్వల్పజీతములకు బోర్డువారిక్రింద పనిచేయుచు, చేయి జాపి, ట్రస్టీలను పీడించుచున్నారు. ఈదేవాలయములను కోర్టుక్రింద చేర్చినయెడల ట్రస్టీలు, ఆనరెరీమెంబర్లుగల కమిటీల అదుపాజ్ఞలలోనుంటూ యీ కోర్టులకు వారిచ్చియార్డర్ల మీద

అప్పీలు చేసికొనుటకు తగిన యేర్పాటులుండును. ప్రతి దేవాలయములోను దేవుని కల్యాణము మొదలగువానికి ఖర్చులు తగ్గించి, తగిన పండితుల నేర్పరచి హైందవజ్ఞానవిజ్ఞానమును యీ దేవాలయములో ప్రజలలో వెదజల్లుచుండుటకు వీలగును. ఈ దేవాలయపరిపాలనను దేశకాలానుసారముగ మార్చక, క్రమముగా అవి శిథిల మగునట్లు యీ బోర్డును, కమిటీలును చేయుచున్నారని వీరి నడతవలన సూచింపబడుచున్నది. ఈ కరువుకాలములోకూడ వీరి కింతంత జీతము లెందుకో, జీతములకు తగినపని వీ రేమిచేయగలిగిరో దైవమునకే యెరుక. తమకు కమీషన్ యెంతసులభముగా వసూలుచేయవచ్చునా, గవర్నమెంటువద్ద అప్పుచేయకుండా, తమ జీతముల నెట్లు సంపాదించుకొనెదమా యను కోరిక తప్ప వీరికి మరియొక యాలోచన యున్నట్లు కనుపడదు.

హైందవజ్ఞానవిజ్ఞానాభివృద్ధికి, యీ దేవాలయములు మిక్కిలి తోడ్పడగలవని యెంచి, ఆంధ్రదేశములోని ముఖ్యమైన దేవాలయముల బడ్జట్లను పరిశీలించి, ప్రాక్పశ్చిమవిజ్ఞానమును కొద్దిగనైనను నలవడచేసికొన్న యువకులను యేర్పాటు చేయవలెనని బోర్డువారికి యెన్నిసారులు నేను వ్రాసినను, వారు పెడచెవిని పెట్టుచున్నారు. ఇప్పుడు, నిరుపయోగమైన ఆడంబరముల కగు ఖర్చులను తగ్గించి, తగిన పండితులకు, కనీసము నెలకు రు 20 ల జీత మిచ్చి పెట్టినయెడల, వారు, ఆయా దేవాలయములలో స్థానాచార్యులుగా నుండి, అర్చకులు

సకాలములో వారి నిత్యవిధ్యుక్తకార్యములను సరిగా జరిగించు చున్నది లేనిది కనుగొనుచుందురు. ప్రాతఃకాలములయందు బాలుర కుచితముగ సంస్కృతాంధ్రములలోను, హిందీ, యింగ్లీషు భాషలలోను విద్య నేర్పెదరు. మధ్యాహ్నము గ్రామస్థులకు పురాణశ్రవణము కలిగించెదరు: సాయంత్రము, వార్తాపత్రికపఠనము చేయుచు, వారికి భౌతికవిషయికజ్ఞానము నలవడ చేయుచుందురు. దేవాదాయ ధర్మాదాయ ట్రస్టీలక్రింద గుమాస్తాలుగా నుండి, వారికి లెక్కలు వ్రాయుచుందురు. ఇప్పుడు, ఆంధ్రవిశ్వవిద్యాలయములో భాషాప్రవీణశిరోమణి డిగ్రీలను తీసికొనుచున్న విద్యార్థులనేకులు, యీ ఆర్థిక దుస్థితిలో యీ యుద్యోగములకు సిద్ధముగా నున్నారు. ఈ స్వల్పజీతమును కనీసము సాలుకు రు 1000 లు అయినను వచ్చు ప్రతి దేవాలయము భరించవచ్చును. ఇప్పటి సత్రము లన్నియు, బాలుర జ్ఞానాభివృద్ధికి యిట్లే తోడ్పడవచ్చును. ఈ బోర్డువారింతవరకును యీ విషయమును గమనించుటలేదు. వీరికి ధర్మాదాయములతో ప్రమేయము లేదు గనుక, సత్రముల కన్నిటికి నాశక్తికొలది, స్కీములను నేర్పాటుచేయుటకు పాటుపడు చున్నాను. ఇప్పుడు నేను రాజమండ్రి కోర్టులలో జరిగించు చున్న కొన్ని ముఖ్యమైన కేజుల నుదహరించుచున్నాను.

| వ్యాజ్యపు నెంబరు | సంవత్సరము | ధర్మసంస్థాపన వివరము | రిమార్కులు |
|---|---|---|---|
| O. S. 8 | 1932 | నాళం కామాక్షమ్మగారి సత్రము ఫండు రు 30,000. | ముప్పదివేలకుడిక్రిఅయినది హైకోర్టులోఅప్పీలులోనున్నది |
| O. P. 103 | 1933 | తూర్పుగోదావరిజిల్లా బోర్డువారిక్రిందనున్న పెద్దాపురం సత్రము సాలుకు యిరువదివేలు. | జిల్లాకోర్టువారు శాంక్షను యిచ్చిరి. స్కీముదావా వేయబడును. |
| O. P. 95<br>O. P. 125<br>O. P. 45 | 1933<br>1933<br>1934 | వేలూరి పూర్ణాబ్రహ్మానందముగారి వుయిలునుబట్టి వేసిన పాపరుదావాలు. రెండులక్షలరూపాయిలు. | క్రిందికోర్టు తీర్పు లాప్రకారము తప్పైననను, పాపర్లరివిజను పిటిషనులు అంగీకరించనని హైకోర్టుజడ్జీ వినుటకేనిరాకరించెను |
| O. P. 22 | 1933 | దుమ్ముగూడెం, భద్రాచలం సత్రములకు, మండభద్రయ్యగారిచ్చిన ధర్మములు. నాలుగులక్షలరూపాయిలు | దోవాకు శాంక్షను నిమిత్తము పిటిషను పెట్టగా జిల్లాకోర్టులో ఉన్నది. |
| O. P. 15 | 1933 | జాంపేట దేవాంగుల విద్యార్థి ఫండు రు 12000, | ఇది పబ్లికుట్రస్టుకాదనిజిల్లాకోర్టువారు చెప్పిన తీర్పుమీాద |

| | | | | |
|---|---|---|---|---|
| | | | | హైకోర్టులో అప్పీలు చేయబడినది. |
| O. P. | 12 | 1933 | రాజమంద్రిలో మార్కండేయస్వామివారి దేవాలయములలో నిత్యసేవల ఫండు రు 27,000. | స్కీము డిక్రి ప్యాసైనది. హైకోర్టుకు అప్పీలు చేయబడినది. |
| O. S. | 33 | 1934 | రాజమహేంద్రవరము హైరోడ్డు మీదనున్న బిల్డింగులు, భూమి రు 3000 | స్కీము డిక్రి ప్యాసైనది. |
| O. S. | 41 | 1934 | ఆర్యాపురములోని, బాలికలకును, పఠనమందిరమునకును సూరివారిచ్చిన ధర్మము రు 2000. | స్కీము డిక్రి ప్యాసైనది. |
| O. P. | 88 | | రాజమంద్రి రైల్వేస్టేషను వద్దనున్న గ్రంధి శేషయ్యగారి సత్రము. | శాంక్షను నిమిత్తము నిలవలోనే యున్నది. |
| A. S. | 1 | 1935 | రావుసాహేబు ఆదుర్తి రామారావుగారి ట్రస్టుఫండు, రు 80,000. | కాకినాడ సబుకోర్టు వారి డిక్రీ రద్దుకాబడి జిల్లాకోర్టులో డిక్రిఅయినది. |

| | | | | |
|---|---|---|---|---|
| O. P. | 93 | 1935 | ముక్తేశ్వరము సత్రము అరువదినాలుగుయకరముల యీనాంపల్లపుభూమి | శాంక్షను నిమిత్తము పెండింగులో నున్నది. |
| A. S. | 229 | 1935 | మోడేకుర్రులోని సత్రము రు 4800 | అమలాపురం సబుకోర్టులో డిక్రిమీాద అప్పీలు చేయబడియున్నది. |
| O. P. | 91 | 1934 | బత్తుల శేషమ్మగారి సత్రము. | అన్యాక్రాంతము పొందిన వారిపై దావాచేయబడవలెను. |
| O. P. | 3 | 1936 | నేతి సోమయాజులుగారి ధర్మములు. | రాజమండ్రి మునసబుకోర్టులో పెండింగులో నున్నది. |
| O. S.<br>O. S. | 147<br>306 | of 32<br>of 33 | రాజమండ్రిలోని ముసాఫరుఖానా నవాబు కోట్లు, సిమెటరీ, కవలగొయ్యి భూములు. | రాజమండ్రి మునసబుకోర్టులో క్లయము పిటీషనులు. |
| O. P. | 78 | 1934 | ఆర్యాపురము పాఠశాలకు పందిరి వారి ధర్మము రు 1000. | లెఖ్ఖలు దాఖలుచేసినారు గనుక పిటీషను రికార్డుచేసితిమని జిల్లాకోర్టువారుతీర్మానించినారు. |

# అధ్యాయము ౮

## జాతీయసంస్థల పోషణము

### 1. బందరు ఆంధ్రజాతీయకళాశాల

బంగాళా దేశ విభజనవలన కలిగిన ప్రజాందోళన సమయములో 1905 వ సంవత్సరములో కాశీ కాంగ్రెసునకును 1906 లో కలకత్తా కాంగ్రెసుకును, 1907 లో సూరతు కాంగ్రెసుకును వెళ్లియుంటిని. జాతీయపాఠశాలలను ప్రతిచోటను నెలకొల్పవలెనని కాంగ్రెసువారు తీర్మానము చేసిరి. బంగాళా దేశములోను, యిండియా యితరప్రాంతములలోను అట్టివి స్థాపించబడుచుండెను. మచిలీపట్టణములో మా కందరకును ముఖ్యస్నేహితుడును, మంచి ఆదర్శములుగల మేధావంతుడును, త్యాగమూర్తియు నగు కోపల్లె హనుమంతరావు యమ్. యే. బి. యల్. గారు తన గవర్నమెంటు ఉద్యోగమును, తరువాత తన ప్లీడరీవృత్తినికూడ వదులుకొని ఆంధ్ర జాతీయకళాశాల స్థాపనకు దేశాటనము చేయ మొదలిడిరి. ఆయనకు తోడు ఆయన ప్రాణమిత్రుడు భోగరాజు పట్టాభి శీతారామయ్య బి. యే. యం. బి. సి. యమ్. గారు ఉన్నపుడు కార్యమేల నెరవేరదు? నేను కూడ ఉడతాభక్తితో నాప్లీడరీవృత్తిలో సావకాశము చూచుకొని, ధనమునుగాని, భూమిని

గాని కొంచము కొంచము సంపాదించగలిగితిని కాని మొత్తము మీద, రాజధానిలో నుండు పెద్దమనుష్యు లందరియొద్దకు బోయి ధనము సంపాదించు భారము హనుమంతరావుగారి మీదనే పడినది. పాఠశాల పరిపాలనలో పట్టాభి శీతారామయ్యగారు మిక్కిలి పాటుపడుటయే గాక, చాణుక్యునివంటి గడుసుపిండ మగుటచే, హనుమంతరావుగారు 1922 సంవత్సరములో అకాలమృత్యువువాత బడినను యీరోజువరకు ఎన్ని కష్టపరంపరలు వచ్చినను దానిని నిర్వహించుకొని వచ్చుచున్నారు. వీ రిద్దరు నాలుగులక్షల రూపాయిల ఆస్తిని సంపాదించగలిగిరి. ప్రాతిపదికలో మేము వెయ్యేసిరూపాయిలు వేసికొంటిమి. హనుమంతరావుగారు చనిపోయిన తరువాత ఆయన స్మారకనిధికి రు 1116 లు యిచ్చితిని. మా పట్టాభి శీతారామయ్యగారు ఆనిధికి తా నొక్కడు నలువది వేలరూపాయిలు సంపాదించి స్తిరాస్తి కొన్నారు. పిచ్చి కుదిరినగాని, పెండ్లి కుదురదు. పెండ్లి కుదిరినగాని పిచ్చి కుదరదన్నట్లు కళాశాల నడపుచుండినగాని ధనము చేకూరదు; ధనమున్నగాని కళాశాల, జనుల నాకర్షించునట్లు చేయలేము. మేము మొదట వేసికొన్న సొమ్మంతయు కళాశాల స్థాపనకే సరిపోదాయెను. తరువాత దాని పాలనలో కొంత ఋణము చేసినపుడు హనుమంతరావుగారు అనీబెసెంటుదొరసానిగారినుండి పదిహేను వేల రూపాయిలు తెచ్చినారు. తిరిగి ఋణ మైనపుడు పట్టాభి శీతారామయ్యగారు మహాత్మ గాంధిగారిని, బజాజుగారిని

పట్టుకొని తిలకు ఫండునుండి యిరువదియైదు వేల రూపాయీలను తీసికొని రాగలిగెను. దీనికి కారణము ఆంధ్ర దేశములో తిలకుఫండు సంపాదనలో యితరజిల్లాలలోకంటె కృష్ణాజిల్లాయే అగ్రస్థానము వహించుట. ఆ ఫండుకు నేను రు 1600 లు యిచ్చి, నా క్లయింటైన గురజకాపరస్తుడు ఉప్పలపాటి బ్రహ్మయ్యగారివలన మరియొక రు 1500 లు వేయించితిని. ఈ కళాశాలకు హనుమంతరావుగారు 1908 సంవత్సరము మొదలు 1922 సంవత్సరము ఫిబ్రేవరివరకు రాత్రింబగళ్లు కష్టపడి, తన ప్రాణములను సమర్పించెను. ఈయన పసితనములో గొప్ప మేధావంతుడై యుండియు, ద్రవ్యార్జనను తృణీకరించి దేశ సేవకు ప్రాణముల నర్పించిన ధీరుడు. ఈయనయెడల నాకు గల భక్తిని చూపుటలో నాకు యింకను తృప్తి చాలదు.

ఎట్టి యాదర్శములతో దానిని మొదట స్థాపించితిమో వానిని మామూలు స్కూళ్లలో కూడ యిప్పుడు ఆచరణలో పెట్టబడుచుండుటచే మేము మూడు సంవత్సరములనుండి యీ మధ్య వచ్చిన పాలకవర్గముతో పోరాడి, మా యనుభవలబ్ధమైన విధానమును 1931 సం॥ ఆగష్టునుండి దీనిలో నెలకొల్ప గలిగితిమి. ఇంతటినుండి యిది జాతీయసేవకులను తయారు చేయగల విద్యాలయమై మెడకు గుదిగ్రగానున్న యింజనీరు శాఖను మచిలీపట్టణము మునిసిపాలిటీవారి పరము చేయ బడినది. ఇచ్చట, హిందీ, ఖద్దరువస్త్రములు నేయుట, వడకుట, తివాచీనేత, చిత్రలేఖనము, డ్రాయింగుతోపాటు నానాదే

చరిత్రలు, ఆర్థిక సాంఘిక రాజకీయ, సారస్వతాదివిషయములను నేర్పుటకు, నెలకు కనీసము వచ్చు నాలుగువందలరూపాయీలకు తగినట్లు ఉపాధ్యాయగణము నేర్పరచితిమి.

---

2. కవుతరములోని ప్రచారకవసతి గృహము.

కృష్ణాజిల్లా, కవుతరం గ్రామములో, వడ్లమూడి అమ్మన్న అనే ఒక వితంతు భూమిఖామందు చనిపోగానే ఆమెవారసులగు 14 పేదకుటుంబములవారు, ఆమె మూడువందలయకరము లాస్తిని రాబట్టుకొనుటకు ప్రయత్నించగా ఆ గ్రామములోని ధనవంతులు కొందరు, ఆమెయు, ఆమె తోడికోడలు మాణిక్యం శాస్త్రప్రకారము దత్తతచేసికొన్నట్లు బనాయించి వారసులకు అడ్డుతగిలిరి. వీరితరపున నేను ఉచితముగ 1911 వ సంవత్సరమునుండి నాలుగుసంవత్సరములు, హైకోర్టువరకు పోరాడి, యీ 14 కుటుంబములతో పాటు, మా బందరు ఆంధ్రజాతీయకళాశాలను 15 వ కుటుంబముగా యేర్పాటుచేసి, దానికి 20 యకరముల భూమిని సంపాదించిపెట్టితిని. ఈ 14 కుటుంబములను నిలిపినందుకు, నాయందు కృతజ్ఞతచేతను, నను కవుతరములోనే యుంచి, నేను గుడివాడ తాలూకాలోని పెద్ద దేవాలయముల కేర్పరచిన స్కీములమీద అజమాయిషీ చేయుచు, నా ఆఖరుదశను గడపవలెననే కోరికచేతను, యీవడ్లమూడివారి కుటుంబములు, గ్రామమధ్యమందు ఫాటికి సంక్ర

మించిన 80 శెంట్ల పాటి పెరడు, నాకిచ్చుటయేగాక, వీరిమీద, సదరు 300 యకరములకే గుంటూరుజిల్లా వెల్లటూరు కాపరస్తులు, ఒక దేవాలయము తరఫున దావాచేయగా, దానిలో కూడ వీరికి ఉచితముగ పనిచేసి హైకోర్టువరకు పోరి గెలిపించుటవలన, నాకిచ్చిన స్థలముమీద, నాలుగువేల రూపాయీలుపెట్టి ఒకడాబాకట్టించిరి. ఈలోగా 1922 వ సంవత్సరములోనే, పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరుగ్రామములో నేనొక యిల్లుకట్టవలసివచ్చెను. నా రెండవకుమారుడు రామమోహన్ యింగ్లీషులో బి. యె ప్యాసై సంస్కృతాంధ్రములలోనే గాక, ఉర్దూ హిందీ భాషలలోకూడ ప్రవీణతసంపాదించిన వాడైనను, అతనికి మూర్ఛగుణముండుటచేత, అతనిని యీ కొవ్వూరులోనే యుంచి, యిక్కడి ఆంధ్రగీర్వాణపీఠమున కధ్యక్షునిగా, జీవితకాలమంతయు పనిచేయుటకు యేర్పరచి నేను కవుతరము నివాసముగా చేసికొనవలెనని ఆశించితిని. కాని దైవవశము చేత, అతను సంతానము లేకుండగానే, మరణించినందున, నేను యిక్కడియింటిని, విద్యాపీఠమును కనిపెట్టుకొని యుండవలసిన వాడనైతిని. కాబట్టి నాకవుతరపు ఆస్తికి, బందరు ఆంధ్రజాతీయకళాశాల పరిపాలకవర్గమువారిని ట్రస్టీలుగా యేర్పరచి, యీాక్రిందివిధముగ ఒక సెటిల్మెంటు దస్తావేజు ఆస్తి యెనిమిది వేలరూపాయీలు చేసినను, దానపూర్వకముగా యిచ్చుట చేత, రెండువేలరూపాయీల కిమ్మతువేసి, వ్రాసియిచ్చి దానిని వారికిస్వాధీనము చేసితిని.

రు 2000-0-0 లకు సెటిలుమెంటు ఆఫ్ ట్రస్టుదస్తా వేజు. ఆ 1934 సంπరం మే 2 వ తారీఖున.

కృష్ణాజిల్లా బందరు తాలూకా మచిలీపట్టణం సబుడి॥ మచిలీపట్టణంలో స్థాపింపబడ్ని శ్రీ ఆంధ్రజాతీయకళాశాల యొక్క గవర్నింగు బాడీవార్కి.

పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు తాలూకా యర్న గూడెం సబుడి॥ కొవ్వూరుగ్రామకాపురస్తులు బ్రాహ్మణులు హైకోర్టు అడ్వకేట్లున్నూ వల్లూరి లేటు వెంకటకృష్ణయ్యగారి కుమారుడున్ను అగు సూర్యనారాయణరావు B. A. B. L. & L. T వ్రాస్ని సెటిలుమెంటు ఆఫ్ ట్రస్టుదస్తావేజు.

ఈ క్రింద నుదహరించిన షెడ్యూలు దాఖలా రు 2000 కిమ్మతుగల మెరకయినాం జిరాయితీ పాటిస్తలమున్నూ దానిలో డాబాలోగిలిన్ని కృష్ణాజిల్లా కవుతరం గ్రామకాపుర స్తులు లేటు వడ్లమూడి గోపాలకృష్ణయ్య కోనయ్యగార్ల సమీా పవారసులకు 1911 సంπరం నుండి నేనుచేస్ని సహాయముకు గాను వారివలన సంపూర్ణాధికారములతో నాకీయబడి నేటి వరకు నాస్వాధీనభుక్తములలో నున్నది. ఈ యాస్తినంతయు గ్రామపునర్నిర్మాణోద్యమములో పాటుబడు జాతీయసేవకులు (National workers in rural reconstruction movements) అప్పుడప్పుడు అవసరము కలిగినప్పుడెల్లను నివశించు టకుగాను ఒక ఆశ్రమముగా నుండునట్లు యిందుమూలముగా యేర్పాటుచేయడమైనది. ఈ పబ్లికుట్రస్టుకు మేనేజిచేయుటకు

కృష్ణాజిల్లా మచిలీపట్టణములోని శ్రీ ఆంధ్రజాతీయకళాశాల యొక్క గవర్నింగు బాడీవార్ని ట్రస్టీలుగా యేర్పరచితిని. వారు కూడ ఈ ట్రస్టును స్వీకరించుచు తీర్మానము చేసియున్నారు. ఎట్టి దేశసేవకులు యెంతెంతకాలము యెట్టిపరిస్థితులలో యేష రతులతో యీ ఆశ్రమములో నివశించవలెనో అట్టినిబంధన లన్నియు సదరు గవర్నింగుబాడీవారే యేర్పరచుకొనుచుండు టకు సంపూర్ణాధికారము ఇయ్యడమైనది. ఈ ఆస్తిని సదా కనిపెట్టుచు దీనిని గురించి నిత్యము పై అజమాయిషీచేయుచు తోటమాలి నవుకర్లు వగయిరాలను అదుపాజ్ఞలలో నుంచు టకుగాను కవుతవరం గ్రామంలో నివశించుచున్న లేటు వడ్ల మూడి గోపాలకృష్ణమ్మ కోనయ్యగార్ల వారసుకుటుంబములో యోగ్యుడును సమర్థుడును అగు ఒకమెంబరును సదరు ట్రస్టు కమిటీవారు తమకు మేనేజరుగా నుంచుకొనుచుండుట న్యాయ ము అవసరమును అని సలహా నిచ్చుచున్నాను. సదరు కళా శాల గవర్నింగుబాడీవారు యీధర్మమును ఆచంద్రార్కముగ సరిగా నడిపించుచు దానిని బాడుగలకుగాని మరియొక విధ ముగా గాని ఎట్టిఅన్యాక్రాంతము యెన్నటికిని చేయకూడదు. ఈ ఆస్తిని యింతటినుండి వారు స్వాధీనపరచుకొని సర్కారుకు యూనియన్‌కు యీయవలసిన పన్నులను చెల్లించుచూ యీ ట్రస్టుయొక్క యుద్దేశములను సక్రమముగ నెరవేర్చుచుండ వలెను.

ఆస్తి పెడ్యూలు—

(1) కృష్ణాడి॥ కవుతరం సబుడి॥ యిలాకా కవుతరం గ్రామంలో నాకు సంపూర్ణహక్కు భుక్తములుగల శేరీమెర్క-రీసర్వే నె 424—2 రు య. 0-39 లో వుత్తరం. య. 0—19 కు హద్దులు. ఉత్తరం బజారు. తూర్పు నా తాలూకు ఈనాం మెర్క. దక్షిణం వడ్లమూడి పూర్ణచంద్రుడు తాలూకు ఈ నెంబరులో భాగం. పడమర ఖాలీ గ్రామకంఠం.

(2) డిటో గ్రామంలో యీనాం మెర్క రీసర్వే నె 424—3 రు య. 0—81 లో నా తాలూకు స్థలముకు హద్దులు ఉత్తరం బజారు ; తూర్పు-బజారు ; దక్షిణం వడ్లమూడి పూర్ణచంద్రుడు తాళ్ళూరి రామచంద్రరావుగార్ల స్థలం. పడమర నా తాలూకు శేరీ 1 వ ప్రతి. ఈ హద్దులమధ్య య. 0—61 ట్లున్నూ అందులోని డాబాలోగిలిన్ని ఫలవృక్షములున్నూ.

ఇది నా సమ్మతిని వ్రాయించి యిచ్చిన సెటిలుమెంటు ఆఫ్ ట్రస్టు దస్తావేజు.

---

3. బెజవాడలోని ఆయుర్వేద వైద్యకళాశాలలు.

నావియ్యంకుడు వేమవరపు రామదాసుగారు, బెజవాడదగ్గర రాయనపాడుగ్రామములో తనకు కొంతపల్లపు భూమియుండగా దానికి సమీపమున నూరుయెకరముల మెట్ట భూమి అమ్మకమునకురాగా సగము తనకును, సగమునాకును, ఘంటసాలకమ్మవారివద్ద నాక్లయింట్లుగు తాడేపల్లివారి కుటుం

బమునొద్దవారుచేసిన ఋణమును తీర్చుపద్ధతిమీద దానిని కొంటిమి. నాభాగము సుమారు 57 యకరములకు నేను రు 4500 లు యిచ్చినాను. మొదట, సంవత్సరము ఒక్కంటికి రు 350 వచ్చినదికాని యీభూములు యితరభాగస్థుల వాటాలతో కలసి, పంపిణీకాబడనందున ఆదాయమును సరిగా రయితులిచ్చుట జరుగలేదు. అప్పుడు తక్కినభాగస్థులు, మేమును, యెవరిభూములు వారు విడగొట్టుకొంటిమి. నేను ప్లీడరీవృత్తిని మానివేసి బందరునుండి సంసారములేవనెత్తుకొని ముందు తెలియజేయబోవు కారణములవలన కోపూరుకు వచ్చినతరువాత యీభూమిని శాశ్వతముగా ప్రజోపయోగకరమున కుపయోగించవలెనని యెంచి అప్పటికి బెజవాడలో రామమోహన్ ఆయుర్వేదధర్మవైద్యశాలయు, కళాశాలయు, ఒకరిజస్టరుకమిటీవారి పరిపాలనలో నుండుటచే దానిపోషణకు యిచ్చివేయదలచితిని. బెజవాడ, ఆంధ్రదేశమునకు వచ్చు అనేక రైళ్లకు కూడలిస్థానమై మధ్యగానుండుటచేతను, బీదలు అనేక దేశములనుండి కృష్ణాస్నానమునకు వచ్చి దుర్గామల్లిఖార్జునుల దర్శనమునకు వచ్చుచుండుటచేతను, వైద్యసౌకర్యములు వారికుచితముగా కలుగజేయుట ముఖ్యావసరము. ఇదిగాక, నాకు బెజవాడమీద ప్రీతిమెండు. నామీద మీర్జాపురముజమీందారు క్రిమినల్‌చర్యలను తీసికొన్నపుడు నాస్వస్థలమగు బందరులోకంటె వేయిమడుంగులు నాయెడల అక్కడస్నేహితులు యెక్కువసానుభూతిని కనుపరచిరి. దానిని నేనెప్పుడును మరు

వను. నాజీవితకాలములో నాకు గొప్పరోగములు—రక్తవిరే చనములు, తలనొప్పి, శూలనొప్పి—యీమూడు మాత్రమే వచ్చినవి. ఈమూటినికూడ ఆంగ్లేయఘనవైద్యులు కుదర్చ లేనపుడు, ఆయుర్వేదవైద్యమువలననే నివారింపబడినవిగాన, నేను యీ రాయనపాడు, జక్కంపూడి గ్రామములలో బెజ వాడ కతిసమీపముగ ఒక్కచోటనే యున్నందున దాని నంతయు ది 8—8—1925 తారీఖున రిజిష్టర్డు ట్రస్టుదస్తావేజు ద్వారా శ్రీరామమోహన్ ఆయుర్వేదధర్మవైద్యకళాశాల సంఘమువారి పరముచేసితిని. దీనిమీద సాలుకు కనీసము రు 500 లు వచ్చుచున్నది. ఇకముందు యింకను యెక్కువ రాగలదు. సదరుదస్తావేజును ఈక్రింద పొందుపరచుచున్నాను.

(1) రు 5000—0—0 అయిదువేలరూపాయల కిమ్మతుగల స్థిరాస్థికి డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టుదస్తావేజు.

(2) 1925 సం॥రం 8 దవ ఆగస్టుతారీఖున,

(3) వ్రాసియిచ్చినది—పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు కాపురస్థులు, బ్రాహ్మణులు, హైకోర్టువకీలు, వల్లూరి వెంకటకృష్ణయ్యపంతులుగారి కుమార్డు సూర్యనారాయణరావు.

(4) వ్రాయించుకున్నది. సొసైటీసు రిజిష్ట్రేషన్ ఆక్టు XXI of 1860 ప్రకారము రిజిష్టరీకాబడి బెజవాడ సబుడిస్ట్రిక్టు యిలాకా బెజవాడ గ్రామంలో స్థాపించబడిన శ్రీరామమోహనాయుర్వేదధర్మవైద్యశాల సంఘముయొక్క అధ్యక్షుడుగారు.

(5) దస్తావేజువివరం—బెజవాడ బకింగుహాంపేటలో స్త్రాసైటీసు ఆక్టుప్రకారం నెం 5 .రు ఆఫ్. 1920-1921. Dated 12—10—1920. గా రిజష్టరుకాబడిన శ్రీరామ మోహన ఆయుర్వేదధర్మవైద్యశాలసంఘమునకును, దరిమిలా ఈ సంఘమువారు స్థాపించిన ఆయుర్వేదకళాశాలకును యీ క్రింద ఉదహరించిన షెడ్యూలుదాఖలా నాస్వార్జితమగు భూములను యిందుమూలముగా డెడికేటుచేయడమయినది. యీ భూములమీద వచ్చు నికరాదాయమంతయు కొద్దిగానుండినను, గొప్పగానుండినను, పై రెండుసంస్థాపనములకు సమానముగాను శాశ్వితముగాను ఖర్చుపెట్టుచుండవలెనుగాని సదరు ఆస్తిని ఎన్నటికిని ఎట్టిసందర్భములలోకూడా ఏ విషయమైన అన్యాక్రాంతము చేయకూడదు. అయిదు సంవత్సరములకంటె ఎక్కువకాలమునకు కౌళ్లకియ్యకూడదు. ఈ పైధర్మముల పరిపాలకవర్గమువారిలో ఎట్టిమార్పులు జరుగుచున్నను యీ ధర్మసంస్థాపనములు జరుగుచున్నంతకాలము షెడ్యూలు దాఖలాఆస్థి సదరు సంస్థాపనములకు జరుగుచుండవలెను. యీ సంస్థాపనములలో ఆయుర్వేదకళాశాల ఎప్పుడైనను కాలకర్మవశముచేత నశించినయెడల యిందునిమిత్తం వ్రయపరచవలసిన సగము ఆదాయమును మరియొక ఆయుర్వేద కళాశాలయందు విద్యనభ్యసించు విద్యార్థులకు వేతనముల (Stipends) నిమిత్తం వినియోగపరుచుచుండవలెను.

స్థిరాస్థి షెడ్యూలు. బెజవాడ సబుడిస్ట్రిక్టు యిలాకా రాయనపాడు గ్రామములో.

| | | | |
|---|---|---|---|
| (1) | డి. నెం 261 రు య. 31-94 శెంట్లలో | | య. శెం. |
| | తూర్పువైపు శేరీమెరక | | 2—45 |
| (2) | డిటో నెంబరులో దక్షిణపువైపు శేరీమెరక | | 7—70 |
| (3) | డి. నెం 262 A రు య. 11-18 శెంట్ల లో ఉత్తరపువైపు శేరీమెరక | | 8—70 |
| (4) | డి. నెం 247 రు లోని య. 14-77 శెంట్లలో పడమరఖండం శేరీమెరక | | 7—0 |
| | వెరసి | | 25—85 |

డిటో సబుడిస్ట్రిక్టు యిలాకా జక్కంపూడి గ్రామములో డి. నెం 107/1 రులో య. 28-2 శెంట్లు శేరీమెరక జుమలా రాయనపాడు జక్కంపూడి గ్రామములలో య. 53-87 శెంట్ల శేరీమెరకభూమి పైన వచ్చుఅయివజును మాత్రము పైన చెప్పిన ధర్మములకు ఆచంద్రార్కముగా వినియోగపడవలెను. ఈ ఆస్థిని యిదివరకే సదరు సంఘమునకు స్వాధీనపరచడమైనది గనుక సదరు సంఘమువారు సదరుభూములను అమరకపరచు కోవలెను. యింతటనుండి సదరు సంఘము పేరు సర్కారులెఖ లలో చేర్పించుకుని సదరు భూములమీద సర్కారువారికి సాలియానా చెల్లించవలసిన అమాం బాపతు పన్నులను

యిచ్చుకొనుచూ సరిగా మేనేజి చేసుకుని ధర్మమును శాస్త్రో క్తముగా జరుపవలసినది. యిది నా మనస్ఫూర్తిగా వ్రాయించి యిచ్చిన డిక్లరేషన్ ఆఫ్‌ట్రస్టు దస్తావేజు.

దీనికి నేనింత సహాయము చేసినను స్వార్థముతో దీని కమిటీవారు నాకిష్టములేని రాజీచేసికొన్న విషయము, దీని తరువాతి అధ్యాయములో తెలిపెదను—

4 పెదమద్దాలి గ్రామ దేవాలయములు

నాకు గన్నవరం తాలూకా పెదమద్దాలి గ్రామములో పూర్వార్జితము బాపతు య. 1-75 శెంట్లు మెట్ట సర్వదుంబాలాయినామును సుమారు 350 గజముల నివేశనస్థలమును కలదు. ఈభూమిమీద సాలుకు రు 15 ల కంటె నికరాదాయము నా కెన్నడునురాలేదు. ఇది పల్లపు హెడ్డు క్రింద త్వరలో రాగలదని గ్రామస్థులు చెప్పుటచే, 1925 వ సంవత్సరములో దీనిని ఆ గ్రామశివాలయ విష్ణాలయములకు సమానముగా చెందునట్లు రిజస్టర్డుట్రస్టు దస్తావేజువ్రాసి మా వల్లూరి వారినే ట్రస్టీలుగా యేర్పరచితిని. నా నివేశనస్థలముకూడా సదరు దానపట్టాలోచేర్చి స్వాముల ఉపయోగము నిమిత్తము పుష్పవనము, తులశివనము, మారేడుచెట్లు మొదలగునవి పెంచి మావంశీకుల పేరుమీద నిత్యపూజ చేయుచుండులాగున యేర్పరచితిని. సదరు దస్తావేజును యీక్రింద పొందుపరచుచున్నాను.

రు 1000-0-0 పదివందల రూపాయిల కిమ్మతుగల స్థిరాస్తి శెటిలుమెంటు దస్తావేజు. ఆన 1925 సం॥ ది 23 సెప్టెంబరు తారీఖున కృష్ణాడిస్ట్రిక్టు పామర్రు సబ్ రిజిస్ట్రారు యిలాకా పెదమద్దాలి గ్రామములో వేంచేసియున్న శ్రీమల్లేశ్వరస్వామి శ్రీఉద్దండ్రరాయస్వామి వార్లకు తూర్పు గోదావరిజిల్లా యర్నగూడెం తాలూకా కొవ్వూరు కాపురస్థులు బ్రాహ్మణులు హైకోర్టు వకీలు 60 సంవత్సరములు వయస్సుగల వల్లూరు వెంకటకృష్ణయ్యగారి కుమారుడు సూర్యనారాయణరావు వ్రాయించి యిచ్చిన శెటిలుమెంటు దస్తావేజు—

కృష్ణాడిస్ట్రిక్టు పామర్రు సబురిజస్ట్రారుయిలాకా పెదమద్దాలిగ్రామంలో వేంచేసియున్న శ్రీ మల్లేశ్వరస్వామి, శ్రీ ఉద్దండ్రరాయస్వామివార్ల దేవాలయములలో నా పేరను నా కుటుంబమువారి పేరను శాశ్వతముగా సంవత్సరమునకు ఒకసారిఅయిననూ సేవ జరిగించుటకు నా పితురార్జితమగు యీ క్రింద వుదహరించిన షెడ్యూలు దాఖలాఆస్తిని నేను యిందుమూలముగా శ్రీస్వామివార్లకు సమర్పించుకొన్నాను. యీ ఆస్తిమీద ప్రతిసంవత్సరమువచ్చు అయివేజును సదరు యిద్దరు స్వామివార్ల సేవలకు చెరిసఖముగా యిచ్చుటకున్నూ సదరు ఆస్థిని సరిగా మేనేజిచేయుటకున్ను పెదమద్దాలిగ్రామ కాపురస్థులున్ను, బల్లిపర్రు గ్రామకరణంగారున్ను అయిన్న వల్లూరు కామేశ్వర్రావుగారిని ప్రథమ ట్రస్టీగా మూడు సంవత్సరములవరకు నియమించడమయినది. యీ గడువు

కాలము ముగిసినతర్వాతగాని లేక యీ లోపలనే యే కారణమువల్లనయిననూ ట్రస్టీపదవి కాళీఅయినప్పుడుగాని యీ పెదమద్దాలి గ్రామంలో కాపురముచేయుచున్న మా వల్లూరి వారి కుటుంబములలో చేరి ఆ యింటిపేరుగల అవిభక్త కుటుంబములలోని వారుగాని విభక్తకుటుంబములలోనివారుగాని మేజర్లుఅయ్ని పురుషులు అందరుకలసి వారిలో మెజార్టీ వారి తీరుమానం ప్రకారం మూడేసి సంవత్సరముల కొకసారి ఒక్క ట్రస్టీనిమాత్రమే అప్పాయంటు చేసుకొని ఆయనచేత యీ ట్రస్టుఆస్తిని మేనేజిమెంటు చేయించుచు ఆయనవలన లెక్కలు పుచ్చుకొనుచుండవలెను.

యీ ఆస్తిమీద యెంత కొద్దిఅయివేజు వచ్చిననూ దీనిని యెన్నటికిని విక్రయించకూడదు. తాకట్టు పెట్టకూడదు. అయిదుసంవత్సరములకంటె యెక్కువకాలమునకు కవుళ్ళను యివ్వకూడదు. యీ ఆస్తియంతయు పైన పేర్కొనబడిన మొదట ట్రస్టీగారు స్వాధీనపరచుకొని అమలు జరుపుచుండవలెను.—యీ క్రింద వుదహరించిన షెడ్యూలులోని నివేశన స్థలములలో వుభయస్వాములకు పుష్పములు, మారేడుదళములు, తులసిదళములు మొదలగునవి కావలెనుగనుక యీ స్థలముకుచుట్టూ ప్రహారీగోడలు పెట్టించి పుష్పవనం తోట వేయించవలెను. వీలున్న యెడల కొంతభాగములో సత్రము కట్టించవలెను. దేవుళ్లు వేంచేయుటకున్ను బాటసారులు దిగుటకున్ను యీసత్రము ఉపయోగపడుచుండవలెను. యీ

ధర్మము ఆచంద్రార్కముగ జరుగుచుండవలెను. యిది నా మనస్ఫూర్తిగా వ్రాయించిన శెటిలుమెంటుదస్తావేజు—

షెడ్యూలు.

(1) కృష్ణాడిస్ట్రిక్టు పామర్రుసబురిజిష్ట్రారు యిలాకా పెదమద్దాలిగ్రామంలో తూర్పున మద్దాలి శేషమ్మ వుద్దండ్రాయుడుగార్ల యినాంభూమి, దక్షిణం వల్లూరి రామారావుగారి యీనాంభూమి, పడమర చల్లా పున్నమ్మ వల్లూరి లక్ష్మీపతివగయిరాలభూమి, వుత్తరం లోకల్ ఫండు రోడ్డు యీహద్దులమధ్యస్తమైన రీసర్వే నెం 167 రు య. 3-70 శెంట్లలో నాపెదతండ్రి మనుమల సగభాగం వుత్తరమున గాక నాసగభాగం దక్షిణవైపు య. 1-85 ఒక యకరం యనభయిఅయిదు శెంట్ల సర్వాదుంబాల మెరక యీనాం భూమిన్ని—

(2) సదరు పెదమద్దాలిగ్రామంలో కాళీస్థలముకు హద్దులు—

తూర్పు నూతక్కి బసవయ్యగారిస్థలం, దక్షిణం రాజవీధి, పడమర దాసరి అప్పయ్య నూతక్కి తాతయ్యావగైరాల స్థలం, వుత్తరం రాజవీధి యీహద్దులమధ్యస్తమైన పాటి నివేశనస్థలములో నాపెదతండ్రి మనుమల పడమర సగభాగం గాక మిగతా నాసగంవంతు తూర్పుభాగం షుమారు 350 మూడువందల యాభై చతురపుగజముల నివేశనస్థలమున్ను—

5. పెదపట్టణము దేవాలయము

ఇక్కడ నేను చేసినది ఒకచిన్న ధర్మమును గురించి చెప్పదలచితిని. నాచిన్నతనములో మానాన్నగారు కడలి నుండి వచ్చుచుండగా నగరమను గ్రామసమీపములో భూము లను వేలము వేయబడుచుండెను 15 శెంట్ల విస్తీర్ణముగల ఒక చిన్న యీనాం పొలమును ఆయన ఒకరూపాయికి కొట్టివేయిం చుకొన్నారు. నేను బందరులో నుండగాను కొవ్వూరు వచ్చిన తరువాత కూడాను దానిమీద సాలుకు మూడురూపాయిలు ఆదాయము వచ్చేదటగాని, అక్కడనే యేదియో నొకవిధ ముగ ఖర్చుపడు చుండెనట! ఈభూమి నూరురూపాయీలు మాత్రము చేయును గనుక దానిని విక్రయ పరచమని ఆగ్రామస్థు లడుగగా అట్లుఅమ్మి వేయుటకంటె దానిమీద వచ్చు నాలుగయిదు రూపాయీలు, అక్కడనే ఒకచిన్న ధర్మము నకు శాశ్వతముగా జరుప గలుగ వచ్చునని యెంచి నాచిన్న తనములోని యనుభవమును బట్టి యీక్రింది రిజిస్టరు దస్తా వేజు వ్రాసియిచ్చితిని. ఈస్వల్ప విషయమును గురించి వ్రాసిన దస్తావేజు బీదలు కూడ తమ చేతనయినంత వరకు తమ స్వల్ప ధర్మమును యెట్లు శాశ్వతముగా జరిగించుకొను నేర్పాట్లు చేయవచ్చునో సూచించుటకు మాత్రమే యిచ్చట దానిని ముద్రించితిని.

ది 8-11-1932 పందొమ్మిదివందల ముప్పదిరెండు సంవత్సరం తారీఖు యెనిమిది నవంబరు నెల తేదీని పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు తాలూకా కొవ్వూరుగ్రామ కాపరస్తులు బ్రాహ్మణులు యినాందార్లు హైకోర్టు అడ్వకేటున్నూ లేటు వల్లూరి వెంకటకృష్ణయ్యగారి కుమార్డున్నూ అయిన సూర్యనారాయణరావు రాజవోలు తాలూకా పెదపట్నం కాపురస్తులు జయంతి రామయ్యగారి కుమారుడు కొండయ్యగార్కి వ్రాసిన సెటిల్‌మెంటు దస్తావేజు.

తూర్పుగోదావరిజిల్లా రాజోలుతాలూకా రాజోలు సబురిజస్ట్రారులో చేరిన నగరం గ్రామంలో నా పూర్వార్జితం బాపతు నాకు సంపూర్ణహక్కు భుక్తములుగల యినాం పల్లం రివిజన్ సర్వే నెం $1\frac{1}{2}$ రు పూరా య॥15 పదిహేను సెంట్లు భూమిని సదరు రాజోలుతాలూకా పెదపట్నం గ్రామంలో వేంచేసివున్న శ్రీ వేణుగోపాలస్వామివారి కోవెలలో ప్రతి శుక్రవారం సాయంకాలపు వేళ ఆగ్రామంలోని బడిలో చదువుకొను విద్యార్థులకు ప్రసాదము యీయగలందులకు సదరు భూమిమీద వచ్చు ఫలసాయంలో సర్కారుపన్నులు పోగా మిగతా అయివజును వినియోగించుటకు సదరు పెదపట్నం గ్రామ కాపురస్తులు జయంతి రామయ్యగారి కుమార్డు కొండయ్యగారిని ట్రస్టీగా ఏర్పర్చుడమైనది. ఏకార్ణంచేతనయిననూ యీట్రస్టీపదవి కాళీ అయినయెడల నేను నాకుమాళ్లు లేక మనుమలు మొదలగు నా సంతతివారు నూతన ట్రస్టీని ఏర్పర్చి

సదరు ధర్మమును ఆ చంద్రార్కముగా జర్గించునట్లు ఏర్పాటు చేయడమైనది. యిది నాసమ్మతిని వ్రాయించియిచ్చిన సెటిల్ మెంటు ట్రస్టు దస్తావేజు. 1 స్టాంపు 6 పంక్తిలో హంసపాదు సదరు భూమి కిమ్మతు నూరురూపాయీలు—

6. కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యా పీఠము.

నే నిప్పుడు స్థిరనివాసముగ నేర్పరుచుకొన్న యీ కొవ్వూరులోని యాంధ్రగీర్వాణవిద్యాపీఠమను ఒకసంస్థాపనను నిర్మించి, తనరెక్కలమీాదనే, దానికి యేబదివేలరూపాయీల ఆస్తిని సంపాదించిన ధీరుడు, స్వార్థత్యాగి, కవి, గ్రంథకర్త, తల్లాప్రగడ సూర్యనారాయణరావు, 1911 వ సంవత్సరమునుండి నేను బందరు ఆంధ్రజాతీయకళాశాలకై సొమ్ము సంపాదించుటకు పోయిన నందిగామ, గంపలగూడెము మొదలగుచోటుల నెల్లను, యాచకహోదాతో నాకు కనుపడుచునే యుండెను. ఈయన, బాగుగా సంపాదించుకొనుచు కూడ తన ప్లీడరీవృత్తిని, యీ సంస్థాపనకొరకు మానుకొని తనశరీరారోగ్యమునుకూడ చెడగొట్టుకొని, యూరూరతిరిగి అయిదు పదిరూపాయీల చొప్పున స్వల్పమొత్తములు ప్రోగుచేసి, తానుకూడ సుమారు అయిదు వేల రూపాయీలు స్వంత ద్రవ్యము ఖర్చుపెట్టి యీ గోదావరితీరమున యీ గొప్పదక్షేత్రమునందు యీ విద్యాలయమును దీనిలో శివాలయ విష్ణాలయములను యేర్పాటుచేసి ది 6—3—1926 తారీఖున

స్వర్గస్థులైరి. ఈయన ప్రోద్బలమువలననే నా మిగతస్వల్ప జీవితకాలమును యీ విద్యాపీఠమునొద్ద గడపుటకు నిశ్చయించుకొని, రాజమహేంద్రవరములో బదులు యిక్కడనే ఒక బంగాళాకట్టుకొని నివసించుచున్నాను. ఆయన కార్యవిధానములో కొన్నిలోపములున్నవని కనుగొని ఆయనకు స్వతస్సిద్ధమగు నిరంకుశత్వమును, ఆగ్రహమును చంపుకొనునట్లు కొంత వరకు చేయగలిగితిని. నూతన నిబంధనలతో ఒక పాలకవర్గ కమిటీని ది 4—3—1926 వ తారీఖున ఆయనతో సంప్రదించియే రిజస్టరు చేయించితిని. కాని తరువాత రెండు రోజులకే నేను బందరువెళ్లి యుండగా ది 6—3—1926 వ తారీఖున మా యందరి దురదృష్టవశమున ఆయన పరమపదించిరి. నా కుడిరెక్క పడిపోయినది. ఆయన సంపాదించి తెస్తే నేను పెద్దవాడనుగనుక యిక్కడనేయుండి, సంస్థాపనను మేనేజి చేయవచ్చు ననుకొంటిని. ఇప్పుడు భారమంతయు నాపైననే పడినది. తక్కిన కమిటీమెంబర్లు కెంతమాత్రము పట్టలేదు. ఒక సంవత్సరమైనను ఆయనజీవించి పనిచేసినయెడల యీ విద్యాపీఠమునకు చేసినఋణములు తీరిపోయి కొంతశాశ్వతనిధిని ప్రోగుచేసి యుండెడువాడు. కాని దేశమున కది ప్రాప్తించలేదు. ఆయన మాటకారి. మతము నాధారముచేసికొని, తన పాండిత్యమును వినియోగించి ధనవంతుల యిళ్లదగ్గర ధరణాగా కూర్చుని ద్రవ్యమును సమకూర్చగల శక్తివంతుడు. ఆశక్తులు నాకు గాని మా కమిటీలో యే మెంబరుకుగాని

లేవు. ఆయన యుత్కృష్టాదర్శములను ఆ చరణలో పెట్టుటకు అట్టి ధీమంతుడును స్వార్థత్యాగి బయలుదేరిననే తప్ప యీ యుద్యమము సరిగా నెరవేరునట్లు కనుపడలేదు. ముందుగా కొంతభూమిని అమ్మివేసి ఋణములను తీర్చివేసితిమి. ఉన్న అయివజుతో ఒకడజను విద్యార్థులకు భోజనముపెట్టి, నలుగురు పండితుల నేర్పాటుచేసి ఆంధ్రవిశ్వవిద్యాలయములోని ఉభయభాషాప్రవీణ, విద్యాప్రవీణపరీక్షలకు విద్యార్థులను తయారుచేసి పంపగలుగుచుంటిమి. సాలుకు ఖర్చు రు 3500లు అగుచుండగా వచ్చేరాబడి రు 2500 లు మాత్రమే యగుటచే సాలుకు వేయిరూపాయల లోటును తీర్చుటకు 1936 వ సంవత్సరము మార్చినెలలో ఒక పతకము నేర్పాటుచేయగలిగితిని.

రాజమహేంద్రవరములో వాడ్రేవు జోగాయమ్మ జమీందారిణీగారు, యిరువదివేలరూపాయీలు వేదమువగైరా చదువుకొను బీదబ్రాహ్మణవిద్యార్థుల భృతులకు ఉయిలువ్రాసి చనిపోయిరి. ఈ ట్రస్టుఫండుకు, ఆమె చెల్లెల పెనిమిటి యైన చోరగుడి వేంకటకృష్ణారావు బి. యే. బి.యల్. గారిని, ఆమె గుమస్తాగారగు మానాప్రగడ నారాయణమూర్తిగారిని, ఆమె మైనరు దత్తకుమారుని (మేజరైనతరువాత) ట్రస్టీలుగా నుండునట్లు యేర్పాటుచేసినారు. వీరందరు నాకు బంధువులు, స్నేహితులగుటవలన వీరికి నచ్చజెప్పి యీవిద్యాపీఠముతో ననుబంధముగా నున్న యీంకళాశాలకంటె మరియొక సంస్థాపనసమీపములో లేదనియు, దీనిని వాడ్రేవు

జోగాయమ్మగారి వేదకళాశాలయని పేరుపెట్టవలెననియు, ఆ ఫండును వారే మేనేజిచేయుచు, యీకళాశాల కమిటీలోనే మెంబర్లుగానుండి, ఆ ఫండుమీాద వచ్చువడ్డీనిమాత్రము యిచ్చుట వేదము చదువుకొనుచు ఓరియంటల్ డిగ్రీలకుపోవు బ్రాహ్మణవిద్యార్థుల విద్యాపోషణకు ఖర్చుచేయవలయుననియు రిజస్టర్డు అగ్రిమెంటును ది 5-4-1931 తారీఖున వారున్ను, అందరున్ను విడిచివెళ్లగా నిలచియున్న కమిటీమెంబరునైన నేనున్ను వ్రాసికొంటిమి. ఆర్థికదుస్థితులను బట్టి తమకిచ్చు మామూలు జీతములోనుండి తాము నెలకు రు 25 లు మాత్రము తీసికొని తక్కినది కళాశాలకిచ్చెదమని, పండితులందరు వాగ్దానము చేయుటచేత, కళాశాలను నడిపితిమి.

కాని, లేటు తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారి యొక్కయు, నా యొక్కయు ఆదర్శము వేరు. ఈ యుభయ భాషాప్రవీణ విద్యాప్రవీణుల మిడిమిడిజ్ఞానము వారి జీవనోపాధికి కొంత ఉపచరించవచ్చునుగాని దేశమున కెట్టిలాభము కలిగించదని మా దృఢాభిప్రాయము. విశ్వవిద్యాలయముతోగాని విదేశప్రభుత్వముతోగాని యెట్టిసంబంధము లేకుండ మన హైందవ జ్ఞానవిజ్ఞానములను పెంపొందించుటకు ఆయాశాస్త్రములు చదివిన గొప్పపండితులనురావించి ఆధునికజ్ఞానమును కూడ పూర్వులజ్ఞానముతో సంపుటీకరణముచేయుచు సమస్త శాస్త్రములు సాధ్యమైనంతవరకు ఆంధ్రములో సామాన్యప్రజాప్రబోధనకు యితరభాషలనుండి అనువదించవలెననియు పూర్వ

సంస్కృతపండితుల కూలంకషజ్ఞానము అంతరించకుండ వారి సహాయముతో ప్రతిశాస్త్రమును ఆంధ్రభాషలో సులభశైలిని వ్రాయించుటయే గాక ఆ పునాదులమీద యాధునిక జ్ఞానము నంతయు దేశీయపరిభాషాపదములతోనే భాషాంతరము చేయించుటయు మా యుభయుల ముఖ్యోద్దేశ్యము. ప్రపంచములో మన హైందవజాతీయ ప్రత్యేకతను వెల్లడించ వలెనన్న మన పూర్వుల జ్ఞానవిజ్ఞానములను మనము ముందుగా తెలిసికొని వానిలోని లోపములను సవరించుటయు వాని నభివృద్ధిచేయుటయు మనముఖ్యవిధి. ఇది చేయకున్నచో మనము నేలవిడిచి సాముచేయుటకు ప్రయత్నించుటయే—

"నీ వారీ మరచేవ్రా నీ మాట మరచేవ్రా
నీకేమిా లాభమే చిలుకా
ఏవారు మెచ్చినా, యెంగిలీగింజలే
యేమిానీకిత్తూరే చిలూకా."

అనునట్లు మనపూర్వులు సంపాదించిపెట్టిన దేదియో అదియెంతయో తెలియక మనము పాశ్చాత్యులవిజ్ఞానమునే గ్రహించుచుండి నంతవరకు మన జాతీయతాభివృద్ధి భాషాభివృద్ధి విమర్శనాకౌశలము మొదలగునవి కలుగవు. పాశ్చాత్యభాషలగుండా సంపాదించినవిజ్ఞానము మన రక్తనాళములలో కలియక మనము వానిని జీర్ణించుకొనలేక ఉభయభ్రష్టుల మగుదుము. లోకములో ననుదినము నభివృద్ధి పొందుచున్న భౌతికవిషయికజ్ఞానము నంతయు మన దేశభాషలలోకి తెచ్చు

కొన్నప్పుడే అది మనస్వాంతయాస్తియగును. దానిని బాలుర పఠనీయగ్రంథములు ఉద్గ్రంథములగుండా ప్రజలలో వెదజల్ల వచ్చును. వేదాంతము మానసికశాస్త్రము మొదలగునవి కూడా అన్యదేశీయుల వానితోపోల్చి గ్రంథములను వ్రాయ వచ్చును. దీనికంతకును సంస్కృతాంధ్రభాషాజ్ఞానమును పూర్వ శాస్త్రజ్ఞానమునుకూడ మిక్కిలి యవసరము. మామూలు దిన చర్యలలోనే వీని యుపయోగము వెల్లడియగును. ఖగోళశాస్త్ర జ్యోతిషశాస్త్రముల పరస్పర సంబంధము, పూర్వ ప్రస్తుత కర్మకాండల వ్యత్యాసము, పూర్వమీమాంస ఉత్తరమీ మాంసల తారతమ్యము, సగుణనిర్గుణోపాసనల యుచితాను చితములు సమస్తదేశీయాచారములు మతముల పరిణామము, యీ మొదలగు ననేక ముఖ్య విషయములు తెలిసికొనుట మిక్కిలి యవసరము. పూర్వాచారపరాయణులకును, నవనా గరికులకును, కర్మకాండ నంతయు తేట తెలుగున చెప్పుట యెంతలాభమో నేను వేరుగవక్కాణింప నక్కరలేదు. సంఘ సంస్కరణకు యీకర్మకాండవిమర్శన మంతముఖ్యము కాబట్టి యీ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారి విద్యాపీఠము పేరు ఆంధ్రదేశములో చిరస్థాయియగునట్లు చేయవలెనన్న యెడల, ఉద్దండపండితులను, తగిన జీతముల నిచ్చి రప్పించవల యును. అప్పుడు విద్యార్థులు, ఆంధ్రజిల్లాలనుండి వచ్చి, యీ పరిశోధనాలయములో చేరుట కిచ్ఛగింతురు. సంస్కృతమును చదువుకొనుచు ఆంధ్రభాషను రెండవభాషగా నభ్యసించిన

మన విశ్వవిద్యాలయపు గ్రాడ్యుయేట్లు కొంతకాల మిక్కడ నుండి ఒక్కొక్క శాస్త్రమును కూలంకషముగ పఠించి పాశ్చాత్యవిజ్ఞానముతో పోల్చి యుద్గ్రంథములను వ్రాయవచ్చును. పూర్వపద్ధతులమీద చదువుకొన్న పూర్వపండితుల సహాయముతోడనే, యేశాస్త్రజ్ఞానముగాని అభివృద్ధి నొందనేరదు. ఈవిద్యాపీఠమున కనుబంధమైన యీ సంస్కృతకళాశాలలో చదువుకొను విద్యార్థులకు, పాశ్చాత్యవిమర్శనజ్ఞానముకూడ తోడైనగాని, మనోవికాస మభివృద్ధినొంది, విశాలదృష్టి కలుగదు. కాబట్టి మాకు సాలుకువచ్చు రెండువేల రూపాయీల ఆదాయమునుబట్టి బీదబాలురకు సంస్కృతాంధ్ర హిందీ ఆంగ్లేయభాషలతో శ్రౌతము ఆయుర్వేదము అను వృత్తి విద్యలనుకూడ నేర్పుటకు యేర్పాటు చేసితిమి.

యువజనవిద్యకు మాత్రము నేనే మొదట మార్గదర్శకుడుగా నుండవలెనని, ధనవంతుడను కాకపోయినను, లేటు తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారి పేరున యీ విద్యాపీఠము ఆచంద్రతారార్కముగ నుండవలెనని ఉడుతాభక్తితో ప్రస్తుతము నాకు సాలుకు రు 480 లు నికరాదాయము వచ్చుచున్న ఆలమూరు కోఆపరేటివు మార్గేజబ్యాంకులోనున్న రు 12000 ల డిబెంచర్లను యీ క్రింది డిక్లరేషన్ ఆఫు ట్రస్టు దస్తావేజు ద్వారా రిజష్టర్డు సంఘమువారికి సమర్పించుకొంటిని.

# రు 12000 లకు డిక్లరేషన్ ఆఫు ట్రస్టుదస్తావేజు.

ఆ 1931 సం॥ యేప్రియల్ 9 వ తారీఖున, పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు రిజస్ట్రేషన్ సబుడిస్ట్రిక్టు, కొవ్వూరు గ్రామకాపరస్తులు బ్రాహ్మణులు, హైకోర్టుఅడ్వకేటున్ను లేటు వల్లూరి వెంకటకృష్ణయ్యగారి కొమారుడున్ను నగు వల్లూరి సూర్యనారాయణరావు వ్రాసిన డిక్లరేషన్ ఆఫు ట్రస్టుదస్తావేజు.

1. నా చిరకాలపు స్నేహితుడును, నిర్మలస్వార్థత్యాగముతో చిన్నతనములోనే తన న్యాయవాదవృత్తిని వదలుకొని, సుమారు 15 సంవత్సరములు కష్టించి తనధనమును, ఆరోగ్యమును తుదకు తన ప్రాణములనుకూడ

Deed of Declaration of Trust executed by Valluri Suryanarayana Rao B. A., B.L., L.T., High Court Advocate, son of Venkatakrishnaiah garu, Brahmin, residing at Kovvur, West Godavari District.

1. Late Tallapragada Suryanarayana Rao garu an old friend of mine, gave up his lucrative practice at the Bar, while still young and with a rare sacrifice of his wealth, health and at last his life itself worked incessantly

నర్పించి, కొవ్వూరుగ్రామములో యేబదివేల రూపాయీల స్థిరాస్తితో "ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమను" నొక సంస్థాపనను నిర్మించిన వాడగు లేటు తల్లాప్రగడ సూర్యనారాయణ రావు గారు ది 6—3—26 తారీఖున శివసాన్నిధ్యమును చేరినారు. ఆయననామము ఆ చంద్రార్కముగ నుండునట్లు తోడ్పడుట నా విధాయక కృత్యమనియెంచి, నా స్వార్జిత మగు తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా ఆలమూరు కోఆపరేటివ్ ల్యాండు మార్గేజి బ్యాంకులోనున్న నెం 31 to 42 నెం బర్లుగల పంన్రెండువేల రూపాయీల డిబెం చర్లను యీ క్రిందిషరతులతో యీ క్రింద వివరింపబోవు విషయములను నెరవేర్చుటకు

for 15 years, established a public charitable Educational Institution called Andhra Girvana Vidyapitham having immovable properties worth about Rs. 50000 and died on 6th March 1926. I feel it my bounden duty to perpetuate his name for ever in the Andhra Desa, as far as it lies in my power and I therefore hereby endow my twelve thousand rupees worth of Debentures Nos. 31 to 42 both inclusive, now in the Co-operative Land Mortgage Bank at Alamuru Ramachandrapur Taluk, East Godavari District, as a public trust for the following objects, subject to the following conditions.

కోపూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలకసంఘమువారిని ట్రస్టీలుగాయేర్పరచి యీడిక్లరేషన్ ఆఫ్ ట్రస్టుదస్తావేజును వ్రాయుచున్నాను.

2. పైన ఉదహరించిన డిబెంచర్లమీద ప్రతి ఆరుమాసములకు వచ్చువడ్డీని మాత్రమే కోపూరు విద్యాపీఠ పాలకసంఘము ఖర్చు చేయుచుండవలెగాని, అసలు మొత్తము శాశ్వతమూలనిధిగా యెల్లకాల ముండవలెను. ఈ డిబెంచర్ల గడువానంతరముకూడ వీనిమీదవచ్చువడ్డీ తగ్గినను, హెచ్చినను కోఆపరేటివు ల్యాండుమార్టేజిబ్యాంకులలోనే యీ అసలు మొత్తము వేయుచుండవలెను. గాని భూములు, యిల్లు మొదలగు స్థిరాస్తులను కొనకూడదు.

II. The above Debentures should be kept as a permanent fund and the interest alone thereon accruing every six months utilised from time to time. At the expiry of the 20 years period of deposit the corpus should be invested in the Co-operative Land Mortgage Banks alone, whatever be the rate of interest payable but not in the purchase of lands, houses or any other kind of immovable property.

౩. నేనున్ను, నా యిద్దరు కొమాళ్లు కృష్ణమోహన్ M. A. B. L. Advocate మద్రాసున్ను, జగన్మోహన్ B. A. L. E E. Electrical Engineer బొంబాయిన్ని కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలక సంఘములో జీవితకాలపు మెంబర్లుగా నుండవలెను. ఈ ముగ్గురులో యెవరైనను అన్యగ్రామములలో నున్నపుడు సదరు విద్యాపీఠ పాలకసంఘ కార్య నిర్వాహకసంఘ సమావేశములలో పాల్గొని వోట్లు వేయుటకును, ఉద్యోగీయులుగా నుండుటకును, వారి యిష్టమువచ్చినవారిని మరి యొక్కొక్కరిని రాజమహేంద్రవరము, కొవ్వూరు గ్రామస్థులలోనుండి మెంబరుగా నామినేటుచేసి, పాలకసంఘ సెక్రటరీకి ముందు

III. Myself and my two sons Krishna Mohan, M.A., B L. Advocate, Madras and Jagan Mohan, B. A. L E. E., Electrical Engineer, Bombay, should be permanent members for their lives in the Governing body of the Vidyapitham and during their absence from Kovvur, should have each of them the power to nominate a resident of Rajahmundry or Kovvur to act in their stead both in the General Body's and its executive committee's meetings of the Vidyapitham for the purpose of voting and also acting as office bearers too, if necessary after giving previous intimation to the Secretary or the President of the General Body.

గా తెలియచేసి, తగినయేర్పాట్లు చేసికొనుటకు అధికారము కలిగియుందురు.

4. పైనఉదహరించిన ట్రస్టుఫండుమీద రాగలవడ్డీలోనుంచి నెలకు ఇరువది (రు 20) రూపాయల చొ॥ కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమున కనుబంధముగా నెలకొల్పబడిన శ్రీ వాడ్రేవు జోగాయమ్మ బహద్దరు జమీందారుగారి కళాశాలాధ్యక్షుని (principal) గౌరవభృతిక్రింద నిచ్చుచుండవలెను. ఒకవేళ యీ స్వల్పమొత్తమును తన ఖర్చులకు స్వీకరించుటకు ఆయన యిష్టపడని యెడల సదరు కళాశాలలో పరిశోధనకును (research) అధ్యాపకమునకును (teaching) సమర్థుడగు ఒక పండితుని జీతముక్రింద నీయవలయును.

IV. Out of the interest on the above trust fund, a monthly sum of Twenty Rupees should be paid as honorarium to the Principal of Vadrevu Jogayamma Bahadur zamindar garu's Kalasala established as an adjunct to the Andhra Girvana Vidyapitham at Kovvur and in case of his non-acceptance, for any reasons of his own, to such Pandit therein as is found useful both for the research work in the Vidyapitham, and also for the teaching work in the Kalasala.

5. పై మొత్తము పోగా మిగిలిన వడ్డీని ఆంధ్రభాషలో సులభశైలిని పండిత పామరులకు బోధపడునట్లు చిన్న చిన్న గ్రంథములను యీ క్రింద నుదహరించిన విషయములలో విద్యాధికులచేత కొద్దిపారితోషిక మిచ్చిగాని, ఉచితముగగాని, వ్రాయించి అచ్చొత్తించి ఆంధ్ర దేశములోని ముఖ్యమైన గ్రంథాలయములకు ఉచితముగ పంచిపెట్టుటకును, వ్యక్తులకు స్వల్పఖరీదుకు విక్రయించుటకును, విద్యాపీఠ పాలకసంఘమువారు వినియోగించుచుండవలెను.

V. The rest of the income should be utilised in getting small books written in easy colloquial Telugu on the following subjects for the enlightenment of the masses, printed, and distributed gratis among all the important libraries in the Andhra Desa and also sold to individuals for small prices.

(ఏ) వేదకాలము నాటినుండి హైందవుల ఆర్యమతములోని శ్రౌతస్మార్త కర్మకాండల జ్ఞానకాండల పరిణామము, ప్రస్తు

(a) Critrical examination on rationalistic lines of thought of the various religious and social movements in India and of the various customs, beliefs and

తేము వారిలోనున్న సాంఘికాచారములు, విశ్వాసములు, సాంప్రదాయములు, పట్టింపులు, వర్ణములు, వివాహములు, స్త్రీలవిద్యాస్వాతంత్ర్యములు, జ్యోతిషములు, మంత్రతంత్రములు, దేవతలు, దయ్యములు, వర్జములు, లగ్నములు, శకునములు, గ్రహణములు, మంచి చెడుదినములు, అశుచి, ప్రాయశ్చిత్త ఆచారకాండలు, తద్దినములు, దృష్టిదోష, పంక్తిదోష, అంటుదోష, నాయుదోషములు, సాముద్రికము, రసవాదము మొదలగువానిని గురించి మూఢవిశ్వాసములను సప్రమాణముగ ఖండించి విమర్శించుట.

(బి) షోడశకర్మలను గురించి ఆంధ్ర టీకా తాత్పర్యములతో గ్రంథములను వ్రా

sentiments prevalent among the common people such as the present petrified caste system, unnatural and artificial relations between the sexes, dogmatic rituals, creeds and ceremonies, irrational conventions based on creeds and colours etc. opposed to common sense and reason, unnecessary rules of purity and pollution, grotesque forms of idol worship astrology, palmistry, alchemy, manthra thanthrams, demonology, supernaturalism etc., untouchability, unapproachability, ancestor worship, good and bad days for every daily act etc.

(b) A study of comparative mythology sociology and ethics now in vogue among the various races of mankind

యించి అనవసరమని తోచినకర్మకాండ విభాగములను సంకుచితపరచి వేదలక్షణ నేర్పుకొని తగువిమర్శనజ్ఞానమును తెలివియు గల పురోహితులను దేవాలయార్చకులను అన్ని వర్ణములలోను బయలు దేరునట్లు చేయుట ప్రపంచములో తక్కినజాతుల మతములు, సాంఘికాచారములు, నీతి, వీనిపరిణామములు మొదలగునవి తెలియ జేయుట.

and of the evolution of modern Hindu customs, theological doctrines and supernatural beliefs, dogmatic rituals etc. and the turning out enlightened priesthood in every caste and sect by imparting a true and correct knowledge of the karmakanda and the Gnanakanda.

(సి) ఆర్యమతమునుండి బయల్వెడలిన బౌద్ధ, జైన, బ్రహ్మసమాజ ఆర్యసమాజమతములు మొదలగు వానిలోని సూత్రములను, తెలియజేసి విమర్శించుట, ప్రపంచములో వ్యాప్తినొందియున్న యితరమతములతో ఆర్యమతమును పోల్చి వానిని గురించి ప్రజలకు బోధించుట.

(c) A critical examination of the offshoots of Aryan religion such as Jainism, Budhism, Brahmo samaj, Arya samaj etc. and a comparative study of the other important religious movements in the world.

(డి) మనపూర్వులు రచించిన మానసిక భౌతికశాస్త్రములు కళలు అధునిక పరిశోధనలనుబట్టి విమర్శించి వానిలో అవసరమగు మార్పులనుజేసి మన దేశీయ పారిభాషిక పదములతో ఆంధ్రములో గ్రంథములను వ్రాయించుట.

(d) The bringing out an up-to-date knowledge imbedded in the ancient works on material sciences and arts and psychic researches, by getting small text books written in easy Telugu with the old and the newly coined Sanskrit nomenclature.

(ఇ) గాంధిమహాత్ములవారి సత్యాగ్రహతత్వములు, వానిలో నిమిడియున్న వేదాంతము, నానారాష్ట్రపరిపాలనా విధానములు, ప్రపంచములో యిదివరకు జరిగిన, యిప్పుడు జరుగుచున్న సమస్తసాంఘిక రాజకీయార్థిక విప్లవములు, ఉద్యమములు, గ్రామపునర్నిర్మాణము, సహకార, అసహాకారోద్యమములు, నానావిధసమిష్టి వాదములు,

(e) Diffusion of knowledge of spirtualised politics of Mahatma Gandhi, and of the Gandhian philosophy, of the political, social and economic revolutions and movements of the world past and present and of the modern systems of political Government such as the various forms of socialism, co-operative republicanism, social and ethical reconstruction, trade unionism, fascism

మొదలగు వానిని గురించి గ్రంథములను ప్రచురించుట.

6. పైన వ్రాసిన విషయములను నిర్భయముగను, నిష్పాక్షికముగను, నిర్మొగమాటముగను, సత్యముతప్పకుండ సప్రమాణముగ సంపూర్ణ మనస్స్వతంత్ర్యములతో, (Free thought) ఆంధ్రులయెదుట వారిభాషలో పెట్టుచుండవలెను. ఏ గ్రంథముగాని రూపాయకంటె హెచ్చువెలను కలిగియుండకూడదు. నా జీవితకాలములో నే నంగీకరించిన గ్రంథములనే ప్రచురించవలెను. నా జీవితానంతరము విద్యాపీఠపాలక సంఘమువారు యిప్పుడేర్పరచు పండితబృందము (Academic Council) చే నంగీకరింపబడిన పిమ్మట ఆ

syndicalism, communism, Bolshevism etc.

VI. The Books on the above subjects should be written impartially, fearlessly with citations of authorities, without the slightest deviation from truth and no book should be priced at more than one rupee. These books should be approved of by me before publication and after my death by the Academic Council of the Vidyapitham, now to be established and also by the majority of the permanent members of the Vidyapitham.

సంఘమువారి శాశ్వతసభ్యుల మెజారటీవారి యామోదమును బడయనిదే యే గ్రంథము గాని వెలువడకూడదు.

(7) నాపై యుద్దేశములను నెరవేర్చుటకు యితర దాతలనేకమంది ట్రస్టుఫండుకు సహాయపడుదురని నేను నమ్ముచున్నాను. అప్పటి దేశకాల పరిస్థితులనుబట్టి పైననేను తెలియజేసిన విషయములలో దేనికైనను యీ నిధిమీద వచ్చువడ్డీని అంతగాని కొంత గాని వీలుకొలది ప్రజోపయోగమునకు వినియోగించవచ్చును. సాలుకు ఒకచిన్న గ్రంథము వెలువడినను నా యాత్మ తృప్తినొందకలదు.

(8) నేనిదివరకు ది 16-5-1928 తేదీని కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము

VII. I hope that many philanthropists that sympathise with the above objects may contribute their mite to this nucleus and thus render this Vidyapitham a unique and progressive Institution in the Andhra Desa. Any how, I consider myself amply rewarded and my soul will rest in peace even if one book be published in an year, on any of the above mentioned subjects in para V *Supra* according to the necessities of the times.

VIII. On 16—5—1928 I created by a registered deed a charge on my house at Kovvur for payment of Rs. 10 per month

నకు కొవ్వూరులో నా యింటిమీద రిజిస్టరు డీడ్డుద్వారా యేర్పరచిన రు 120 లు వార్షికము యీ ట్రస్టుడీడ్డు మొత్తములోనేచేరి యున్నందున సదరు చార్జిరద్దు అయినట్లు భావించుకొని యీ ట్రస్టును ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలకసంఘమువారు అంగీకరించవలెను.

towards the salary of the teaching staff in the Vidyapitham, but as that amount is included in that of this trust deed, the Vidyapitham authorities should elect to give up their rights there-under if they accept this trust deed and to free my house from the above charge.

(9) ఏకారణమువలన నయినను నాపై యుద్దేశములను కొవ్వూరు, ఆంధ్రగీర్వాణ విద్యాపీఠపరిపాలక సంఘమువారు సరిగా నెరవేర్చజాలనిచో ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులు శివిల్ కోర్టుగుండా యీ ట్రస్టుఫండును స్వాధీనము చేసుకొని దీనిలో నుదహరించిన కార్యవర్గములను సక్రమముగ యీ

IX. If for any reason the Governing Body of the Vidyapitham be unable to discharge its functions properly the Andhra University authorities are here by authorised to get the above trust fund into its own hands through Civil Courts and manage this trust by using only the annual income thereon for the above mentioned objects at Kovvur alone.

కోవ్వూరు విద్యాపీఠములోనే నెరవేర్చుచుండవలెను.

ఇది నా సమ్మతిని నా స్వదస్తూరీని వ్రాసియిచ్చిన డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టుదస్తావేజు.

వల్లూరి సూర్యనారాయణరావు.
ఆడ్వకేటు, కొవ్వూరు.

I executed this deed of Declaration of Trust with my free will and consent, on the 9th April 1931, in my own hand writing.

V. SURYANARAYANARAO
Advocate, Kovur.

—:వ్రాయతగిన కొన్ని విషయముల పట్టిక:—

1. వర్ణములు. 2. అంతర్వర్ణ, అంతర్జాతీయ వివాహములు 3. వితంతు, రజస్వలానంతర వివాహములు—3. వావి 4. వివాహచ్ఛేదనము. 5. స్త్రీలవిద్యా స్వాతంత్ర్యములు. 6. ప్రకృతి పరిణామము. 7. మతపరిణామము. 8. నీతి పరిణామము. 9. నీతిమత సంబంధము. 10. విగ్రహారాధనము. 11. పితృపూజ. 12. ఆర్యబ్రాహ్మణ మతములు. 13. పునర్జన్మ. 14. స్వర్గనరకములు. 15. దేవుళ్లు దయ్యములు. 16. దైవప్రార్థనము. 17. పురాణములు. 18. హైందవ ధర్మశాస్త్రకాలనిర్ణయము. 19. దైవస్వరూప పరిణామము. 20. అవతారములు. 21. ఆత్మస్వరూప పరిణామము. 22. మంత్రతంత్రములు. 23. కర్మజ్ఞాన భక్తిమార్గములు. 24. యోగవిద్య. 25. దృష్టిపంక్తి అంటునాయు దోషములు. 26. మంచిచెడు దినములు. 27. శకునములు, వర్జములు, లగ్నములు. 28. జ్యోతిషము. 29. యజ్ఞములు, యాగములు. 30. శుద్ధాద్వైత జడాద్వైతములు. 31. అహింస, జీవహింస. 32. ఆత్మహత్య. 33. విశ్వాససంశయాత్మ తత్వములు. 34. దానధర్మములు. 35. అపక్వశాకాహారము. 36. సమిష్టివాదములు. 37. మహాత్మగాంధిగారి సత్యాగ్రహ తత్వము. 38. రాజకీయ, సాంఘికవిప్లవములు. 39. భౌతిక శాస్త్రములు. 40. బాలుర విద్యా విధానము.

---

# అధ్యాయము ౯

## మాడపాటివారి ధర్మములు

మాడపాటి వేంకటేశ్వరరావుగారు నిజామురాజ్యము లోని పరిటాలగ్రామకాపురస్థుడు. పిత్రార్జిత మేమియులేదు. తాతతండ్రులవలెనే, నూజవీడు సంస్థానమును కనిపెట్టుకొని, తనబుద్ధికుశలత, చాకచక్యముల వలన, నెలకు రు 15 లు జీతమునుండి నెలకు రు 300 ల జీతము తీసికొనుచు, ఉయ్యూరు, నిడదవోలు జమీనాలకు దివానుగా పనిచేసెను. ఈయన కొన్ని లక్షల రూపాయిల ఆస్తిని సంపాదించగలిగెను. తన మొదటిభార్య, సంతానవిహీనురాలుగా చనిపోయిన తరువాత, నా తాతా సహోదరుడగు లేటు వల్లూరి సూర్యప్రకాశరావుగారి కొమార్తెను వివాహము చేసికొనెనుగాని, యీమెయు సంతానవంతురాలు కాకపోవుటచే, తన వంశములోని ఒక చిన్నవానిని 4-3-1908 తేదీని దత్తత చేసికొనెను. 14-8-12 తేదీని ఈయన 104 పేరాలతో తన ఆఖరుడుయిలు వ్రాసి, దానిలోని విషయములు, తన జీవితకాలములో నెవరికిని తెలియకుండ నుండవలెనని ఒక మద్రాసు ఫకీలుచేత మాత్రము సాక్షివ్రాలు చేయించి, బెజవాడలో తన మేడలో, ఒక యినుపపెట్టెలో, సీలుకవరలోపెట్టి భద్రపరచినారు. ఈయన 24-3-1917 తేదీని నూజవీడులో చనిపోగానే, యీయన మేనల్లుని మామగారగు

వేమూరి రామచంద్రరావు, బి. యల్. గారు, పరామర్శనిమి త్తము నూజవీడు వెళ్ళేటప్పుడు, వేంకటేశ్వరరావుగారి ఉయి లును గురించి విచారించమని చెప్పితిని.

ఆయన దినవారములైన తరువాత, ఆయన కుటుం బము బెజవాడ వచ్చేలోపుగా, శ్రీడింబి హనుమంతరావు, బి. యల్. గారిని, అక్కడనుండి విషయములన్నియు తెలిసి కొనవలసినదని మాబందరు బాలికాపాఠశాల కమిటీవారము కోరియుంటిమి. వేంకటేశ్వరరావుగారిభార్య, కుమారుడు, తక్కిన బంధువులు బెజవాడలో దిగిన రాత్రియే యినుపపె ట్టెల తాళములు తీయించి వెదుకగా, సీలు కవరు కనుపడినది. ఉయిలు బయటపడినది. పైన చెప్పిన యిద్దరు లాయర్లేగాక, దాసుమాధవరావుగారు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు మొదలగు పెద్దమనుష్యుల యెదుట, ఆ ఉయిలు అంతయు. ఆ రాత్రియే అందరకు చదివి వినిపించబడి, దానిని రిజస్టరు చేయించుటకు హనుమంతరావుగారి చేతికీయబడినది. దానిలో అయ్యదేవర కాళేశ్వరరావుగారును నలుగురు ఉయిలుదారుని బంధువులును ట్రస్టీలుగాను, ఎగ్జిక్యూటర్లుగాను ఏర్పరచబడిరి. కాళేశ్వరరావుగారు ఈ ఉయిలును 9-11-1917 దాఖలు చేయగా, సబురిజిస్ట్రారు, సాక్షులను విచారించి 11-8-1918 తేదీని రిజస్టరుచేసినారు.

ఉయిలులో ఉదాహరించబడిన ట్రస్టీలు, ఆస్తులను స్వాధీనముచేసికొని తమశక్తికొలది వానిని కాపాడుచు,

కొన్ని ధర్మములను ఇచ్చుటకు మొదలుపెట్టిరిగాని, వేంకటే శ్వరరావుగారి భార్య, కొందరు ట్రస్టీలను లోబరుచుకొని, అడ్డు తగులుచుండుటచే ఎస్టేటుకు లాభకరమైనపనులు జరిపించజాలకపోయిరి. ఇంతలో, వేంకటేశ్వరరావుగారి దత్తతకుమారుడు లేటు సూర్యనారాయణరావు 24-3-1920 తారీఖున మేజరగుటచేత, ఉయిలుప్రకారము, యావత్తుయెస్టేటు, అతనికి వప్పచెప్పబడెను. కొద్దిమాసములకే అతని దత్తతల్లి కూడా చనిపోవుటవలన, ఆమెతల్లి, ఆమె మేనమామ చేతులలో ఈ చిన్నవాడు పడిపోయెను. ఈ కుర్రవాడు మిక్కిలి బుద్ధిమంతుడు. ఇంటర్మీడియేటు పరీక్షకు నోబిలు కాలేజిలో చదువుకొనుటకు, బందరులో నేనున్న యింటికి ఎదురుగుండానే, ఒకమేడ అద్దెకు తీసుకొనియుండెను.

ఈలోగా, నాకు చిరపరిచితులును, వడ్లమన్నాటి నరసింహముగారి సమీపబంధువునగు శ్రీ బ్రహ్మానంద సరస్వతీ స్వాములవారు తాను కాశీ రామేశ్వరములలో శంకర దేవాలయములకును, మఠములకును కొంతధర్మము చేయవలసినదని వేంకటేశ్వరరావుగారిని ఒప్పించి, అట్లే ఆయన జీవితకాలములోనున్న తరువాత ట్రస్టీల మేనేజిమెంటు కాలములోనున్ను జరుగుచుండునట్లు చేసితిననియు, వెంకటేశ్వరరావుగారి ఉయిలే చెల్లనేరదని, ఆయన కొమారునిచేత కొన్ని వ్యాజ్యములలో ఆన్సరు పెట్టించుటచేత, తాము, కాశీరామేశ్వరమఠముల ధర్మకర్తలగు శృంగేరి పీఠమువారిచేత వకాలతునా

మాయును, సొమ్మును పంపించితిమనియు, తక్షణము నోటీసిచ్చి దావాచేయవలసినదనియు నాకువ్రాసిరి. నాకు శృంగేరీ పీఠమువారు వ్రాసిన యుత్తరమును, దత్తపుత్రుడగు సూర్యనారాయణరావుకు చూపించగా, నాతో రహస్యముగా, తన దత్తత తల్లియొక్క మేనమామలను తాను వదలించుకొనజాలననిన్ని, తప్పక వ్యాజ్యమువేసి ధర్మములను రాబట్టుకొనవలసినదనిన్ని, తానుకూడ తన దత్తతతండ్రిచేసిన ధర్మములతోపాటు మరికొన్ని ధర్మములు చేసెదననిన్ని నాతో చెప్పినాడు. కాని అకస్మాత్తుగా యీ పిల్లవాడు 2-6-1921 తేదీ రాత్రి అదివరకు రెండురోజులక్రింద బెజవాడలో వడదెబ్బవలన కలిగిన జ్వరమువలన చనిపోయినాడు.

మరునాడు ఉదయమున కీసంగతి తెలిసి తహశ్శీలుదారునకు రిపోర్టు వ్రాసితిని. ఆయన వచ్చేలోపుననే దహనసంస్కారములన్నియు అయిపోయినవి. మేము మేడమీదకు ఆస్తుల జాబితా తయారు చేయుటకు వెళ్ళగా, పెట్టెలన్నియు బ్రద్దలుకొట్టబడి, వజ్రసరుకు, బంగారపు నగలు మొదలగునవి సుమారు డెబ్బదివేల కిమ్మతుగల వస్తువులు దొంగిలింపబడినవి. ఈపిల్లవానితల్లి మేనమామలలో పెద్దవాడుండెనుగాని, రెండవవాడు కనుపడలేదు. దత్తుడైన లేటు సూర్యనారాయణరావు ఏదైనను ఉయిలు వ్రాసినాడా యని నేను ప్రొద్దున అడుగగా ఏమియు వ్రాయలేదని చెప్పి, తహశ్శీలుదారు అడిగినపుడు

వ్రాసినాడేమో తనకు తెలియదని, అతని తల్లి మేనమామ సుబ్బారాయుడుగారు చెప్పుట వింతగా నుండెను. వీరెవరును దత్తునికి వారసులుకారు గనుక వారసులు ఎవరో తెలిసికొన వలసినదని బెజవాడలో నున్న తుర్లపాటి వేంకటేశ్వరరావు గారికిని, పెద్దభొట్ల వీరయ్యగారికిని వ్రాసితిని. మూడు రోజులలో వంశవృక్షమును, వారసులను వెంటబెట్టుకొని, సదరు వేంకటేశ్వరరావుగారు వచ్చిరి. వారసులచేత, పోయిన నగలు వగైరాలకు క్రిమినలుచార్జి దాఖలుచేయించిరి. దానిలో నేను సాక్ష్యమిచ్చియున్నాను. ఈ చార్జి పెండింగులో నుండగానే, నైజాము యిలాకానుండివచ్చిన యీవారసులు కృష్ణాజిల్లా శిద్ధాంతం కాపురస్థులగు అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యచౌదరీ గారికి, తమవారసత్వపు హక్కును ఒకలక్ష రూపాయిలకు అమ్మివేసి, నాతో చెప్పకుండానే వెళ్లిపోయిరి. ఈ వ్యవహారములో సదరు వేంకటేశ్వరరావుగారే నాకు తెలియకుండా సారథ్యము నడిపిరని నేను నమ్ముచున్నాను.

శృంగేరీపీఠమువారి తరఫున నేను బందరు సబుకోర్టులో **O. S. 60 of 1921** నెంబరున సదరు వారసులను; అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారిని, నేను ఎరిగి యున్నంతవరకు లెగటీలను చేర్చి దావా తీసికొని వచ్చి, ఆస్తి యంతకును ఒక రిసీవరును ఏర్పాటు చేయించితిని. వేంకటేశ్వరరావుగారి ఉయిలులో, పబ్లికుధర్మములను గురించి వ్రాసిన పేరాలలోని ముఖ్యభాగములు క్లుప్తముగా ఈ క్రింద నుదాహరించడమైనది :—

12 వ పేరా :—నాయావత్తు చరస్థిరాస్తులున్ను ఈ క్రింద ఉదాహరించిన ధర్మములకు లోబడి, నాకుమారుడైన సూర్యనారాయణరావుకు చెందవలసినది.

84 వ పేరా :—ఈ దిగువ నుదాహరించిన ధర్మములు శాశ్వతముగాను, అవిచ్ఛిన్నముగాను జరగడము నాకోరిక అయియున్నది గనుక, నా అనంతరము, నాకొమారుని మైనారిటీలో ట్రస్టీలున్ను, నాకొమారుని మైనారిటీ తీరిన వెనుక నాకొమారుడున్ను విధిగా నడపవలసినది.

(1) నిత్యము నూజవీడు మేడలోను, బెజవాడ మేడలోను గేట్లలో చిరకాలము నుంచి బీదలకు వేస్తూయున్న ముష్టి బియ్యము, మకాము 1 కి రోజుకు శేరుచొప్పున 42 శేర్లు.

(2) చిరకాలము నుంచి జరుగుచున్న నూజవీడులోని పూర్ హౌసు అనగా అవధ్యులైన బీదలకు సదావర్తి యియ్యడము ఇంతటినుంచికూడా ప్రతిమంగళవారము ప్రతిశనివారము రోజు 1 టికి జనం 1 టికి అర్ధశేరు తెల్లబియ్యం, పైఖర్చు 0—0—4 చొప్పున ఆయారోజులలో రోజు 1 టికి 25 జనంవరకు ఇస్తూ ఉండవలసినది.

(3) నూజవీడులో చలివేంద్రకు సాలుకు 100 రూపాయాలు.

(4) పరిటాల దేవస్థానమునకు సాలుకు రు 600 లు.

(5) ఉమామహేశ్వరపురము దేవస్థానమునకు ధ్వజః ప్రతిష్ఠక్రిందను ప్రహారీగోడ నిమిత్తమున్ను రు 400 లు. ప్రతి సాలున కళ్యాణోత్సవము వగైరాలకు సాలుకు రు 300 లు.

(6) కొండవటికల్లు దేవస్థానమునకు సాలుకు రు 36 లు.

(7) నూజివీడులోని విక్టోరియాటౌనుహాలుకు,, సాలుకు రు 200 లు.

(8) బెజవాడ టౌనుహాలు, రెస్టుహౌసు, లైబ్రేరి, ఆంస్పిలు హాస్పిటలులోనున్న కాన్పుల వార్డునకున్ను, అయిదు పశువుల నీటితొట్లలకున్ను, వీటిఅన్నింటికి అమాంబాపతుల ఖర్చులక్రింద సాలుకు రు 400 లు.

(9) రంగాపురములోని జార్జిఫ్రీప్రైమరీస్కూలుకు సాలుకు రు 10 లు.

(10) తిరుచ్చానూరు దేవాలయమునకు సాలుకు రు36.

(11) గన్నవరం రెస్టుహౌసుకు సాలుకు రు 150 లు.

(12) తిరువూరు రెస్టుహౌసుకు సాలుకు రు 150 లు. పాత్రసామాను రు 150.

(13) మంగళగిరి దేవాలయము సాలుకు రు 50 లు. సంప్రోక్షణ చేయుటకు రు 350 లు.

(14) కాశీలో శృంగేరిపీఠములో కట్టించిన దేవాలయములకు సాలుకు రు 360 లు.

(15) ఉయ్యూరులో వేంకటేశ్వరరావు జార్జిసత్రము,

ఇల్లు, దీనిని పెంపుజేసి కట్టించుటకు రు 1000 లు. పాత్ర సామాను రు 150 లు. సత్రముజరుపుటకు సాలుకు రు 150 లు.

85 వ పేరా:—పై పేరాలో ఉదాహరించిన ధర్మములుగాక, యీ దిగువ ధర్మములనున్ను నేను స్థాపించియున్నాను.

(1) బందరులో లోవరుసెకండరీగరల్సు స్కూలున్ను బందరు స్త్రీసమాజమునకు భవనము నిమిత్తము రు 7000. స్కూలుపోషణ నిమిత్తము సాలుకు రు 1000 లు—

(2) రామేశ్వరములో కట్టించే మఠమునకును, దేవాలయమునకును రు 1500 ల వరకుకిమ్మతుగల ఒక స్థలమును కొని సుమారు రు 2000 ల వరకు ఖర్చుపెట్టి ఆలయము కట్టించి, రు 1000 లు ఖర్చు పెట్టి విగ్రహమును ప్రతిష్ఠచేసి, సన్యాసుల భోజనమునకు అమాంబాపతు ఖర్చులక్రిందను సాలుకు రు 850 లు.

(3) కాశీలో శృంగేరి పీఠములో యతిసత్రము సాలుకు రు 1200 లు.

(4) బందరు నేషనలుకాలేజికి సాలుకు రు 200 లు.

(5) బందరు రాత్రిపాఠశాలకు సాలుకు రు 60 లు.

(6) బెజవాడ నూజవీడు వైద్యశాలలకున్ను, బెజవాడలో స్థాపించదలచిన ఆయుర్వేద పాఠశాలకున్ను, అచటనే ఉంచదలచిన సంస్కృత పాఠశాలకున్ను కలసి సాలు 1 టికి రు 2500 లు,—అమాంబాపతుల క్రింద ఇయ్యవలసినది.

O. S. 60 of 1921 నెంబరులో బందరు సబుజడ్జీగారు, సాక్ష్యమును సంపూర్ణముగా విచారించి, అడుసుమిల్లి గోపాల కృష్ణయ్యగారి ప్లీడరుగా అల్లాడి కృష్ణస్వామయ్యరుగారినిన్ని, లెగటీలతరఫున నా మొదలగు ప్లీడర్లనున్ను విని, సాలువారి రు 7433 మొత్తముగల లెగసీలకును, వానిబకాయి మొత్తము రు 53120 ల సొమ్ముకున్ను, 7—3—1925 తారీఖున ప్రిలిమినరీ డిక్రీ యిచ్చినారు. నాకు వ్యతిరేకముగ బందరు గరల్సుస్కూలు లెగసీయును, రామేశ్వరము లెగసీలో సగమున్ను, ఇంకా కొద్దిగాచిల్లర లెగసీలున్ను తీర్పుయిచ్చినారు. ఈతీర్పుపైని ఉభయవాదులు హైకోర్టుకు అప్పీలు చేసినారు. ఈలోగా ఆతి నారాయణమూర్తిగారనే మరియొక సబుజడ్జీ వచ్చి, లెగసీలు పోగా మిగిలితే, అయివజు తీసికొనవలసిన అడుసుమిల్లి గోపాల కృష్ణయ్యగారికి యావత్తు యెస్టేటు వప్పగింతచేసి, రిశీవరును తీసివేసి, 29—4—1925 తేదిని, వాదికిగాని, వాది ప్లీడరుకుగాని నోటీసు ఈయకుండా వేసంగి శలవులు ఈయబోవుచున్నప్పుడు ఫైనల్ డిక్రీ యిచ్చి వెళ్లిపోయినారు. దీనిమీద కూడా ఉభయ వాదులు అప్పీళ్లు చేసియున్నారు. హైకోర్టు తెరువగానే 13—7—1925 వ తేదిని రిసీవరును ఏర్పాటు చేయించవలెనని, వాది, అందరి లెగటీల తరఫున పిటీషను పెట్టగా, 23—3—1926 తేదిని, ప్రతి సంవత్సరము ఈయవలసిన లెగసీల మొత్తమును గోపాలకృష్ణయ్యగారు కోర్టులో దాఖలుచేసే పద్ధతిమీద ఎస్టే

టును తన స్వాధీనములో నుంచుకొనవచ్చునని హైకోర్టువారు ఆర్డరు వ్రాసుచేసిరి. బకాయిమాత్రము, సెక్యూరిటీ యిచ్చి, డిక్రీ అమలుచేసికొని ప్రతి లెగటీ తీసికొన గలిగినప్పటికి వ్యాజ్యపర్యవసానము తేలేవరకు, ఉమామహేశ్వర దేవాలయపు ధర్మకర్త తప్ప, యెవరును, తమ యాస్తిని హామీ యిచ్చుటకు జంకి, తమకు రావలసిన మొత్తము ఇప్పటికిని డిక్రీ అమలుచేసి వసూలు పరచుకొనలేదు. దేవాలయముల ధర్మకర్తలకును, బందరు నేషనల్ కాలేజివారికిని, మరి కొన్నింటికిని ఈయవలసిన సాలుసరి మొత్తములు, సుమారు రు 2200 లకు, గోపాలకృష్ణయ్యగారు అప్పీలే చేయలేదు.

పైన చెప్పిన హైకోర్టు ఆర్డరు ప్రకారము సాలు 1 కి రు 7337 ల చొప్పున నాలుగు సంవత్సరములకు మాత్రము కోర్టులో డిపాజిట్టుచేసి, తరువాత అట్లుచేయక మానివేసినట్లు ఇటీవల మాకు తెలిసి, తిరిగి పిటీషను పెట్టగా, తక్కిన బకాయి యావత్తు మూడుమాసములలో డిపాజిట్టు చేయవలసినదని 2–10–1934 తేదిని హైకోర్టువారు ఆర్డరు వేసినారు. ఈరోజువరకు, ఒక్క దమ్మిడీయైనను డిపాజిట్టు చేయలేదు. తిరిగి రిసీవరును ఏర్పాటు చేయవలసినదని పిటిషన్ పెట్టినాము. ఈ అప్పీలు త్వరలోనే హియరింగుకు వచ్చుటకు సిద్ధముగా నున్నది గనుక దీనిని కొట్టివేసినారు. మా లెక్కప్రకారము, కోర్టులో దాఖలుచేసిన మొత్తము గాక కనీసము 1 లక్షలరూపాయీలు ఈ గోపాలకృష్ణయ్యగారు ఇవ్వవలసియుందురు.

8—5—1935 తారీఖున, ఉభయపార్టీలనువిని, హైకోర్టు జడ్జీలు, తాము ఫిబ్రేవరి 18వ తారీఖున ఇచ్చిన జడ్జిమెంటులో కొద్దిగా సవరణచేసి, దానిప్రకారము డిక్రీని తయారు చేయవలసినదని ఉత్తరు వ్రాసంగిరి. ఈకేసులో నిజముగా తగవు పెట్టుచున్న 10 వ ప్రతివాదియగు అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు ఇదివరకు ఎవరును మేనేజర్లుగా ఏర్పడని లెగసీలకు నూతన మేనేజర్లుగా కొందరిని సింగారించి తీసికొనివచ్చి, వారిని పార్టీలనుగా చేర్పించి, కోర్టువారిచేత వారిని ట్రస్టీలుగా ఏర్పరచి, తానుకోర్టులోడిపాజిట్టుచేసిన 4 గు సంవత్సరముల బకాయగాక తక్కిన 14 సంవత్సరముల బాకీలనున్ను, వానిమీద ఈరోజువరకు రావలసిన వడ్డీలనున్ను చీదాగా మాపుచేయించుకొని, యికముందునుంచి మాత్రము వర్షాశనము ఇచ్చేటట్లు ఏర్పాటుచేసికొనుటయు, అట్టి రాజీనామాలకు ఈజడ్జీలు అంగీకరించుటయు తటస్థించినది. తాను కోర్టులో నాలుగుసంవత్సరములు డిపాజిట్టుచేసిన రు 29000 లు మాత్రము ఆయా లెగసీల మొత్తముల ననుసరించి పంచుకొనునట్లు ఏర్పాటు జరిగినది. గోపాలకృష్ణయ్యగారు క్రిందికోర్టుతీర్పుమీద ఎట్టి ఆక్షేపణలు చేయని లెగసీల విషయమునను, తనవకీలు అల్లాడి కృష్ణస్వామయ్యరుగారు క్రింది కోర్టులో తన యాక్షేపణలను వదులుకొన్న లెగసీల విషయమునను కూడా, ఇట్లేజరిగించుకొన్నారు. ఇట్టి రాజీనామాలు చెల్లనేరవనియు, వానిలో ముఖ్యముగా క్రిందికోర్టువారు డిక్రీయిచ్చిన లెగసీల మొత్త

ములను వదులుకొనుట అశాస్త్రీయమనియు నేను స్వయముగా వాదించితిని. క్రిందికోర్టుతీర్పు అయిన కొద్ది సంవత్సరములకు అడ్వకేటు జనరల్ అయిన కృష్ణస్వామయ్యరుగారు ఈరాజీనామాలు సదుద్దేశ్యముతోనే చేయబడినవని అభిప్రాయ మిచ్చుటచే తాము వానికంగీకారము నిచ్చుచున్నామని జడ్జీలు తమ జడ్జిమెంటులో ఉదాహరించిరి. ఈ కేసులో ఆరంభమునుండి నాకు క్లయంటుగా నుండి, అన్ని లెగసీలను సంరక్షించుటకు పెట్టుబడిపెట్టిన శృంగేరీపీఠమువారి యేజెంటును, నాతోగాని నాతోపాటు ఉన్న యితర పెద్దప్లీడర్లతోగాని సంప్రదించకుండ, ఈ అడ్వకేటు జనరల్‌గారు తిరుగతీసి ఆయనను ముందుగా ఈ అశాస్త్రీయపు రాజీనామాలోకి దింపి ఒప్పించిరనియు, పబ్లి కుట్రస్టులను సంరక్షించవలసిన యీ అడ్వకేటు జనరల్ యీ కేసులోనే క్రిందికోర్టులో గోపాలకృష్ణయ్యగారి తరఫున వాదించి, తాను దరిమిలాను అయిదు సంవత్సరములనుండి అడ్వకేటు జనరలుగా పనిచేయుచున్నను అప్పీలులో పనిచేసి వాయిదాలు పుచ్చుకొనుచు, చివర హియరింగు దినమున, రాబోవు మా ఆక్షేపణలకుభయపడి యీ అప్పీలులో తన వకాలతునామా వదులుకొనెను గాని, తన పూర్వపు క్లయంటు మీది యభిమానముచేత ఈయన యిచ్చిన సలహా యెంత మాత్రము లక్ష్యపెట్టకూడదనియు నేనే స్వయముగా అఫిడవిట్టు యిచ్చి, పిటీషన్ దాఖలుచేసి వాదించితిని. అప్పుడు

జడ్జీలు, యీయన నాతో ముందుగా సంప్రదించియుండవలసిన దనిన్ని, మనుష్యమాత్రునికి ఆశ్రితపక్షపాతము స్వభావజన్యమనిన్ని బహిరంగముగ తమ తమ యభిప్రాయములను వెల్లడించిరి గాని, రాజీనామాలను ఒప్పుకొంటిమని తీర్పు ఇచ్చిరి.

ఈ తీర్పు శుద్ధపొరపాటని నా నిశ్చితాభిప్రాయము. ఈ జడ్జీలు క్రిందికోర్టువారి తీర్పును పరిశీలించి, ఈ రాజీనామాలను గురించి ఉభయపార్టీలు చెప్పినదానిని విని, యీ లెగసీలలో ఏదైనను అశాస్త్రీయమనియు చెల్లగూడదనియు సందేహము కలిగినపుడు మాత్రమే ఆ రాజీనామాలను ఒప్పుకొనవలెను గాని, అడ్వకేటు జనరల్ గారు, పై సంగతి సందర్భములలో, పక్షపాతబుద్ధితో వాని నామోదించినంత మాత్రమున అట్టి రాజీనామాలను బట్టి డిక్రీ యిచ్చుట అనుచితము. ఇంగ్లాండులోని అటర్నీ జనరల్ కు కంటె మన అడ్వకేటు జనరల్ కు ఎక్కువ అధికారములు లేవు. ఈయనయే వాదిగా ధర్మాదాయపు కేసులో నున్నను, తాను రాజీపడుటకు వీలు లేదని 37 మ. లా. జ. 489 స్పష్టపరచుచున్నది. అటులగుచో, వీరి యామోదమునకు విలువ యెంత? పబ్లికు ట్రస్టుల విషయములో రాజీనామాలే సాధారణముగా కూడవని ప్రివికౌన్సిలును, మన హైకోర్టులును నొక్కిచెప్పుచున్నవి. 51 క 861 క; 56 క 894; 46 అ 856; 53 మ 398; 28 మ. లా. జ. 410;

48 మ. 177 ; 8 క. వీ. నో. 404 ; 18 క. వీ. నో. 1264 మొదలగు కేసులను చూడవచ్చును. అట్టిరాజీనామాలను బహు జాగ్రతగ పరిశీలించవలెనని A. I. R. 1930 మ. 629 లో కూడ వ్రాయబడియున్నది. ఈ రాజీనామాలను తాము పరిశీలించితిమని గాని, అందరు పార్టీలను విని యవి సదుద్దేశముతోనే యేర్పడినట్లు భావించితిమని గాని జడ్జిమెంటులో వ్రాయబడలేదు. ఒక్క శృంగేరిపీఠమువారిదితప్ప, తక్కిన రాజీనామాల విషయమై తగవు పెట్టేపార్టీలకు నోటీసులైనను ఈయలేదు. అసలు అప్పీలుచేయని లెగసీలను గురించి కూడ, గోపాలకృష్ణయ్యగారి వకీలు, జడ్జీలచేత వారి చేంబర్సులో ఆర్డర్లు వేయించుకొనుటకంటె విడ్డూరమేమున్నది? క్రిందికోర్టువారి తీర్పుకు భిన్నముగ పార్టీలు వారిలోవారు అకారణముగ రాజీ చేసికొనుట తప్పనియు, అట్టి రాజీనామాలు కోర్టులు అంగీకరించకూడదనియు 12 మ. లా. జ. 360 ; 31 మ. 236 స్పష్టపరచుచున్నవి. నేను ఈ తీర్పులను కనుపరచినప్పటికీ, జడ్జీలు వీనిని పెడచెవినిబెట్టిరి.

ఇదిగాక, నాక్లయంటగు శృంగేరీపీఠము తమ లెగసీనిగురించి రాజీ చేసికొన్నను, తక్కిన అన్ని లెగసీల తరఫున తాము యీ దావాను తెచ్చి, క్రిందికోర్టులో గెలిచి, అప్పీలులో వాదిగా తొలగనపుడు, వారికిగాని, వారితోపాటు వాదులుగానున్న బందరు గరల్సుస్కూలు, బందరు నేషనల్

కాలేజివారికిగాని, వారి వకీళ్లకుగాని, నోటీసులు ఈయక, యీ గోపాలకృష్ణయ్యగారు, మొదటినుండి కేసులో పార్టీలు గాలేనివారితో కూడ రాజీలు చేసికొని వానిని కోర్టువారిచేత రికార్డు చేయించుట కేవలము అశాస్త్రీయము. (54 మ. లా. జ. 629 ; 27 లా. వీ. 212) శృంగేరిపీఠమువారితో సహా, యీ కేసులో నూతనముగా చేరిన పార్టీలందరు, పబ్లికు ట్రస్టీలుగా ఎంచబడుటయే గాక, వీరిలో, ఊరుపేరు లేని ఉయిలులో ఉదహరించబడని వారుకూడ ఇట్టి రాజీనామాలలో దిగుటకు, ఈ నూతనపార్టీ లెవరు? ఈ అడ్మినిస్ట్రేషన్ దావాలో, క్రిందికోర్టులోవలెనే హైకోర్టులో కూడ, యావత్తు యెస్టేటుకు ఒక రిసీవరును ఏర్పాటు చేయవలసియుండునుగాని, శి॥ ప్రో॥ కో॥ 92 వ సెక్షను ప్రకారము స్కీము దావాలలోవలె నూతన మేనేజర్లను ఏర్పాటు చేయుటకు ఈ హైకోర్టు జడ్జీలకు ఎవరు అధికార మొసంగిరి? వీ రేర్పాటుచేసిన విధానమంతయు అశాస్త్రీయమే.

ఈ ప్రస్తుత రాజీనామాలనుబట్టియైనను, వేంకటేశ్వరరావుగారి యెస్టేటుమీద ప్రతి సాలుకు సుమారు రు8500లున్న గోపాలకృష్ణయ్యగారు కోర్టుఆర్డరుమీద 4 సంవత్సరములకు మాత్రము డిపాజిట్టు చేసిన రు 29000 ల మొత్తమున్నూగాక, ఇంకను సుమారు రు35000 ల మొత్తము చార్జీచేయబడినది. నావాదన ప్రకారము ఇంకను కనీసము మరి లక్షన్నర

రూపాయిలు, అన్ని లెగసీల అర్రియర్సు వానిమీద వడ్డీలతో సహా, పబ్లికుకు రావలసియున్నది. ఇట్లు నేను న్యాయము కొరకు నా శక్తి వంచనలేకుండ పోరాడుట మాగోపాలకృష్ణయ్యగారికి మనస్సంకటముగానుండి, నేను నిర్దయుడనని తరుచుగానన్ను నిందించెను. ఈయనయు, ఈయనతండ్రిగారును, అన్నగారును నాకు చిరకాలమునుండి పరిచితులు. కోర్టు వ్యవహారములలో వీరికి వ్యతిరేకముగ చవుటపల్లి, కొర్రగుంటపాలెము మొదలగు గ్రామాదుల రయితులతరఫున నేను వాదించియుండినను, వీరికుటుంబమునకు నాయందు స్నేహభావము కలదు. అన్యోన్యగౌరవమునకు ఎట్టిలోపము లేదు. నేను త్రికరణబుద్ధిగ నమ్మినదానిని, జంకు గొంకులేక చెప్పివేసెదనని వీరికి తెలియును. లేటు మాడపాటి సూర్యనారాయణరావు వ్రాసినాడనే ఉయిలును గురించిన దావాలో ఉభయ పార్టీల తరఫున నేనిచ్చిన సాక్ష్యమే దీనికి నిదర్శనము. పబ్లికుకు గత 18 సంవత్సరముల నుండి రావలసిన సొమ్మును గురించి నేను పోరాడుట తప్పా? మాడపాటివారి యెస్టేటుమీది లెగసీలుపోగా, తమకు మిగిలేభాగమును (Residuary Estate) నిలబెట్టుకొని వీరు అమితద్రవ్యమును ఖర్చుపెట్టుకొనిన మాట సత్యమే! కాలవైపరీత్యముచేత తనకోరికలు ఈడేరనపుడు, ఇప్పుడైనను యావత్తు యెస్టేటుధర్మములకు వదలివేసి, తాను తప్పుకొనుట న్యాయమని నేనంటిని. అట్లు కానిచో, తన స్వంత యెస్టేటు

కూడ నిలవదని చెప్పితిని. పబ్లికుకు రావలసిన లెగసీల మొత్తములు తాను తసరబు చేసికొన్నపుడు, వానిని తిరిగి తన యావత్తు యెస్టేటులోనుండి క్రమక్రమముగా భర్తీచేయ వలసియుండునని నేను వాదించుట క్రౌర్యమా? క్రిందికోర్టులో, నాకుగాని, నా పార్టీకిగాని, నోటీసైనను చేయకుండా, సబుజడ్జి ఆతినారాయణమూర్తిగారిచేత యెస్టేటురిశీవరును తీసివేయించి, క్రిందికోర్టుడిక్రీ మొత్తము సుమారు ఏబదివేల రూపాయిలు తాను కట్టకపోగా, 1921 వ సంవత్సరమునుండి నేటివరకు వ్యాజ్యమాడి, హైకోర్టు ఉత్తరువులనుకూడ ధిక్కరించి గత ఆరు సంవత్సరముల లెగసీల మొత్తములనైనను కోర్టులో డిపాజిట్టుచేయక, తాను శృంగేరిపీఠపు యేజెంటుగారికి సాష్టాంగ ప్రణామముచేసి, వారి కాళ్లవ్రేళ్లబడి, నాక్లయంటు మెడలు విరచి, రాజీనామాకు ఒప్పించి వారి ప్లీడర్ల సమ్మతిలేనిదే వారిచేత కోర్టులో రాజీనామా పడవేయించుటేగాక, యిరువది సంవత్సరములనుండి స్పర్థలతో తగవులాడుచున్న బెజవాడలోని ఆయుర్వేదసంఘములు రెండింటిని, నూజవీడు వారిని, వారిలో వారికి రాజీలుకుదిర్చి, తాను అప్పీలుచేయని లెగిసీలకు తనయిష్టమువచ్చిన వారిని ట్రస్టీలుగా యేర్పరచించి, బిచ్చగాండ్రడు తమకేమిచ్చినను దానితో సంతోషించి తృప్తిపొందినట్లు ఈ నూతనట్రస్టీలచేత గతఫలసాయము వదలుకొనేటట్లు ఒడబరచి, తన చాణక్య యుక్తులచేత తుదకు

సుమారు 1½ లక్షల ధర్మసొత్తును తా నీయనక్కరలేకుండ మన అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు చేసికొన్నారు. ఇట్టి సంగతి సందర్భములలో యస్టేటునుండి యీ ధర్మసొత్తునం తయు నేను రాబట్టగలిగినను లేకపోయినను ఈ అశాస్త్రీయమైన హైకోర్టు జడ్జిమెంటును రద్దుపరచుటకైనను ప్రివికౌన్సిలుకు అప్పీలు చేయుటకు నాకు మెండైన కుతూహలమున్నది.

కాబట్టి ప్రివికౌన్సిలు అప్పీలు ఖర్చులకు నాలుగువేల రూపాయీలుచాలును. ఒకవేళ పబ్లికు సాంతముగా ఓడిపోయిన యెడల, గోపాలకృష్ణయ్యగారికగు ఖర్చులీయవలసి వచ్చును గనుక, నా స్వంతసొమ్ము అయిదువేలరూపాయీలు హైకోర్టులో ముందుగా డిపాజిట్టుచేసెదను. సీమలో మనకగు ఖర్చులక్రింద నాగులువేల రూపాయీలు మన కృష్ణాజిల్లాలోని ధనికుల సహాయముతో పూడగలవు. మనము ప్రివికౌన్సిలులో గెలిచినయెడల మన ఖర్చులు గోపాలకృష్ణయ్యగారి యాస్తిలో నుండి రాగలవు. గనుక, చందాదారులు తమరిచ్చిన ద్రవ్యమును ముదరా కోరినయెడల, మేము ఇచ్చేపద్ధతినే, యీ ధర్మ రక్షణమునకు సహాయము చేయవచ్చును. శ్రీ మాడపాటి వేంకటేశ్వరరావుగారివంటి మహాదాతలు మన యాంధ్ర దేశములో అరుదు. ఆయన సంతతి నశించినను, ఆయన ధర్మములే వారినామమును కీర్తిని చిరస్థాయిగా చేసినవి గనుక, ఆయన

యెస్టేటును ఆయనపేరనే యుండునట్లు ప్రయత్నించుట మన యందరి విధియని మనవి చేయుచున్నాను. చందాలను పంపు వారు మచిలీపట్నములోని డాక్టరు భోగరాజు పట్టాభిసీతా రామయ్యగారికి పంపి, వారివలన రశీదులను పొందవచ్చును. అట్టి వారి నామములు, వారిచ్చిన మొత్తములు ఎప్పటికప్పుడు కృష్ణాపత్రికలో ప్రకటించబడును. ఒక బీదవితంతువుయొక్క దమ్మిడీయైనను కృతజ్ఞతతో స్వీకరించబడును.

| మాడపాటి వేంకటేశ్వరరావుగారి ధర్మముల వివరము | గత ఫలసాయము | రావలసిన గత ఫలసాయము | ప్రతి సంవత్సరము హైకోర్టు డిక్రీనిబట్టి న్యాయముగా వడ్డీతో యీయవలసిన మొత్తం |
|---|---|---|---|
| పబ్బరాజు వేంకటలక్ష్మమ్మగారు | 96 | 1880 | 2,900 |
| నూజవీడులోని ముష్టిబియ్యము | 180 | 720 | 5,120 |
| నూజవీడులోని అవధ్యులగు బీదలు | 350 | 1400 | 9,700 |
| నూజవీడులోని చలివేంద్ర | 100 | 400 | 2,820 |
| పరిటాల దేవాలయము | 600 | 2400 | 16,950 |
| ఉమామహేశ్వరపుర దేవాలయము | 300 | 6000 | 8470 |
| కొండవటికల్లు దేవాలయము | 36 | 144 | 990 |
| నూజవీడు సత్రము, పౌనుహాలు | 200 | 800 | 5630 |
| బెజవాడ టౌనుహాలు. సత్రము, బెజవాడ స్త్రీల ఆసుపత్రి, పశువులకు నీటి తొట్టెలు | 400 | 4400 | 11,260 |
| తిరుచానూరు దేవాలయము | 36 | 648 | 990 |
| గన్నవరము సత్రము | 150 | 600 | 4,330 |
| తిరుపూరు సత్రము | 100 | 400 | 4,230 |

| | | | |
|---|---|---|---|
| కాశీరామేశ్వరములలోని శంకరమఠములు యత్రిసత్రము | 1925 | 15,000 | 74,600 |
| ఉయ్యూరుసత్రము, బిల్డింగుసహా | 150 | 600 | 7,300 |
| బందరుజారి కారొనేషన్ బాలికాపాఠశాల స్త్రీసమాజము, | 1000 | 26,200 | 42,820 |
| బందరు ఆంధ్రజాతీయ కళాశాల | 200 | 3,000 | 4,570 |
| బెజవాడ నూజవీడులలో ఆయుర్వేద ఆసుపత్రులు, పాఠశాల | 2500 | 10,000 | 70,650 |
| | 8273 | 75,492 | 2,74,730 |
| | | 29,348 | |
| | | వడ్డితోమినహా | 42,448 |
| | | 46,144 | 2,32,282 |

అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు, 1926 to 1929 సంవత్సరములలో, కోర్టులో ధాఖలుచేసిన మొత్తము తిరుగు వడ్డీతో మినహాయించగా కనీసము 1½ లక్షలు బకాయియున్న సాలుకు 425 రూపాయిలు వర్షాజనమ్ము యింకను యీయవలసి యుందురు. పైపట్టీలోని మొత్తములన్నియు, సుమారుగా తేల్చబడినవి. హైకోర్టు డిక్రీనిబట్టియైనను అడుసుమిల్లి గోపాల కృష్ణయ్యగారు, యిప్పటికి సుమారు రు 50,000 గత ఫలసాయము క్రిందనే యీయవలసియుందురు. అట్లు ఆయన చేయజాలనిచో, మాడపాటి వేంకటేశ్వరరావు పంతులుగారి యీావత్తు యెస్టేటులో, సదరు గోపాలకృష్ణయ్యగారికిగల రెసి

డ్యూను, ప్రతిసాలుకు శాశ్వతముగా యీయవలసిన రు 8973 లకు లోబడి, లెగటీలందరు జాయంటుగా వేలము వేయించు కొనవలసియుందురు. ఇతరు లెవరైనను, సదరు వేలములో, గోపాలకృష్ణయ్యగారి కుండే రెసిడ్యూను కొట్టివేసికొన్న యెడల సదరు లెగటీలందరకు ప్రివికౌన్సిలులో రాగలిగిన గతఫలసాయమునంతయు నిచ్చుకొనక తప్పదు.

సదరు అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు, బందరు జార్జికారొనేషన్ గరల్సుస్కూలుకు, హైకోర్టువారు డిక్రిచేసిన గత ఫలసాయము, సాంవత్సరికవిరాళముకూడా చెల్లవని, ప్రివికౌన్సిలుకు అప్పీలుచేయుటకు తనకు అనుజ్ఞనీయవలసినదని ది 15–1–1936 వ తేదిని, హైకోర్టులో పిటీషను పెట్టినారు. ఈ సంగతి తెలియగానే, యీ కేజులో తక్కినవారివలె రాజీ పడక, తమలెగిసీలను పూర్తిగా గెలుచుకొన్న పై గరల్సు స్కూలుకమిటీవారును, ఆంధ్రజాతీయకళాశాల కమిటీవారును ది 19–1–1936 తారీఖున కలసి సమావేశమై కొన్ని తీర్మానములను చేసికొనిరి. తమకింకను న్యాయశాస్త్రప్రకారము రావ సిన బకాయ కేగాక, తక్కిన లెగటీల రాజీనామాలను రద్దు పరచి, ఆ లెగసీలబకాయి సుమారు 1½ లక్షరూపాయిలకు కూడ, తాము ప్రత్యేకముగ ప్రివికౌన్సిలుకు అప్పీలుచేయుటకు నిశ్చయించుకొనిరి. ఈ అప్పీలు ఖర్చులవిషయమై తాము

తుదకు ఓడిపోవుట తటస్థించి సదరు గోపాలకృష్ణయ్యగారి కీయ వలసివచ్చే ఖర్చులక్రింద, నేను హైకోర్టులో నాలుగు వేలరూపాయీల నామా ర్గేజి డిబెంచర్లును డిపాజిట్టు చేయుటకును, తమరు యిప్పుడు పెట్టుకొను ఖర్చులు, తాము పోగొట్టుకొనవలసిన స్థితి వచ్చినయెడల, నేను వానిని, భర్తీచేయుటకును రెండు కమిటీలును తీర్మానము చేసికొనిరి. దీనికి నే నంగీకరించి వారికి ఉత్తరము వ్రాసియిచ్చితిని. ఉభయపార్టీలు ప్రివికౌన్సిలుకు ప్రత్యేక ప్రత్యేకముగ అప్పీళ్లుచేయదలచినారు. అప్పీలుకు లీవు పిటిషనులు పెట్టినారు. ఈ రెంటిలోను, లా పాయంట్లు యిమిడియున్నవి గనుక, హైకోర్టువారు, తప్పక పెర్మిషను యిచ్చెదరు. నేను యీ కేజు పర్యవసానమును వినుటకు ఒక వేళ జీవించక పోదు నేమోగనుక, నే నీగ్రంధాంతమందు అచ్చు వేసిన ఉయిలుకు, పైకమిటీల తీర్మానము ననుసరించి, నా యెస్టేటు ట్రస్టీలగు కొవ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠమువారు జరిగించక తప్పదు.

మా గోపాలకృష్ణయ్యగారు మరియొకయుద్ధరంగములో దిగవలసివచ్చినది. వేంకటేశ్వరరావు పంతులుగారి ఉయిలులో నున్న ధర్మములన్నిటికి లోబడి, ఆయనవారసులలో మరియొకరు, ఒకవితంతువునకు దత్తపుత్రడగుటచే అతనే యెక్కువ సమీపవారసని, అతని మైనారిటీలో, అతని దత్తతల్లి,

బొమ్ములూరు కాపరస్తుడు లింగం నాగభూషణంగారికి, యీ యస్టేటును విక్రయించినది. సదరు నాగభూషణంగారు, కైలాసరావు అనే ఆయనకు తిరిగి విక్రయకంట్రాక్టు వ్రాసియిచ్చియు, తనహక్కును, మనగోపాలకృష్ణయ్యగారికి రాజీగా వదిలివేసెను. దరిమిలాను పైదత్తుడు, మేజరైన తరువాత తనదత్త తల్లి చేసిన క్రయము తన్ను బాధించదని, తనహక్కును నరసారావుపేట జమీందారుగారికి అమ్మివేసెను. ఇట్లుండగా పై క్రియదారు లెవరును లేటు వేంకటేశ్వరరావుగారి వారసులే కారనియు, తానొక్కడే సమీపవారసుననియు, ఆయన మేనల్లుడు పచ్చరాజు సుబ్బారావుగారి వాదన. సదరు జమీందారుగారు, కైలాసరావుగారు, సుబ్బారావుగారు, విడివిడిగా బెజవాడ, యేలూరు సబుకోర్టులలో దావాలు జరుపుచున్నారు. వీని పర్యవసానమెట్లున్నను, యీమృతనష్టపు ఆస్తి, ధర్మములకే వినియోగింపబడును గాని, మన గోపాలకృష్ణయ్యగారి వంశమనుభవించునని నాకు తోచదు.

---

# అధ్యాయము ౧౦

## సాంఘిక రాజకీయాభిప్రాయములు

ఆ 1878 సం॥లో నేను రాజమహేంద్రవరము గవర్నమెంటుకాలేజిలో,నాల్గవఫారములో చేరినప్పటినుండియు, కందుకూరి వీరేశలింగంపంతులుగారు మాకుపాధ్యాయులుగానుండి యొక్క తెలుగే గాక మరికొన్ని గ్రంథములలోకూడ పాఠములను చెప్పుచుండిరి. ఈయన మెట్రిక్యులేషన్ ప్యాసై ధవళేశ్వరము స్కూలులో హెడ్డుమాస్టరుగానుండి కాలేజికి ఉపాధ్యాయుడుగా అప్పుడేవచ్చిరి. ఈయన యలవాటును బట్టియు, మేము పాఠములను సరిగా వల్లించకపోబట్టియు, క్లాసులో యేవియో లోకాభిరామాయణములలో దింపేవారము. మాకోమలమనస్సులకు నాటునట్లు మాకు ఉగ్గుపాలతో సంఘసంస్కరణలను గురించియు, సాంఘిక మూఢవిశ్వాసములను గురించియు చిత్రవిచిత్రముగ యీయన ఉపదేశించుచుండిరి. పూర్వపురాతిబొమ్మల నన్నిటిని బ్రద్దలుకొట్టుటే యీయన పరమావధి. ఆంధ్రకవుల అతిశయోక్తులు అలంకారములు యీయనకు తలకెక్కవు. వాని నెల్లపుడు యీసడించేవారు. సంస్కృతనాటకములను యాంధ్రీకరణముచేసి మాకు వినిపించేవారు. స్వకపోలకల్పితములగు ప్లీడరునాటకము మొదలైనవి మాచేత ఆడించేవారు. ఈయన కలమునకు అడ్డుతగిలేవారు

లేకపోయిరి. ప్రతివారము, వివేకవర్ధనిలో నిరాఘాటముగ సాంఘికాచారములను ప్రహసనముల మూలమున విమర్శించే వారు. ఆ1881 సం॥లో వితంతువివాహములు శాస్త్రసమ్మతము కావని అనేక గొప్పపండితులు, యీ నిరుపమాన యాంధ్రపండితునియందుండు గౌరవముచేతనే యీయనను ఒప్పించుటకు, విజయనగరం మహారాజావారి బాలికాపాఠశాలలో సమావేశమై యీయనతో ప్రతివారము బహిరంగ సభలలో చర్చలు జరిపిరి. తుదకు వీరి వాదనలను విని, వానిని ఖండించుచు యీశ్వరచంద్రవిద్యాసాగరులవారి యభిప్రాయములే సరియని త్రికరణశుద్ధిగనమ్మి 1882వ సంవత్సరములో ప్రథమవితంతువివాహమును మిక్కిలి వైభవముతో లక్షాధికారి యగు పైడా రామకృష్ణయ్యగారిచ్చిన ద్రవ్యముతో జరిపిరి. మా కాలేజి బాలురందరము, వివాహమునకు వెళ్లితిమి. వివాహముజరిపిన పురోహితుడు, మా మండపేట కాపరస్థుడే. ఆరాత్రి మాయింటివద్దనే పండుకొని, మరునాడు యెవరికి కను పడకుండ వెళ్లిపోయినాడు. మాపంతులుగారిమాట కెన్నటికిని అడ్డుచెప్పక ఆకాలములోనున్న మేము 500 మంది విద్యార్థులము ప్రతివీధిలోను, సందులోను, ఆయన కెట్టి హానియు కలుగకుండ లాటీకర్రలతో జాగరణచేసితిమి. మేమా పునర్వివాహదినములలో అక్కడ భోజనముచేసినను తాంబూలము పుచ్చుకొన్నను మమ్మును వెలివేయుటకు సాధ్యపడక పోవుటచే, పెద్దలు చేయునదేమియు లేక మిన్నకుండిరి. కొందరు

పెద్దలు మొదట ఆయనతో చేరిరిగాని ఒక్క బసవరాజు గవ రాజుగారు తప్ప తక్కినవారు ప్రాయశ్చిత్తము చేయించుకొనిరి. మాలో కొందరము కాలేజిలో రోడ్డుప్రక్కనున్న చెట్లకొమ్మలకు మాయజ్ఞోపవీతములను తగిలించి మార్గస్థులను వృథాగా కవ్వించుచు మాసంఘసంస్కరణాభిలాషను ప్రకటించుకొనుచుంటిమికాని యింగితజ్ఞానముతో శాస్త్రపరిశోధనచేసి కాదు. మాచిన్నతనపు ఊహలకును చేష్టలకును మాకిప్పుడు నవ్వువచ్చుచుండును. మాలపల్లెలో కాపురముండుటకు ప్రయత్నించితిమి. పండితశివనాథశాస్త్రిగారు వర్ణములనుగురించి తనవాగ్జాలమును కురిపించగా, యిండ్లలో యెవ్వరితోను చెప్పక కలకత్తాకు ఆయనతో ప్రయాణముకాగా ఆయనే మమ్మును వారించెను. శంకరస్వాములవారు 1882 వ సంవత్సరములో మారాజమహేంద్రవరము వచ్చినపుడు ఆయన శిష్యులలో కొందరు అవినీతిపనులు చేయగా గోదావరినదిలో వారిని మెత్తగా దంచితిమి. అప్పుడు స్వాములవారు యిక యీగ్రామమునకు రానని ఒట్టుపెట్టుకొని వెళ్లిపోయిరి. తిరిగి యెన్నడు రాలేదు.

ఆ 1884 సంవత్సరమాఖరువరకు మేము కాలేజిలో లొల్ల రామశాస్త్రిగారి యొద్ద యాంధ్రము నేర్చుకొనుచుండినను మా వీరేశలింగంపంతులుగారి వెంటనంటియే యుండి, ఆయన యాంధ్రీకరించిన నాటకములు, సంధివిగ్రహములు, అచ్చతెలుగు భారతము మొదలగు కావ్యములు, మేమంద

రము ప్రతిదినము చూచుచున్నవారిని సత్యముగా చిత్రించి వ్రాసిన ప్రహసనములు, వివేకవర్ధనిలోని ఆయన నిరుపమానమైన వ్యాసములు, మా కనుదినము అమితానందమును కూర్చుచునే యుండెను. మేమందరము అనుష్ఠానములో కొంతవడుటచే సంఘము వదలకుండ సంస్కరణలను ప్రవేశపెట్టవలయునని యభిప్రాయపడజొచ్చితిమి. నేను చెన్నపట్టణము వెళ్లిన తరువాత పంతులుగారు బ్రాహ్మమతమును పుచ్చుకొని యజ్ఞోపవీతములను హైందవకర్మకాండను త్యజించి తమ్మును గురుభావముతో పూజించుచున్న పునర్వివాహసంఘమువారినందరిని త్రోసిపుచ్చుట మాలో బహుమంది సంఘసంస్కరణవాదులకు వెగటుగ తోచినమాట వాస్తవము. గురుపీఠాధికారి అన్యమతమును స్వీకరించుటవలన యీ పునర్వివాహదంపతులు చెట్టులేని పక్షులవలె యెవ్వరి యిష్టము వచ్చినట్లు వారు ప్రవర్తింపవలసి వచ్చెను. తమ పూర్వపు సంఘములో వీరికి స్థానము లేకపోయెను. నూతనసంఘమును హైందవయంగాకృతిలో యేర్పడఁ జేసికొనలేకపోయిరి. కర్మను పట్టుకొని పీకులాడువారు కొందరు, కర్మను విసర్జించివేసెదమని కొందరు, త్రిశంకుస్వర్గములో కొందరు నుండిరి. వీరికి ఒక సాంఘికవిధానమును కలుగఁజేసినవారు లేకపోయిరి. కాని రాను రాను, ఆయన విధానమే, మనస్సాక్షి కనుగుణ్యాముగ నుండవలె ననుకొన్నపుడు అనుసరించవలసిన దనియు, నాలుగు అయిదు వేలేండ్లక్రిందట లిఖించిన గ్రంథములు నేటివరకును

సాంఘికవిషయములలో పరమప్రమాణములుగ నంగీకరించుట పాడికాదనియు, నేను అభిప్రాయపడితిని. నేను భోగముమేళ ములకు వెళ్లనని అదివరకే ఆయనయొద్ద ప్రమాణము చేసి యుంటిని గనుక, నేను చెన్నపట్టణము వెళ్లిన తరువాత పార్థ సారధి కోవెలలో జరుగు అవినీతికరములగు పనులను గురించి టీచర్సు కాలేజీలో నున్నపుడు, కోమలేశ్వరన్ పేట మొదలగు స్థలములలో ఉపన్యాసము లిచ్చుచుంటిని. వీనిని "స్టాండర్డు" అను ఆంగ్లేయపత్రికలో ప్రచురించుచుండిరి. దివాన్ బహద్దరు రఘునాధరావుగారు, ఆచరణలో కొంఅవడెనని నేను మెయిలు పత్రికకు 1888 సంవత్సరములో వ్యాసములు పంపగా, వానిని సంపాదకుడు కోపముతో తిరుగగొట్టినాడు. వీరేశలింగంపం తులుగారు స్నేహితుడగు మన్నవ బుచ్చయ్యపంతులుగారు అనేక స్మృతులను ఆంధ్రములో ననువదించగా, వానిని కొని చదివి ఉపన్యాసము లిచ్చుచు వ్యాసములు వ్రాయుచుంటిని. మా రెంటాల- సుబ్బారావుగారు, నేను వెళ్లినంతదూరము పోవుటకు సందేహించినను మొత్తమువిూద నాతో నేకీభవించి పచ్చియప్ప కాలేజిలో ఒక మహోపన్యాసమును కావించెను. ఆయన రాజకీయవిషయములలో నార్టను మొదలగు యోధాను యోధు లుండగా ఒక్కసారియే ఉపన్యసించిరి. దానిని విన్న వారు యీ దినమువరకు యెవ్వరును మరువరు. తన ఘనమగు వక్తృత్వమును సమయము వచ్చినప్పుడు చూపగలననే విష యము చాటించుటకు మాత్రమే ఆమహోపన్యాసమును నిరర్గళ

ధారతో కావించిరి. అప్పుడున్న మహావక్త లందరు ఆంగ్లేయ భాషలో ప్రజల మనస్సుల నిట్లు నుత్తూత లూగించగల శక్తి యీయనకు తప్ప, మరి యెవరికిని కలుగదని ఒప్పుకొనిరి.

నేను బందరు వచ్చిన తరువాత జరిగిన చోడవరపు జగన్నాధరావుగారి వితంతూద్వాహమును గురించి యిదివరకే వ్రాసితిని. మా వీరేశలింగంపంతులుగారి బ్రాహ్మమతములోని యేకేశ్వరోపాసన కూడ అనవసరమని నాకు తోచినది. స్వామి దయానంద సరస్వతులవారి సత్యార్థప్రకాశికను సాంతముగా చదివితిని. ఆయనయొక్క ఆర్యసామాజికసూత్రములు చాలా భాగము హేతుపూర్వకములై యున్నను, వీరు వేదములను మాత్రము అపౌరుషేయము లనియు, ప్రామాణికములనియు వాదించుట కూడ నాకు నచ్చలేదు. ప్రపంచములో యేవ్యక్తి కాని, యేగ్రంథము కాని పరమప్రమాణముగ నెంచక స్వానుభవమునకు సహేతుకరమైనదానినే మన యాచరణకు పునాది యని నేను నమ్ముచున్నాను. ప్రతి నైతికసూత్రము, సంఘ పరిణామమువలనను, లోకానుభవమువలనను నేటివరకు నిలబడుచున్నది గాని దానిని యీశ్వరు డొకడు మన మనఃఫలకముల మీద వ్రాయలేదని నాకు మొదటినుండియు అభిప్రాయము. నేను బి.యే. లో గణితశాస్త్రముతోపాటు మానసికశాస్త్రము, కొంత వేదాంతము చదువవలసి యుండెను. అన్యమతములు, ఊహలు, వెర్రినమ్మకములమీద, అహింసాసత్యములు మొదలగు ధర్మసూత్రముల నాధారపరుపక, ప్రపంచములో వాని

యుత్పత్తి పరిణామములకు సహేతువుల నన్వేషించునపుడే అట్టి ధర్మములలోని స్థూలసూక్ష్మములు గోచరించును. మన మనో బుద్ధుల కగోచరములై ఊహాప్రపంచము నాధారము చేసికొని యితరులు చెప్పు పొడిమాటలయందు నాకు నమ్మకము పోయినది. కాని సంఘమును బొత్తిగా వీడినయెడల నాకు మరియొక సంఘము దొరకదనియు, నేను చెప్పు మాటలు ముక్కు కోసికొన్నవాని పలుకులవలె నా సోదరులు పెడచెవిని పెట్టెదరనియు యెంచి, ఉన్న సంఘములోనే యుండి దాని లోని అంతశ్శుచి, బాహ్యశుచులతో సంబంధించిన విషయము లను గ్రహించుచు తక్కిన కర్మకాండను సంఘము సహించి నంతవరకు వదలివేసితిని. దైవమును ప్రార్థించినంతమాత్రమున మనము తరించుమని నమ్మితిని. కొంతకాలము పితరులకు తద్దిన ములు పెట్టి, నేనే మంత్రములను చదువుకొని, నేతిబీరకాయ బ్రాహ్మణులకు అర్పించి, తుదకు చటకము (అగ్నిహోత్రము) లో పిండములను వ్రేల్చి, ప్రాణము విసిగి యివి యన్నియు నిరుపయోగములనియు నా పితరులు చనిపోయి యేబదిసంవ త్సరములైనను నే నిచ్చిన అన్నముమెతుకులు, నీళ్లు స్వీకరిం చుట అబద్ధమనియు యెంచి, ఛీదాగా యీ తద్దినములను వదలి వేసితిని. ఇక మిగిలిన శ్రౌతస్మార్తకర్మకాండ లేవియు నాకు లేవు. సనాతనధర్మవాదుల శ్రుతిస్మృత్యాది యాయుధముల తోడనే మన ప్రస్తుతాచారములు సృష్ట్యాదినుండియు యున్న వను వారి పిడివాదనను ఖండించుచు వర్ణాశ్రమధర్మపరిణామ

మను ఒక చిన్న గ్రంథమును వ్రాసితిని. "మనస్స్వాతంత్ర్య" మను గ్రంథము మూఁడు చిన్న సంపుటములుగా వ్రాసి ముద్రింపించితిని. "వేదకాలపుస్త్రీలు," "స్మృతికాలపుస్త్రీలు" అను విమర్శనగ్రంథములను, జటావల్లభుల పురుషోత్తం యమ్. యే. గారిచేత వ్రాయించి అచ్చొత్తించితిని. ఇంకముందు నేను జీవించు కొద్దికాలములో యీమాదిరి గ్రంథములను అచ్చు వేయించ దలచుకొన్నాను. సంపూర్ణ మనస్స్వాతంత్ర్యవాదు లందరు (Free Thinkers) నాకు తోడ్పడుదురు గాక. ఇప్పటికి వెలువడిన గ్రంథముల పట్టీపై పుటమీఁద అచ్చొత్తించబడియున్నవి.

ఇక రాజకీయవిషయములలో, మన వైస్రాయి రిపన్ గారు, మనకు స్థానికప్రభుత్వము నిచ్చిరని వారు యీ దేశము నుండి పోవునపుడు రాజమహేంద్రవరములో గొప్ప యుత్సవము జరిపితిమి. తరువాత చెన్నపట్టణములో బి. యల్. క్లాసులో చదువుచున్నపుడు 1887 వ సంవత్సరములో మూఁడవ కాంగ్రెసు జరిగినది. ప్రతిదినము, గ్రాడ్యుయేట్లకు ఉచితముగా టికెట్లు యిచ్చిరిగనుక కాంగ్రెసు చూచుటకు వెళ్లుచుంటిమి. బద్రుడ్డీన్ తయాబ్జి, ఉమేష చంద్ర బానర్జి, డాక్టరు త్రైలోక్యనాథ మిత్తరు, కాళీచరన్ బానర్జి, సురేంద్రనాద్ బానర్జి, చంద్రావర్కరు మొదలగు పెద్దలును, బిపిన్ చంద్రపాల్, మదన్మోహన్ మాలవ్య మొదలగు చిన్నలు చేసిన ఉపన్యాసములు విన్నపుడును మాకు ఒడలు కంపరమెత్తుకు పోయినవి. సుమారు మావయ

స్సులోనే యున్న బిపిన్ చంద్రపాల్ గారి ఆయుధధారణస్వాతం త్ర్యముమీఁది యుపన్యాసమును, మదనోమ్మోహన్ మాలవ్యగారి శాసనసభాస్వాతంత్ర్యము మీఁదను యిచ్చిన యుపన్యాసమును, అప్పుడు విన్నవారి కింకను చెవులలో గింగురుమన్నట్లే యుం డును. కాంగ్రెసుహాలు విడిచిన తరువాత కూడ వారివెంట నంటుచుంటిమి. వారి ననుకరించుటకు, ప్రయత్నించుచుంటిమి. మాకోమటి బంగాళాలో ఒకసంఘమును స్థాపించి, అక్కడకు వచ్చిన కొద్దిమందియే కాంగ్రెసు అనుకొని, గోడల కేసి చూ చుచు; సురేంద్రనాద్ బానర్జిలాగున గొప్ప గొంతుకతో అర చేవారము. మా కేమియు సిగ్గు జంకులేదు. తిండితినకుండా యిది యే పని. వార్తాపత్రికలలో వారి ఉపన్యాసములు చదివి, కంఠ పాఠముచేసి, చేతులు వారివలెనే త్రిప్పుచు, గట్టిగా అరచుచు వారిని అనుకరించేవారము. మాలో నే నొక మొనగాడను. బందరు వచ్చినతరువాత యీజోరంతయు చచ్చినది. జిల్లాకాన్ఫ రెన్సులకు పోయి ఆంధ్రములో ఉపన్యసించుట మొదలిడితిని. కాశీ, కలకత్తా, సూరతుకాంగ్రెసులకు డెలిగేటుగా పోయి, మితవాదులతో చేరక, తిలకమహారాజు శిష్యుడనై యుంటిని. నేను కోరకుండానే, బెర్లినునుండి, మాజాతీయవాదులకు తళ్వారు పత్రిక యుచితముగానే రా మొదలిడినది. న న్నెక్కడ పట్టు కొందురో యని, అది సొంతముగ చదివి తగులబెట్టుచుంటిని. 1905 వ సంవత్సరమునుండియే, విదేశిగుడ్డను మానివేసి, స్వదేశపుమిల్లు బట్టలను ధరించుట మొదలిడితిని. బంగాళా

విభజన కాలమునుండియే, స్వదేశవస్త్రావలంబనము, జాతీయ విద్య, స్వారాజ్యసంస్థాపనము, విదేశవస్తుబహిష్కారము నను నాలుగు విషయములలో ఆందోళనము బయలుదేరినది. ప్రార్థనాపూర్వకమగు తీర్మానములు ఆమూడు కాంగ్రెసుల లోను, తరువాత యేటేటజరుగుచుండినజిల్లాకాన్ఫరెన్సులలోను, ప్రభువులకుపంపుట మానివేయబడినవి. తరువాత తిరిగి తిలకు మహారాజు ప్రవాసమునుండి వచ్చిన తరువాత, అమృతసరు కాంగ్రెసునకును, ఆయన చనిపోయిన పిమ్మట మహాత్మగాంధి గారి చేతులలోకి వచ్చిన అహమ్మదాబాదు కాంగ్రెసునకును, పోయి యుంటిని. పై యిద్దరు నాయకుల యభిప్రాయములు, అహింససూత్రావలంబనము గురించి, అమృతసరు కాంగ్రెసులో సంఘట్టన జరిగినది గాని, పరశురాముడు శ్రీరామునికి లోబడినట్లు తిలకుమహారాజు గాంధిగారి విధానమునకు తల యొగ్గెను. అటుపైన యేకాంగ్రెసుకును పోజాలక మహాత్ముల వారిని నాశక్తికొలది అనుసరించుటకు మొదలిడి, ఖద్దరుబట్ట లనే ధరించుచు, ప్లీడరీవృత్తిని మానివేసితిని. మహాత్ముల వారిని మొదట నెల్లూరు ప్రావిన్షల్ కాన్ఫరెన్సు 1911 వ సంవ త్సరములలో జరిగినపుడు కలిసికొంటిని. అంతకు పూర్వము నిడదవోలులో జరిగిన కృష్ణాడిస్ట్రిక్టుకాన్ఫరెన్సులో, బంగాళా విభజనము రద్దై, ఒరిస్సా బేహారురాష్ట్రములను గవర్నమెంటు వారు కలిపినపుడు నేను తూర్పుజిల్లాలను మధ్యరాష్ట్రములలో

కలపి, ద్రావిడులతో సంబంధము లేకుండ చేయవలెనని తీర్మానము పెట్టితిని. అప్పుడు కొందరు యువకులు, దత్తమండలముతో చేరి, మన యాంధ్రుల మందరము ఒకే రాష్ట్రముగ చేయుటకు, ఆందోళనముచేసిన బాగుండుననియు, క్రమక్రమముగా, నిజామురాష్ట్రములో తూర్పు అయిదు తెలుగు జిల్లాలను, మధ్యపరగణాలలో తెలుగు జిల్లాలను మనము కలుపుకొనుటకు సావకాశము లేర్పడుననియు చెప్పుటచేత, నేను దీని నంగీకరించి, మనకును అరవలకును జరుగుచుండిన నెల్లూరు ప్రొవిన్షల్ కాన్ఫరెన్సుయొక్క విషయనిర్ధారణసభలో ఆంధ్ర రాష్ట్రనిర్మాణావశ్యకతను గురించి ఒకతీర్మానము ప్రవేశపెట్టితిని. బులుసు సాంబమూర్తిగారును, ముట్నూరి కృష్ణారావుగారును, దానిని బలపరిచిరి. కాని, న్యాపతి సుబ్బారావుపంతులుగారును, మోచర్ల రామచంద్రరావుగారును, దాక్షిణాత్యులతో కలసి రెండుమూడు వోట్లభేదముతో, నా తీర్మానమును త్రోసివేసినారు. అరవలలో మంచివా రనేకమంది యున్నను, నాకు మొదటినుంచి వారి భాషయన్నను వారన్నను బొత్తిగా కిట్టదు. మొత్తమువిూద వారి పిసినారితనము, స్వార్థగుణము, టక్కరితనము, పిరికితనము అశుభ్రత, కొన్ని వెకిలిఆచారములు నాకు యేవగింపుకలుగజేయు చుండినవి. గాంధిగారితో వీరి చర్యలను, నేను, సాంబమూర్తిగారును, కృష్ణారావుగారును వెళ్లి చెప్పుకొనగా, ఆయన దేశమును భాషలను బట్టి విభజించుటవలన, పరిపాలనము దేశభాషలలోనే సులభముగ ప్రజల

చేత జరిపించబడవచ్చునసియు తన సూత్రముల నవలంబించిన, యేగవర్నమెంటు అక్కరనే లేదనియు, ఉద్యోగములకు తంటాలు పడు యీ పెద్దలకు యీరాష్ట్రవిభజనమును గురించి ఉపదేశించుటకంటె, తెలుగువారము, అరవము నేర్చుకొని అరవజిల్లాలలో వారికి ప్రత్యేకరాష్ట్రముండుట మంచిది యని ఆందోళనము చేసినయెడల, వారు దీనిలోనున్న సదుపాయములు తెలుసుకొని యీయరవనాయకులకు వారే త్రోసి రాజు చెప్పెదరనియు సలహాయిచ్చిరి. ఆయన దక్షిణఆఫ్రికాలో రెండుమూడు భాషలలో తమ అప్పీళ్లను ప్రచురించుచుండిరట. ఆదినమునుండి మేము ద్రావిడులకు విడియాకు లిచ్చి వచ్చితిమి. అప్పుడునూతనముగా రాజకీయరంగములో ప్రవేశింపదలచిన యస్. శ్రీనివాసయ్యంగారును, నేను తలపడితిమి. వీరును, వీరి అరవ సోదర్లును, మన నెల్లూరు వచ్చి తెలుగు తెలియక ఆంగ్లేయములో మాట్లాడుట హాస్యాస్పదముగా నున్నదని అప్పుడు హాజరుగానుండిన ఆనీబెజంటుగారి న్యూ యిండియాకు వ్యాసము నేను పంపితే ఆమె యీ విషయముతప్ప ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతనుగురించి వ్రాసిన తక్కిన భాగమును మాత్రము ప్రచురించినారు. తక్షణము మేము అరవలతో విడిపోయి ప్రత్యేక ఆంధ్రాకాన్ఫరెన్సు 1913 సంవత్సరము మెయి మాసములో బాపట్లలో జరిపితిమి. నేను నానాదేశ రాజ్యాంగచరిత్రమును వ్రాసి అచ్చు వేయించితిని. అంతకు పూర్వమే కృష్ణా విశాఖపట్టణముడిస్ట్రిక్టు కాన్ఫరెన్సులలో యీయాంధ్రరాష్ట్ర నిర్మా

గావశ్యకత వాంఛనీయమని తీర్మానములు చేయబడెను. నేను, ముట్నూరి కృష్ణారావుగారు, కొండా శ్రీరామశాస్త్రి మొదలగువారు దత్తమండలము, నెల్లూరు, అనంతపురంజిల్లాల ముఖ్యపట్టణములలో యీ విషయమునుగురించి ఉపన్యాసము లిచ్చుచు ప్రచారము కావించితిమి. తరువాత బెజవాడ, కాకినాడ, విశాఖపట్టణముల ఆంధ్ర ప్రొవిన్షల్ కాన్ఫరెన్సులలో క్రమక్రమముగా యీ తీర్మానమునకు యెక్కువబలము చేకూరి ఆచరణలో పెట్టుటకు గొప్ప యాందోళనము జరిగినది. 1914 లో యూరపుమహాసంగ్రామము మొదలుపెట్టగానే ప్రజలకొరకు అంతర్జాతీయ ధర్మశాస్త్రమును వ్రాసితిని. 1920 వ సంవత్సరములో మహాత్ములవారి సత్యాగ్రహోద్యమము బయలుదేరగానే ఆంధ్రోద్యమము కొంతకాలమడుగంటినది. ఆయన బందరుకు వచ్చి యుద్బోధ కావించగానే ప్లీడరీవృత్తి మానుకొని, తిలకునిధికి గుడివాడ, దివిసీమలలో తిరిగితినిగాని, మా డాక్టరు పట్టాభి శీతారామయ్యగారికి గలిగిన యుత్సాహము నాకు లేక, నేను వెనుకంజవేయుచునే యుంటిని. పారలెల్ గవర్నమెంటు వచ్చునని నా కెంతమాత్రము ఆశలేదు. గాంధివిధానమందంతకును నాకు నమ్మకము పుట్టలేదు. ఈ విధానము స్వతస్సిద్ధముగా మంచిదే. నిరాడంబరజీవనము, ఉత్కృష్టాదర్శములు కలిగించునుగాని, రాజకీయమోక్షమునకు యీ మార్గము సహకారి కాదని మొదటినుండియు నేనభిప్రాయపడితిని. ప్రస్తుతపరిస్థితులలో యిదితప్ప వేరుమార్గ

మెవరును చూపించజాలక పోబట్టియే, తిలకుమహారాజుగారును, వారి యనుచరులమైన అతివాదులమందరము యీ నిరాకరణ సూత్రము నవలంబించవలసి వచ్చినది. ఒక్క మహాత్ముడు దక్క యితర నాయకులెవరును దీనిని మతసూత్రముగ నవలంబించినట్లు కనుపడలేదు. రాజకీయస్వాతంత్ర్యములకు గాంధిగారిని మన నాయకులందరు ఉపయోగించజూచుకొనుచుండిరని నేను గట్టిగ నమ్మియుంటిని. మనోవాక్కాయకర్మలయందు అహింసా సత్యసూత్రముల నవలంబించుట, అప్పటి వీలుకొరకు తప్ప మతధర్మముగా యీ కలియుగములో సామాన్యప్రజలచే నవలంబింపజేయుట సాధ్యము కాదని నాకు తోచినది. తిలకుగారి శిష్యుడనై యుండి, ఆయన గీతారహస్యము నంతయు రెండుమూడుసార్లు పఠించిన వెనుక పై యభిప్రాయమే బలపడినది. నిరాయుధులైన ప్రజలు నిరాశచేత అరాజకులగుదురుగాని, స్వార్థత్యాగ మవలంబించి ఒక్కమ్మడిగ మొండిపట్టుకు గడంగి పన్నుల నీయకుండ సర్కారువారు పెట్టుబాధలకు లోనగుటకు శిద్ధపడజాలరని నేననుకొంటిని. దీనికి నిదర్శనముగా మహాత్ముడు అహమ్మదాబాదుకాంగ్రెసులో కొండా వెంకటప్పయ్యగారు, గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు మొదలగువారు గుంటూరులో శాసనధిక్కారము ప్రయోగించెదమని చెప్పినప్పుడు తాను ఒక్క బార్డోలీ తాలూకాలో దానిని ప్రవేశపెట్టి చూచెదననియు, తరువాత యట్టి పరిస్థితులున్న చోటుల నవలంబించవచ్చుననియు నెంత చెప్పినప్ప

టికి గుంటూరుజిల్లా మొదలగు ప్రదేశములలో దానిని ప్రవేశ పెట్టిరి. బలవంతముగా కరిణీకములను మాన్పించుట నేను స్వయముగా యెరుగుదును. తుదకు మహాత్ముడు ఒక్కజిల్లాలోనైనను యీసూత్రమును జయప్రదముగ అమలులో పెట్టకుండ చేయుటకు మనమే కారకులమైతిమి. దేశమంతయు ఒపిక పట్టలేకపోయినది. మన వాలంటర్లే ఆగ్రహముతో జీవించి యున్నవారిని అగ్నిహోత్రములో పడవేసి చౌరీచౌరాలో ఘోరమైన హత్యలు కావించిరని ఆయన కొమారుడే తంతివార్త నంపగా తనపన్నుల నిరాకరణసూత్రమును అమలులో పెట్టక ఆపుచేసి దేశములో జరిగిన హత్య లన్నిటికిని తానే జవాబుదారునని చెప్పుకొని జయిలుకుపోయెను. నేను తిలకు మహారాజులవారి చతురోపాయములలో దండోపాయము లిప్పటి పరిస్థితులలో పనికిరావని ఆంధ్రపత్రికకు వ్యాసము వ్రాయగా యీ విషయము నాతో సదా చర్చించుచు, బి. ఏ. లో చరిత్రను చదువుచుండిన నా రెండవ కుమారుడు రామమోహన్ నాకు తెలియకుండా ప్రపంచములో అదివరకు విప్లవములు అనేకము జరిగి స్వాతంత్ర్యము సంపాదించుకొన్న ప్రజలు రక్తపాతము లేకుండ తమ కార్యములు నిర్వహించజాలనట్లు ప్రపంచానుభవముండగా దానికి వ్యతిరేకముగ నడపు గాంధిగారి విధాన మెన్నటికి జయప్రదము గాదని, ఆ సంచికలోనే మరియొక వ్యాసము వ్రాసెను. ఈ రెండు వ్యాసములును కాకతాళీయముగ ఒక్కసారే ఆపత్రికలో పడగానే

మా నాగేశ్వరరావుగారికి ముందుగా వారంటును గవర్నమెంటు వారు జారీ చేసినట్లు నాకు చెన్నపట్టణమునుండి తంతి వచ్చినది. మే మిద్దరము దస్కతులు చేసినవే గనుక, అసల్లను, సెర్చి జరుగుటకు ప్రారంభించకముందే పోలీసువారిచేతికి వానిని పత్రికాసంపాదకు లిచ్చివేసిరి. నేను రామదాసుగారికి వ్రాసి, కార్యనిర్వాహకసభ్యుడైన సి. పి. రామస్వామిఅయ్యరుగారితో మాట్లాడి కుఱ్ఱవాడు చిన్నతనముచే వ్రాసెననియు, అతనికి మూర్ఖగుణ ముండుటచే మనోతీవ్రతవలన అట్టి వ్యాసమును వ్రాసెనుగాన క్షమించవలసిన దనియు చెప్పమంటిని. అవసరమైతే నేను వచ్చెదనంటిని. మా నాగేశ్వరరావుగారు పిల్లవాని వ్యాసమంతయు, వివిధరాజకీయమార్గముల చర్చయేగాన, దౌర్జన్యము ప్రస్తుతము జరిగించవలసినదని పురికొల్ప ప్రయత్నించ లేదనియు, తాను క్షమాపణ యీయననియు పట్టుబట్టెను కాని, ఇంతలోనే, ప్రాసిక్యూషన్ ఆర్డరులోని తేదీ పొరబాటున తప్పు పడుటవలన, తిరిగి కార్యనిర్వాహకసంఘములో నూతన శాంక్షను చర్చకు వచ్చినపుడు, జస్టీసుమంత్రి వర్గమువారే కొద్దిగా పత్రికలో, సదరు పిల్లవాని వ్యాసము పొరబాటుగా ముద్రింపబడినదని వ్రాయునట్లును, ప్రాసిక్యూషన్ తీసివేయబడునట్లును తీర్మానము కావించిరి.

మహాత్ములవారు ప్రవాసశిక్ష కొంతకాలమనుభవించిన పిమ్మట విడుదలచేయబడిరి. అప్పటినుండి 1930 వ సంవత్సరము వరకు దేశములోనంతయు నిర్మాణకార్యక్రమమును ప్రవేశ

పెట్టి పనిచేయుచు, తానే స్వయముగా లవణశాసనోల్లంఘనము కావించుటకు ది 12-3-1930 వ తారీఖున 'సబర్మతీ' యాశ్రమమునుండి సముద్రముఒడ్డున నున్న దర్శగ్రామమునకు డెబ్బదిమంది యనుచరులతో బయలుదేరెను. నేను కాళ్లనొప్పులు మంటలను కుదుర్చుకొనుటకు, అంతకు పూర్వమే కోవూరునుండి బయలుదేరి ది 14-3-30 తారీఖున కూనూరులో ప్రవేశించితిని. లవణసత్యాగ్రహము ముమ్మరమై చెన్నపట్టణములో మా నాగేశ్వరరావు ప్రకాశంగార్లను అరెస్టు చేయగానే, నేను పట్టణమునకు గాని, లేక సరాసరి బందరకు గాని ప్రయాణముకట్టగా, డాక్టరు అడ్డుతగిలినాడు. ఆగష్టువరకు నేను కొచ్చిన్ మహారాజుగారి హాస్పటలులో చప్పిడిపథ్యముతో ఉండవలసి వచ్చి, సత్యాగ్రహోద్యమములో, నాసోదర్లు పట్టాభి కృష్ణారావుగార్లతో, పాల్గొని జయిలుకు పోవుట నోచుకొనక పోతినిగదా యని మిక్కిలి పరితాపము నొందితిని. నా ముఖ్యబంధువులు, స్నేహితులు జయిళ్లకు పోవుచుండగా నేను బయటనుండి చూచుచు వ్యర్థుడనై మహాత్ముని యనుచరులలో నొకడనై యుండియు పుణ్యమును సంపాదించుకొనుటకు దేశసేవ చేయలేకపోతిని గదా యను దుఃఖము యిప్పటికిని కలుగుచున్నది. గాంధియిర్విను పాక్టు రాబోవు రౌండు టేబిల్ కాన్ఫరెన్సులో వమ్మైన యెడల, తిరిగి సౌమ్యయుద్ధములో ప్రవేశించవచ్చును గదా యను గంపెడాశతో నుండగా నాకు నూతనముగా Double hernia ఒకటి సంభవించి నడవజాలక

పోతిని. నేనిక యుద్ధరంగములో సేనాముఖమున నుండుటకు అసమర్థుడ నైతిని. జయిలుకు వెళ్లి బ్రతుకజాలనని తోచుచున్నది. దూరమందుండి, ఉద్యమమును ఆశీర్వదించుటతో తృప్తినొందవలసి వచ్చునట్లు కనుపడుచున్నది. ముందు దైవము నన్ను యెట్లు నడిపించునో తెలియదు.

నాకిప్పుడు రషియా దేశములోని సమిష్టివాదులమీద యెక్కువ మక్కువ కలుగుచున్నది. అమెరికాలోని ధనవంతుల గొప్ప పెట్టుబడి వ్యాపారమునకు, రషియాలోని సమిష్టివాదపరిపాలకుల జాయంటువ్యాపారమునకును గొప్పసంఘట్టనము బయలుదేరినది. రషియాలో ప్రభుత్వమువారే, వ్యవసాయము, వాణిజ్యము, పణ్యానిర్మాణస్థానములన్నిటిని తమ చేతులలో నుంచుకొని, ప్రతి వస్తువును, లాభము వేసికొనకుండకనే అతి చౌకధరలతో ప్రపంచము నంతయు అయిదు సంవత్సరములలో ముంచదలచిరి. వారి రాజకీయ విధానమును, అక్కడిప్రజలు మిక్కిలి స్వార్థత్యాగముతో నవలంబించుటకు వారి పరిపాలకులకు తోడ్పడుచున్నారు. ప్రభువులు తమ బలము నుపయోగించికూడ మూర్ఖులను తమ దారికి తీసికొనివచ్చుచున్నారు. స్వంత ఆస్తి యనునదిలేకుండ చేయుచు, అందరును కష్టించి పని చేసినందుకు వారికి తగిన భోజనవసతులను కల్పించుచున్నారు. 18 సంవత్సరములోపు బాలురును, 60 సంవత్సరములు దాటిన వృద్ధులును, పనిచేయకూడదు. మొదటివారికి ఉచితముగ అన్నవస్త్రము లిచ్చి

విద్య చెప్పించుటకును, రెండవవారికి పెన్షనల నిచ్చుటకును కావలసిన యేర్పాట్లు చేయబడుచున్నవి. ప్రతివాడును, తన కేపూట కాపూటకు కావలసినది సావయట్లు సప్లయి చేయు చున్నపుడు, స్వార్థము, అసూయ, ఆగ్రహములు యెక్కడ నుండును ? నేరముల కవకాశ మేది ? ప్రతివాడును సంతృప్తితో సౌఖ్యము ననుభవించును. ఈ స్థితికి దేశమంతయు వచ్చు టకు నిరంకుశత్వము, దౌర్జన్యము అక్కడి పరిపాలకులుప యోగించకతప్పినదికాదు. ఇపుడు రష్యాలోనిసమిష్టిరాజ్యాంగ తంత్రమునకు, వ్యతిరేకవిప్లవము రాకుండ, తత్కాలికముగ వ్యక్తిజీవనాభివృద్ధికి అనుకూలమగు పరిస్థితులు కల్పించబడి నవి. పదునైదుసంవత్సరములనుండి, బాలురకు ఉగ్గుపాలతో యీసమిష్టివాదము ఒక మతముగా నేర్పుచుండుటవలన, యిప్పటినుండి రాబోవు తరతరములవారు దీనిని వదలుటసంభ వించదు. ఇదియే, మున్ముందు మన సాంఘికరాజకీయ మోక్ష మునకు సాదనమగును. అమెరికావారును, రష్యావారును, యంత్రసామగ్రితోనే పోటీ చేయుచున్నారు. ఈ యుభయుల విధానము భౌతిక శాస్త్రపరిశోధనలమీదనే యాధారపడి యున్నది. ఈ రెంటికిని వ్యతిరేకముగ మన మహాత్మగాంధి గారి ఆధ్యాత్మికవిధానము బయలుదేరినది. నిరాడంబరజీవ నము ఉత్కృష్టాదర్శములు కలిగి, అహింసాసత్యములమీదనే సమస్త ఉద్యమములను ఆధారపరచుకొని, మానవకళ్యాణ మునకు తోడ్పడవలసినదని మనలను మహాత్ములవారు హెచ్చ

రించుచున్నారు. మొత్తముమీద ఈయన రష్యాదేశస్థులగు టాల్స్టాయి, లెనిన్‌గార్ల యాదర్శముల నొప్పుకొందురుగాని, వారి రాజకీయవిధానమును ఖండించును. నవనాగరికతకు మహాత్ముఁడు విరోధియని యెన్నటికిని నమ్మరాదు. సమస్త యంత్రసామగ్రియు, భౌతికజ్ఞానమును, మానవకళ్యాణమునకే ఉపయోగింపచేయుటయే యీయన సంకల్పము. వానికి మాత్రము మనము దాసులము కాకూడదు. ఈయన సత్యాగ్రహవిధానములో గొప్ప సాధకుడు, అనుభవజ్ఞుడు, స్థితప్రజ్ఞుడు, సంకల్పసిద్ధుడు. ఈ యంత్రసామగ్రిని, దాని యజమానులకును, పనివాండ్రకును సమానహక్కులతో నడపవలెనుగాని, వానివలన కలుగు లాభమంతయు పెట్టుబడిదార్లకును, కూలిమాత్రము కష్టించిపనిచేయువాండ్రకును, పంచి యిచ్చుట దేశమునకు అనర్థదాయకమని యీయన తలంపు. అనేక సాంఘికవిప్లవములు బయలుదేరినగాని, యీస్థితి ప్రపంచమంతలో పాదుకొనదు. నే నిప్పుడు ప్రస్తుతము ప్రపంచములో నడుచుచున్న రాజకీయార్థిక మత సాంఘిక విప్లవములనుగురించి జనసామాన్యమునకు బోధించు చిన్న చిన్న గ్రంథములను వ్రాయించుటయే నాకు మిగిలి యున్న స్వల్పజీవితకాలముయొక్క పరమావధిగ పెట్టుకొని, యీకోవూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమును ఒక విమర్శన సంస్థాపనగ చేయదలచితిని.

---

## అధ్యాయము ౧౧

### వానప్రస్థాశ్రమము

నేను, నాభార్యా యిద్దరుకొమాళ్లతో 1895 లో బందరు ప్రవేశించితిమి. వారితరువాత ఒక కొమారుడును, ముగ్గురు కుమార్తెలును కలిగిరి. నేను ప్లీడరీవృత్తిలో ప్రవేశించేటప్పటికి యెట్టిఆస్తియు నాకు లేనందున జీవితము క్షణభంగురముగాన, భార్యాబిడ్డలు, నాయనంతరము అన్నవస్త్రములకు యిబ్బంది పడుదురని, నాజీవితమును Oriental Insurance Co., లో అయిదువేలరూపాయీలకు భీమా చేయించుకొంటిని. నెలకు పదిరూపాయీలు ప్రీమియమ్ కట్టలేనని యిన్షూరెన్సు యేజెంటుగారగు వారణాశి యజ్ఞేశ్వరుడుగారు ఆరేసిమాసములకు తానే ముందుగా కట్టి, నెలవాయిదాలమీద సదరు మొత్తమును వసూలుపరుచుకొనేవారు. ఇట్టిసహాయము నాకు కొంతకాలము ఆయన చేసినందుకు ఆయనయెడల యెల్లప్పుడు కృతజ్ఞుడనై యుందును. నేను మొదటి అయిదారు సంవత్సరములలో నిల్వచేసికొన్న సుమారు మూడువేలరూపాయీలు మారెంటాల వేంకటసుబ్బారావుగారికి తాను గొప్ప ఆర్థిక చిక్కులలో నుంటిననని వ్రాయగా పంపితిని. నాభార్య మిక్కిలి అనుకూలవతి యగుటచే నాయార్థికవిషయములను గురించిగాని, నాఖర్చులను గురించిగాని, తనకు నగలు, నాణెములు గురించిగాని యెప్పుడు నన్ను బాధించలేదు. నాసౌఖ్యమును, పిల్లలసౌఖ్యమును విచారించుకొనుటతప్ప, ఆమె యేమియు

జోక్యము కలిగించుకొనలేదు. నాకు చిన్నప్పటినుండియు పొదుపుగా నుండుటయేగాని, చుట్ట, పొడుము తాంబూలములు మొదలగు అభ్యాసములు లేవు. తేయాకు, కాఫీ, పుట్టిననాట నుండియీరోజువరకు యెట్లుండునో నాకు తెలియదు. కోర్టుకు మధ్యాహ్నము వెళ్లేటప్పుడుమాత్రము గ్రోపుడుబండియో, బైసికిలో, జట్కాబండియో ఉపయోగించి తిరిగి వచ్చేటప్పుడు కాలినడకయే. అందరితోపాటు అప్పుడప్పుడు స్వల్పచందాల నిచ్చుటయేగాని, మొదటి పదిసంవత్సరములలో నేనంతగా పెద్దమొత్తములు దానమీయలేదు. నేనెల్లప్పుడు విద్యార్థులకు నెలచందాలిచ్చుట, వారములిచ్చుట, కాలుచేతులు కళ్లు కలిగి బలిష్టులైనబ్రాహ్మణులకును యితరులకును ముష్టిపెట్టుట మిక్కిలి యేవగించుకొనుచుంటిని. కాబట్టి నేను పిసినారినని అందరు అనుకొనేవారు. అయిదారు సంవత్సరములు గానసభలు జరిపి, నాచేతిడబ్బు కొంచెమెక్కువగా ఖర్చుచేయవలసివచ్చినది. నాకొమాళ్ల వడుగులు కోవెలలోగాని, యింటివద్దగాని ఒక పూటలో ముగించుచుంటిని. నాకొమాళ్ల వివాహములకు నేను వరకట్నమెంతమాత్రము పుచ్చుకొనలేదు. కొమార్తెల పెండ్లిండ్లకు వరకట్నములు యీయనక్కరలేకుండ భగవదానుగ్రహమువలన నాకు అల్లుళ్లు దొరికిరి. నేనే నాకోడళ్లకును, కొమార్తెలకును నాకు తోచినంత యిచ్చితిని.

ప్లీడరీలో వీలైనంతవరకు నేను న్యాయముగా ధనము నార్జించితిని. నా పుణ్యావశమున బ్రతికిచెడిన సాంప్రదాయ

కుటుంబములో చేరి తన పినమామగారిచేతనే అరెస్టు అయి కోర్టుకు తీసికొనిరాబడిన భాగవతుల పిచ్చయ్యగారిని నేను విడిపించి, ఆయన జ్ఞాతియైన, ప్లీడరు సుబ్రహ్మణ్యముగారి శిఫారసుమీద నేను నా గుమాస్తాగా యేర్పరచుకొంటిని. ఈయన మంచి తెలివి గలవాడు. నా కుడిభుజమువంటివాడు. న్యాయమార్గమును తప్పనివాడు. ఉదారస్వభావము కలవాడు. ఈయనను నాకు మిత్రునిగను, సోదరునిగను చూచుకొనుచుంటిని. నా యందు ప్రేమవిశ్వాసములు యీయనకు మిక్కిలి మెండు. ఈయన నేను సంపాదించినది జాగ్రతపరచుచు స్వల్ప వడ్డీలమీద తణఖాలమీద అప్పులిచ్చి, వృద్ధిచేయుచుండెను. నాకు కావలసిన ఖర్చులకు, నెలకు ఒకటిరెండుసార్లు లెక్క పుస్తకములలో దస్కతుచేసి నా భార్యను యింటివ్యవహారములకు వాడమని ఆమె చేతిలో వేయుటయేగాని, నేను యెన్నడు జమాఖర్చులను తణిఖీచేయడములేదు. తరువాత మా పిచ్చయ్యయే తణఖాపత్రములమీద వచ్చిన సొమ్మును, క్రమక్రమముగా బందరు కో ఆపరేటివు బ్యాంకును మేము స్థాపించినపుడు దానిలో షేర్లక్రిందను, ఫిక్సెడు డిపాజిట్లక్రిందను వేయుచుండెను. నా స్నేహితుడును, నా యార్థికవిషయములను బాగుగా యెరిగియున్నవాడు నగు డాక్టరు భోగరాజు శీతారామయ్యగారి సలహాపైని, ఆమొత్తమునంతయు, గుడ్లవల్లేరు కో ఆపరేటివు మార్గేజిబ్యాంకు నూతనముగా పెట్టినపుడు దానిలో డిబెంచర్లు కొన్నాను. బందరులో చేసిన వివాహములన్నియు,

మా పిచ్చయ్యగారి చేతిమీదనే జరిగినవి. ఆయనరమే నోకు సాలిసిటరు. నేను బారిస్టరును. ప్లయింట్లు, ఆన్సరు పిటీషనర్లు అన్నియు ఆయనే తయారుచేయగలవాడు. నేను చివరకు వానిని సరిచూచుటమాత్రమే. జిల్లాకోర్టు సబుకోర్టులలో పని పూర్తిగా యున్నపుడు, నేను మధ్యాహ్నము రెండుగంటలకు గాని జిల్లా కోర్టునుండి, సబుకోర్టుకు రాలేకపోతే, మా సబుజడ్జీగారగు, అయి. యల్. నారాయణరావునాయడుగారు, మా పిచ్చయ్య గారి చేతనే స్మాలుకాజు దావాలన్నిటిలో సాక్షులనుకూడా క్రాసుపరీక్షచేయనిచ్చి, పని పూర్తిచేసికొనేవారు. నాకొమాళ్లు ముగ్గురు బందరు హైస్కూలులో స్కూలుఫైనల్ పరిక్ష ప్యాసుచేసి, మద్రాసు కాలేజీలలోనే చదివినారు. పెద్దకుమారుడు, కృష్ణమోహన్ వేమవరపు రామదాసు పంతులుగారి అల్లుడు. యమ్.యే.బియల్. ప్యాసై చెన్నపట్టణములో అడ్వకేటుగా 14 సంవత్సరములుండి యిప్పుడు, మద్రాసు డిస్ట్రిక్టుకో ఆపరేటివుబ్యాంకుకు సెక్రటరీగా నెలకు రు 175 ల జీతము మీద నున్నాడు. రెండవ ఆయన రామమోహన్ ప్రెసిడెన్సి కాలేజిలో చదువుటకు వెళ్ళిన కొద్దిమాసములకే మూర్ఛ గుణము కనుపడి, అప్పటినుంచి, డాక్టరు కోమన్ మొదలగు ఇంగ్లీషువైద్యులు, ఆయుర్వేద, యునాని వైద్యులు, యెన్నివిధముల ప్రయత్నించినను జబ్బుయెక్కువైనది. ఆ జబ్బులోనే యఫ్.యే ప్యాసయినాడు, చరిత్రలో బి.యే ఆనర్సుకు చదువుచుండగా మరింతజబ్బు హెచ్చగుటచే, బందరు తీసికొనివచ్చి

నోబిల్ కాలేజీలో ప్రవేశపెట్టగా, బి. యే పరీక్షలో యింగ్లీషు ప్యాసైనాడు. చరిత్రలో పరీక్షాపత్రములను ఆన్సరు చేయుచున్నపుడు ఫిట్సువచ్చి పరీక్ష నీయలేకపోయెను. అప్పుడు నేను బలవంతముగా చదువుమానిపించి పుస్తకములన్నిటిని బీరువాలో పెట్టి తాళమువేయగా తనకేమియు పాలుపోలేదని, మహమ్మదీయ యుపాధ్యాయునిదగ్గర ఉర్దూభాషను, హిందీ భాషను వ్రాయను చదువను నేర్చుకొని, తులసీదాసు రామాయణమును, హిందీవ్యాకరణమును వ్రాసి ఆంధ్రపత్రికా ఆఫీసునకు పంపెను. ఇతనిమూర్ఛ గుణమునుబట్టి వానిలో తప్పులేమైన దొర్లినవేమో, అవి అచ్చుపడలేదు. మూడవకుమారుడు జగన్మోహన్ పచ్చియప్ప కాలేజిలో బి.యె వరకుచదివి గణితశాస్త్రములో బి.యే ప్యాసై యింగ్లీషులో తప్పి, విజయనగరము కాలేజిలో తిరిగి చదివెను గాని యింగ్లీషులో ప్యాసుకాకపోవుటచే, యీాయనను బొంబాయి విక్టోరియా టెక్నికల్ యిన్‌స్టిట్యూటులో యలెక్ట్రికల్ మెకానికల్ యింజనీరింగు క్లాసులో, నాలుగు సంవత్సరములు చదివించితిని. ఈయన ఆనర్సుతో ప్యాసై లండను గిల్డ్సుపరీక్షలో కూడను తీర్నుడై, యిప్పుడు బొంబాయిలోనే G. I. P. Ry. గవర్నమెంటు పనిలో నెలకు రు 450 ల జీతముమీాద నున్నాడు. నా పెద్దకుమార్తె శాంతరాజామణిని, మా వెంకటసుబ్బారావుగారు జీవించియుండగానే ఆయన మేనల్లుడును మా కాశీనాథుని నాగేశ్వరరావుగారి భార్యా తమ్ముడును అగు మల్లా

ప్రగడ రామచంద్రరావు బి.యె. బి.యల్. అడ్వకేటు మద్రాసుకు యిచ్చి 1915 లో వివాహముచేసితిని. ఆ పిల్ల ది 18-2-22 తారీఖున బందరులో ఒక మగపిల్లవానిని కని చనిపోయినది. అప్పుడు ఆయనకు నా మూడవకొమార్తె సూర్యకుమారినిచ్చి కోపూరులో ది 27—1—25 తారీఖున తిరిగి వివాహముచేసితిని. నా రెండవకుమార్తె శారదామణిని యిప్పుడు రాజమహేంద్రవరములో ప్లీడరీచేయుచున్న వాడ్రేవు బాపిరాజు బి.యె బి.యల్ గారికి బందరులోనే ది 9-5-20 తారీఖున వివాహము చేసినాను.

నాపెద్దకొమార్తె చనిపోవుటయే నాకు గొప్పదెబ్బ. నా రెండవకొమారునికి మూర్ఛపోయేటట్లు కనపడలేదు. అతను మిక్కిలి తెలివైనవాడైనను, క్రమక్రమముగ స్తబ్ధుకాజొచ్చెను. వివాహముచేసి భార్యకాపురమునకు వచ్చినతరువాత, జబ్బపోవునని కొందరు, అది పోయినను పోకపోయినను, తల్లిదండ్రుల తరువాత అతనిని జాగ్రతగ కనిపెట్టతగినవారు భార్యతప్ప మరియెవరు ఉండజాలరనియు, కాబట్టి వివాహముచేసి తీరవలెననియు కొందరు సలహానిచ్చిరి. కాని చాలాకాలమువరకు వివాహము చేసికొనుటకు ఆయన ఒప్పలేదు. మన్నారు కృష్ణారావుగారు మొదలగుపెద్దలు, తమపిల్లలను యిచ్చుటకు వచ్చినప్పుడు, యితనికీ మూర్ఛగుణమున్నది గనుక, పెండ్లిపీటల మీాద క్రిందపడినను, మనస్తాపములేకుండ సంతోషముతో పిల్లనిచ్చినసేగాని, నేను వివాహముచేయనని స్పష్టముగా చెప్పి

చుండెడివాడను. కాని, ఆపిల్లవాడు యెంతవలదన్నను, వివాహము అవశ్యకమని స్థిరపరచి, నాభార్యా మేనత్తకుటుంబములో చేరిన దగ్గరబంధువులే తమ 13 సం॥ముల వయస్సుగల పిల్లను కొవ్వూరు సమీపముననున్న ఊనగట్లగ్రామము నుండి తీసికొనివచ్చి, మాఅత్తవారి యింటియొద్దనున్న మల్లెలవారి సత్రములో దిగి, మావానికి, ఆముహూర్తముననో మరుచటిదినము ముహూర్తముననో ముడిపెట్టిరి. ఈపిల్లకు వైధవ్య ప్రాప్తి యున్నది కాబోలును. ఇతను ది 1–9–28 తారీఖున టైఫాయిడు జ్వరమువచ్చి, దానిలో ఫిట్సుకూడా వచ్చి, శరీరములో శక్తిచాలక, 20 రోజులు మంచమెక్కి చనిపోయెను. ఇతనికొరకే, యీకొవ్వూరు గ్రామములో యీగోదావరితీరమున యీగోష్పదక్షేత్రమునందు యీయాంధ్రగీర్వాణవిద్యాపీఠమును కనిపెట్టుకొని, యితను నేను, ప్రశాంతముగ కాలము గడపవలెననియు యితని మేనమామగారును, చెల్లెలును, పిల్లనిచ్చిన మామగారి కుటుంబమువారును సమీపమున నుందురు గనుక, యితను ఒకవేళ జీవితకాలమంతయు అవధ్యుడైనను, యితనికి ఉపచారములలో యెట్టిలోపము జరుగదని, బందరులో నాకొమార్తె 1922 సం॥రం ఫిబ్రవరినెలలో చనిపోగానే, యీకొవ్వూరు నివాసస్థానముగ నుంచుకొనుట కేర్పరచుకొని, యిక్కడ స్థలమును యింటిని కట్టుటకు, యితనిభార్య మేనమామయు, నాభార్య మేనత్తమనుమడైన మానాప్రగడ సూర్యప్రకాశమునకు సొమ్ము పంపితిని. నేను 1924 డిసెంబరులో వచ్చి, తక్కిన మరమ్మతులు పూర్తిచేయగా సుమారు

రు 15000 లు ఖర్చైనది—కాని, తానొకటితలచిన దైవ మొకటి తలచెను. ఈయన చనిపోగానే, యీయనకు పిల్లలింకను కలుగలేదు గనుక, యితనిభార్య పుట్టింటికి వెళ్లిపోయినది. నాకొమాళ్లు యిద్దరు చెన్నపట్టణం, బొంబాయీలలో నుండుటచే, యింతపెద్దయింట్లో నేను, నాభార్యా మాత్రము యుండవలసి వచ్చినది. చనిపోయిన పెద్దకుమార్తె కొమారుడు శాంతనరావు, తనతండ్రిదగ్గర మద్రాసులోనే చదువుకొనవలసి వచ్చినది. చనిపోయిన నాకొమారునిభార్యా తాను చదువుకొని తనసోదరీమణుల కుపయోగపడుదునని నాసహాయము కోరుటచే ఆమెకు మద్రాసులో 5 వ ఫారమునుండి, నెలకు ముప్పదిరూపాయీలు పంపుచు యింటర్మీడియేటుపరీక్ష ప్యాసు చేయించితిని. ఈమె యెంతకాలము ఓపికతో యేకాలేజీలోనైనను, యెట్టివిద్య నభ్యసించినను యీవిధముగనే పంపుటకు, నాడయిలులో యేర్పాటు చేసితిని.

నేను 1921 వ సంవత్సరములో మహాత్మాగాంధిగారి కోరికమీద కోర్టులలో ప్రయివేటు కేజులలో పనిచేయుట మానుకొని, దేవాదాయధర్మాదాయ సంరక్షణకు, ఆంధ్ర దేశములో నాచేతనైనంతవరకు ఉచితముగ పనిచేయుటకు నిశ్చయించితిని. ప్రయివేటు పార్టీల కేజులను తీసికొనుచున్న యెడల, యీధర్మసంబంధమైన కేజులకు తగినకాలము వినియోగించజాలననియు, నేను యిరువదియైదు సంవత్సరముల ప్రాక్టీసులో సంపాదించుకొన్న ద్రవ్యముమీద జీవనము చేయవచ్చుననియు యెంచి, 1924 సం॥రం డిసెంబరులో కోర్టుకు ప్రవేశించితిని.

---

# అధ్యాయము ౧౨

## మరణశాసనము

సాధారణముగా, జనులు తాము చనిపోకముందు, గొప్ప వ్యాధిలో నున్నపుడే, తాము యిక జీవించమనే అధైర్యముతో, తమ తుదిమరణశాసనములను, బహుతొందరగా, అనాలోచనతో కూడ మరియొకరు తోపించినట్లు వ్రాయుచుందురు. కొందరు ముందుగానే, మెల్లాని అట్టివివ్రాసికొన్నను, వానిని యేరిజస్ట్రేషన్ ఆఫీసులో గాని, మరియెక్కడనో దాచియుంచెదరు. వానిని తమ యిళ్లలోనే యుంచుకొని చనిపోయిన యెడల, దానిలో వ్రాసిన విషయములు తమవారసులే వానిని చింపివేయవచ్చునని ఒక భయము. ఉయిలును తన జీవితకాలములోనే ప్రకటించుకొన్న యెడల, తన యవసాన కాలమందు, వారు తన కూడిగము చేయరేమో యనునది రెండవభయము. లేదా ఆ ఉయిలులో నుదహరించిన తన యుద్దేశ్యముల్లను మార్పించుటకు, వారు ఒత్తిడి కలుగజేయవచ్చునని మూడవభయము.

నాకిట్టి భయములు లేనివాడను. నాఉద్దేశ్యములను ట్రస్టుడీడులో, వ్రాసికొని నాజీవితానంతరము వాని నమలులో పెట్టవలయునని వ్రాయవచ్చును గాని, నేను మరణించులోగానే కొన్ని సంగతిసందర్భములలో, దానిలో మార్పులు చేయుటకు వీలుండదు. ఎట్లులైనను, నాకుమిగులు కొద్దిపాటి

ఆస్తి నాకు తోచిన ధర్మమునకే, యెప్పటికైనను వినియోగ పడుచుండవలెనని నేనిప్పుడే బహిరంగపరచిన యెడల, అది, ప్రజలయెదుటచేసిన ప్రమాణమై, నీతిగలవాడు దాని నుల్లంఘింపడు. ఇట్లు ఉయిలును ప్రకటించుకొనుట స్వోత్కర్షకొరకే యని కొందరు నన్ను హేళనచేసెదరు. అట్టి యుద్దేశ్యము నాకు కలిగినను, అదియొక గొప్పతప్పుగా నేను భావించను సరికదా, నావంటి సామాన్యగృహస్థులు, తమ శక్తికొలది, తమయాస్తిలో కొంతైనను ధర్మమునకు వినియోగించుటకు యీవిధానముకూడ ఒక ఆచరణపూర్వకమగు మార్గమని నేనెంచెదను. తనవారసులయెడ యిక నెట్టిబాధ్యతలు లేనప్పటికి, తనయాస్తిని లోకోపకారమున కుపయోగించక, తన బిడ్డలకో, వారు లేనియెడల మరియొకరికో దానినంతయు చెందింపజేయుట మనలో ఒక మూఢాచారమైనది. దీనిని నేను సదా ఖండించుచు, నావిధానమును నేనే ఆచరణలో పెట్టక, యితరులకు శ్రీరంగనీతులు బోధించుట హాస్యాస్పదము. నానావిషయములలో, సత్యమైన పరిజ్ఞానమును, మతసాంఘిక రాజకీయార్థికసంస్కరణావశ్యకతను, మన సామాన్యప్రజలలో యెల్లపుడు నుద్బోధించుటయే నాయాశయము. కాబట్టి ఒరుల దూషణభూషణములకు లక్ష్యపెట్టక, నామరణశాసనమును యీక్రింద నుదహరించుచున్నాను.

---

## My last will and testament.

ఈ 1936 సం॥రం జనేవరి 1 టో తారీఖున పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు తాలూకా, కొవ్వూరు గ్రామకాపురస్తులును, వల్లూరి వెంకటకృష్ణయ్యగారి కుమారుడును, హైకోర్టు అడ్వొకేటు నగు వల్లూరి సూర్యనారాయణరావు బి. యే., బి. యల్., యల్. టి., మంచి తెలివితోడను వ్యక్తతతోడను వ్రాసిన మరణశాసనము.

నాకుగల యావదాస్తియు నాస్వార్జితమై, నాకే దానిలో సంపూర్ణహక్కు భుక్తములు కలిగి యున్నందున, దాని వినియోగమును గురించి యీక్రింది యేర్పాటులను, నాతదనంతరము జరుగునట్లు వ్రాయుచున్నాను.

### I నా కొమార్తెలు

నాకొమార్తె వాద్రేవు శారదామణికి ది9-5-1920 తారీఖున ఆమె వివాహసమయమున, నేనిచ్చిన వేయిరూపాయిలు, ఆమె పెనిమిటి వాద్రేవు బాపిరాజుగారు బి. యే., బి. యల్., గత 15 సంవత్సములనుండి వడ్డీకివేసి వృద్ధిచేసి, యిప్పుడు అసలు సొమ్మును ఆమెకు యిచ్చివేయగా, ఆలమూరు కోఆపరేటివు ల్యాండుమార్గేజి బ్యాంకులో నొక డిబెంచరును ఆమె కొనుక్కొనెను. ఇదిగాక నేను మచిలీపట్టణములలోని శారతలక్ష్మి బ్యాంకులో వేసియున్న వేయిరూపాయిాల షేర్లను ఆమెకు, ది 7-10-1930 తారీఖున రిజస్టరుడు ట్రస్టుదస్తావేజు

ద్వారా యిచ్చివేసి, దానిమీద వచ్చువడ్డిని, ఆమెకు కావలసిన ఖర్చులక్రింద నేనే యిచ్చుచున్నాను. నారెండవ కుమార్తె మల్లాప్రగడ సూర్యకుమారికి, నాకు మచిలీపట్టణము ఆంధ్ర బ్యాంకులో రెండువేల రూపాయిల షేర్లను ది. 29-7-28 తేదిని రిజస్టర్డు ట్రస్టుదస్తావేజుద్వారా యిచ్చితిని. ఆబ్యాంకు వారు నాయుత్తరువు ప్రకారము సదరు షేర్లమీద వడ్డీని ఆమెకే పంపుచున్నారు. నాతదనంతరము పై షేర్లను వారి వారి పేర్లకు బ్యాంకులెక్కలలో ట్రాంసుఫరు చేయించుకొనవలెను. చనిపోయిన నామొదటికొమార్తె మల్లాప్రగడ శాంత రాజామణికి నేను మచిలీపట్టణములలోని కృష్ణా కోఆపరేటివు బ్యాంకులో వేసిన ఫిక్సెడు డిపాజిట్టు రెండువేల రూపాయీలు తీసికొని, ఆమొత్తమును వడ్డీతోసహా వృద్ధిచేసి, ఆమె కొమారుడు శాంతనరావుకు ట్రస్టీగానుండి, అతనికి భూములను కొనుటలో ఆమె పెనిమిటియగు మల్లాప్రగడ రామచంద్రరావు గారు బి. యే., బి. యల్., పని చేయుచున్నారు. కాబట్టి నాకొమార్తెల విషయమై నావిధ్యుక్తధర్మమును నెరవేర్చితిని.

## II నాభార్యా

నాభార్యా పార్వతమ్మగారిపేర, మచిలీపట్టణములోని కృష్ణా కోఆపరేటివు బ్యాంకిలో రు 2500 లు కిమ్మతుగల షేర్లను, పశ్చిమగోదావరిజిల్లా ఏలూరులోని కోఆపరేటివు జిల్లాబ్యాంకిలో రు 200 లు కిమ్మతుగల షేర్లను ఉన్నవి.

ఇవిగాక పైని చెప్పిన మొదటి బ్యాంకులో, రు 2300 ల కిమ్మతుగల షేర్లును, రెండవ బ్యాంకులో రు 1000 లు కిమ్మతు గల షేర్లును, కొవ్వూరు అర్బన్ బ్యాంకులో రు 100 లు కిమ్మతుగల షేర్లును నాపేర నున్నవి. కాని యీషేర్లన్నిటి మీాద వచ్చు అయివజును ఆమెకే యిచ్చివేయుచున్నాను. ఆమెపేర నున్నవిగాక నాపేర నున్నవికూడా నాతదనంతరము ఆమెపేరనే ట్రాంసుఫరు చేసికొని యనుభవించుటకు సంపూర్ణాధికారమిచ్చితిని. ఆమె వానిమీాద వచ్చు వడ్డీనంతయు తన యిష్టప్రకారము వినియోగించుకొనవచ్చును. నాకు Bombay Oriental Government Security Life Assurance Co., లో అయిదువేల రూపాయలకు Assurance for Life—Policy with profits No. 29545 of 1895 ఒకటి ఉన్నది. దానిని, నేనిదివరకే కంపెనీ వారి లెక్కలలో నాభార్యాపేర ట్రాంసుఫరు చేసితిని. ఆపాలసీ మొత్తము బోనసుతోసహా యిప్పటికి సుమారు యేడువేల రూపాయీలుండును. నాతదనంతరము దానిమీాద రావలసిన సొమ్మంతయు నాభార్యా తనయిష్టానుసారము ఖర్చుపెట్టుకొన వచ్చును. ఆమె నాకంటె ముందుగా చనిపోవుట తటస్థించిన యెడల ఆరాబోవుమొత్తము వినియోగపడవలసిన యేర్పాట్లు యిప్పుడే చేయుటకు నాకు హక్కుగలదు గనుక, నాతదనంతరము కొవ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠమువారు, ఆమొత్తమునంతయు కోఆపరేటివ్ పుల్యాండుమార్గేజి బ్యాంకులలోనే డిబెం

చర్లు కొని, వానిమీద వచ్చు వడ్డీనిమాత్రమే, యీక్రింద V (b) పేరాలో నుదహరించిన నాఖాళీస్థలములో బీదలైన రోగులకు ప్రకృతిచికిత్స చేయుటకై, అపక్వశాకాహారము మీదనే జీవించుచున్న యొక వైద్యుని నెల 1 టికి రు 15 లు జీతమునిచ్చుచు, మిగిలిన మొత్తమును, ఆరోగులు తాత్కాలికముగ నివసించుటకు, పాకలక్రిందను, వారి శాకాహారభోజనముక్రిందను, వీలైనంతవరకు ఖర్చుపరచవలెను. నేనే నాభార్యకంటె ముందుగా చనిపోయిన యెడల ఆమెకూడ నాపై కోర్కెను నెరవేర్చునని ఆశించుచున్నాను.

III నా వితంతు కోడలు

నాకొమారుడు రామమోహన్ యింగ్లీషులో బి.యే. ప్యాసై సంతానము లేకుండగనే, మూర్ఛగుణము, విషజ్వరములవలన, ది 1-9-1928 తారీఖున చనిపోయెను. ఇతనిభార్యా చంద్రమతీదేవి తనజీవితమును తనసోదరీమణులకు సేవచేయుటకే వినియోగించెదననియు, తనకు విద్యాదానము చేయవలసినదనియు నన్ను కోరగా, అయిదుసంవత్సరములనుండి ఆమెకు ముప్పదిరూపాయీలిచ్చుచు మద్రాసులో Queen Mary's College లో యింటర్మీడియేటు పరీక్ష ప్యాసుచేయించితిని. ఆమె యింకను యేకాలేజిలో గాని యేవిధమైన విద్యనైనను అభ్యసించునంతకాలము, నేనున్నా నాతదనంతరముకొవ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠసంఘము వారున్నా ఆవిధముగానే ఆమెకు పంపుచుండుటకు యేర్పాటు చేయడమైనది. ఈమె

కూడ నాకుమాళ్లవలెనే నాకు మంచిపేరు తేగలదని నమ్ముచున్నాను.

### IV నా కొ మా ళ్లు

నాస్వకాయకష్టమువలన పితురార్జితసహాయమేమియు లేక చిన్నతనమునుండి విద్య నార్జించి యింకొద్దిపాటి యాస్తినైనను సంపాదించుకొనగలిగితిని. దీనిలో మూడవవంతు యిదివరకే దానధర్మములు చేసికొంటిని. మిగిలిన రెండువంతులును కూడ నాకు యుక్తమనితోచిన ధర్మకార్యమునకు, వినియోగించుటయే నావిధ్యుక్తధర్మమని చాలాకాలమునుండియు యెంచియుంటిని. నాకొమాళ్లు తమచిన్నతనమునుండియు, నాకంటె అదృష్టవంతులై, నాసహాయమువలన ఉన్నతవిద్య గడించి, తమ సన్మార్గప్రవర్తనచేతను, ప్రయోజకత్వముచేతను నాకు కూడ మంచిపేరు తేగలిగిరి. వారి కుటుంబములను వారే పోషించుకొనగలరు గనుక వారియెడల నాబాధ్యత తప్పిపోయినది. వీరినింకను ధనవంతులను చేయుట నాకిష్టము లేదు. అట్లు నేను చేయదలచుకొనినను వారు సంపాదించుకొనకుండ వచ్చిన ధనము, వారి కుటుంబములో యెన్నటికిని నిలువనేరదు. ఒకవేళ ఒకటిరెండు తరములు కొద్దిగా నిలచినను, అది తరువాత పూర్ణముగ నశించితీరును. ప్రయోజకులు, ధనవంతులు, దరిద్రులు—యిట్లు వరుసగా తరములవెంబడి మారుచుందును. నాకొమాళ్లు కూడ తమసంతతివారియెడల నామార్గమునే అనుసరించెదరని నమ్ముచున్నాను.

V నాకు ప్రస్తుతమున్న స్థిరాస్తి

(a) కొవ్వూరు గ్రామములో నాబంగాళాయున్నూ, దాని కాంపౌండులోని తోటయున్నూ, కొవ్వూరు ఆంధ్ర గీర్వాణవిద్యాపీఠసంఘమువారు తమ మేనేజిమెంటు క్రిందకు తీసికొని ట్రస్టీలుగా వ్యవహరించవలెను. ఈయింటిలోను, తోటలోను మొదట నాభార్యా తనజీవితాంతమువరకును, ఆమె చనిపోయిన తరువాత నాయిద్దరుకొమాళ్లు కృష్ణమోహన్ M. A., B. L., జగన్మోహన్ B. A., L. E. E., గార్లు జీవితాంతమువరకును,వీరిద్దరు చనిపోయిన తరువాతపై రెండవవారి కొమాళ్లుసూర్యమోహన్,శివరామకృష్ణమోహన్,రామమోహన్లు తమ జీవితాంతమువరకున్నూ, Right of residence హక్కు మాత్రము కలిగియుందురు. వీరెవ్వరును కొవ్వూరు గ్రామములో స్థిరముగా నుండక గ్రామాంతరములందు నివసించు కాలములో యీయింటి యుత్తర సగభాగములో అంతలోగాని, కొంతలోగాని తమసామాను పెట్టుకొని తాళము వేసికొని తాము తిరిగి వచ్చినప్పుడెల్లను, యీభాగములో నివసించవచ్చును. లేక ట్రస్టీలగు విద్యాపీఠసంఘమువారికే స్వాధీనము చేయుచుండవచ్చును. పైవారిలో యెవరైనను యీకొవ్వూరును స్థిరనివాసముగ చేసికొన్నయెడల యిల్లంతయు వారి స్వాధీనములోనే యుంచుకొనవచ్చును. విద్యాపీఠసంఘము వారు యీబిల్డింగులోనున్న బీరువాలను, కుర్చీలను, డెస్కులను యింటి దక్షిణభాగములోనే యుంచి వానిని వారే స్వయ

ముగా గాని, నాసంతతివారిక్కడ స్థిరనివాసమేర్పరుచుకొన్న యెడల వీరిగుండా గాని నాట్రస్టుకార్యములకు వాడుచుండ వలెను. వీరెవరును యీఆస్తిలో యేభాగముగాని, అద్దెలకు, లేక, పబ్లికుమీటింగులకు యీయకూడదు. ఈగృహము, దీని కాంపౌండుతోట, "మనస్స్వాతంత్ర్యమందిరము" (Free thought Home) అను పేరుతో వాడబడుచుండవలెను. మతసాంఘికరాజకీయార్థిక విద్యావిషయములలో పరిశోధన విమర్శన గ్రంథకర్తలకును, వారి కుపయోగించు గ్రంథాలయ మునకును, విద్యాపీఠసంఘమువారు ప్రతిసాలున ప్రకటించు గ్రంథములను నిలవచేయుటకును, పండితబృందసమావేశముల కును యీప్రశాంతమైన స్థలమును, నాసంతతివారును, విద్యా పీఠసంఘమువారును ఉపయోగించవలసినదే గాని, పబ్లికు మీటింగులకుగాని మరి యేయితరపనులకుగాని యెన్నడు నీయకూడదు. నాసంతతివారిక్కడ లేనియెడల, యీయింటి వెనుకభాగమున తూర్పుదిశనున్న రెండు వసారాకొట్లు, స్నానములకొట్టు, తోట మొదలగునవన్నియు కూడా విద్యా పీఠసంఘమువారి మేనేజిమెంటులో నుండవలయును. ఈయాస్తి యంతమీాద యీయవలసిన పన్నులు, దీనికగు మరమ్మతులు నౌకర్ల జీతములు నూతనముగా కొనవలసిన బీరువాలు మొద లగు సామానులు, దీపములు, మొదలగువాని ఖర్చులక్రింద నెలకు యేబదిరూపాయీలకు మించకుండ విద్యాపీఠసంఘము వారే యెల్లపుడు భరించుచుండవలెను.

(b) కొవ్వూరులోని ఖాళీస్థలము

నేను కొవ్వూరు గ్రామములో, ఆంధ్రగీర్వాణవిద్యాపీఠమున కెదురుగా, రైల్వే ఫీడరురోడ్డునకు పశ్చిమమున, రీసర్వే నెం 687 రు 78 సెంట్లు విస్తీర్ణముగల ఖాళీస్థలమును కొని దానిలో ఒక నూతినికూడ త్రవ్వించితిని. దీనిని వినియోగపరచవలసిన పద్ధతిని గురించి పై II వ పేరాలోని చివరభాగములో వ్రాసియున్నాను.

VI నాకు ప్రస్తుతమున్న నిలవరొఖ్ఖము

నాకు కృష్ణాజిల్లా గుడ్లవల్లేరు కోఆపరేటివుల్యాండు మార్గేజి బ్యాంకులో యేబదినాలుగువేల రూపాయిాల డిబెంచర్లును, తూర్పుగోదావరిజిల్లా ఆలమూరు కోఆపరేటివు ల్యాండుమార్గేజి బ్యాంకులో మూడువేల అయిదువందల రూపాయిాల డిబెంచెర్లుమాత్ర మున్నవి. వీనిమీద సాలుకు యిరువదిమూడువందలరూపాయిాలు వడ్డీ రాగలదు. దీనిని నాజీవితాంతమువరకు నాఖర్చులకొఱకుంచుకొంటిని. నాతదనంతరము యిదివరకు నేను ఆంధ్రగీర్వాణవిద్యాపీఠసంఘము వారిపేర ది 9-4-31 వ తారీఖున పంద్రెండువేల రూపాయిాలకు వ్రాసియిచ్చిన ట్రస్టుఫండులో దీనినికూడ చేర్చి, దానిలోని నా యుద్దేశ్యములను నెరవేర్చుటకు మాత్రమే దీనిని సదరు సంఘమువారుపయోగించవలెను. ఆదస్తావేజులో వ్రాసినప్రకారమే యీసొమ్మును invest చేయుచుండవలెను.

కాని యీక్రింది ఖర్చులుపోను మిగిలిన మొత్తమునే ట్రస్టీలు నాయుద్దేశనిర్వహణమునకు ఖర్చుపరుచుచుండవలెను.

(a) నావితంతుకోడలు వల్లూరి చంద్రమతి యేకళాశాలలోనైనను విద్య నభ్యసించుచున్నంతకాలము మాత్రమే సాలుకు రు 360 లు (మూడువందల అరువది రూపాయిలు) యిచ్చుచుండవలెను.

(b) నాభార్యా మేనకోడలును, సంతానహీనురాలైన వితంతువునగు మానాప్రగడ వెంకాయమ్మకు, ఆమె జీవించియున్నంతకాలము సాలుకు రు 60 లు (అరువది రూపాయిలు) యిచ్చుచుండవలెను.

(c) నాకొవ్వూరులోని యిల్లు, దాని కాంపౌండులోని తోటల మరమ్మతులకును, నౌకర్ల జీతములకును, పన్నులకును, నూతన furniture కును దీపములు మొదలగు ఖర్చులకును సాలుకు రు 600 (ఆరువందల రూపాయిలు) మించకుండా ఖర్చుపెట్టవచ్చును.

## VII పండితబృందము

## (Academic Council)

నేను ది 9-4-1931 వ తారీఖున కొవ్వూరు ఆంధ్ర గీర్వాణవిద్యాపీఠసంఘమువారిపేర వ్రాసిన ట్రస్టుదస్తావేజులోని నాయుద్దేశ్యములను నెరవేర్చుటకు ఒక పండితబృంద

మును యేర్పాటు చేసెదనని వ్రాసియుంటిని. దాని నిర్మాణ మును అధికారములును యీవిధముగ నుండవలెను:—

(1) నా కొమాళ్లిద్దరును, జటావల్లభుల పురుషోత్తము M. A. గారును దీనిలో జీవితకాలపు మెంబర్లుగానుండి వీరు ప్రతిసాలుకు ఏర్పరుచుకొను మరియిద్దరు విద్యాధికులతో కలసి మొదటి పండితబృందముగా యేర్పాటు కావలెను. వీరిలో యేకారణముచేతనైనను ఖాళీలు సంభవించినపుడు తక్కిన వారు ఆఖాళీలను పూర్తి చేసుకొనుచుండవలెను. దీనిలో చేరు మెంబర్లందరు, యేమతగ్రంథముకూడ దైవదత్తమనిగాని, దానిలోని విషయముల నుల్లంఘనీయములనిగాని నమ్మమని ప్రమాణపత్రము ముందుగా దాఖలుచేయవలెను.

(2) ఈపండితబృందమువారు నాట్రస్టుడీడ్డులో నుదహరించిన విషయములను గురించి విమర్శనగ్రంథములను ఆంధ్రములో వ్రాయించి, అచ్చొత్తించి, ఆంధ్రదేశములోని ముఖ్య గ్రంథాలయముల కన్నింటికి ఉచితముగ పంపించుట, వ్యక్తులకు విక్రయించుట, మొదలగు పనులు నెరవేర్చుచుండవలెను. ఈపండితబృందము కలసి పనిచేయజాలనపుడు, నేను పైన వ్రాసిన యోగ్యతగల మెంబర్లను, ఆంధ్రవిశ్వవిద్యాలయము వారు యేర్పరచవచ్చును.

(3) గ్రంథముల నచ్చొత్తించుటకును, పోస్టేజికిని, విద్యాపీఠసంఘమువారు దీనికొరకు యేర్పడిన ట్రస్టుఫండు

మీద వచ్చు వడ్డీలోనుండి కావలసిన సొమ్మును వెచ్చించు చుండవలెను.

(4) అచ్చొత్తించబోవు ప్రతి గ్రంథమును, విద్యాపీఠ సంఘములోని శాశ్వతసభ్యుల మెజారిటీవలన అంగీకరింపబడు చుండవలెను.

(5) ఏకారణముచేతనైనను ప్రస్తుత కళాశాలాధ్యక్షు లగు జటావల్లభుల పురుషోత్తముగారు యీవిద్యాపీఠములో నుండుట తటస్థించకపోయినను కళాశాలలోని యేయుపాధ్యా యుడును పరిశోధనకార్యమునకు తగినవాడు కాడని పండిత బృందమువారు తలచినను, అప్పటినుండియు, విద్యాపీఠసంఘ మువారు నేనట్టి యుపాధ్యాయుని కొఱకే ది 9-4-31 తేది ట్రస్టుదస్తావేజులో యేర్పరచిన నెల 1 కి రు 20 లు కళాశాల నిమిత్తము ఖర్చు పెట్టకూడదు. ఆమొత్తమును విమర్శన గ్రంథకర్తలకు పారితోషికముగ నొసగవలెను.

(6) ఈపండితబృందమునకును విద్యాపీఠసంఘమువారి కిని, అచ్చువేయబోవు గ్రంథప్రాశస్త్యమును గురించి భేదాభి ప్రాయములు కలిగినపుడు ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి Academic Council వారి నిర్బంధమధ్యవర్తిత్వమునకు ఉభయులు ఒప్పుకొని వారి తీర్మానములనుబట్టి నడచుకొని తీరవలెను.

(7) నాట్రస్టుఫండునుబట్టి వెలువడు ప్రతి గ్రంథమును, నాచిరకాలమిత్రుడగు అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారి రాజమండ్రిలోని Saraswathi Power Press లోనే అచ్చొత్తించుచుండవలెను.

(8) నూతన పరిశోధన గ్రంథములతోపాటు సమస్త భౌతికశాస్త్రములలో పైమెట్లు మొదలు స్టాండర్డు గ్రంథముల వరకు యీపండితబృందమువారు వ్రాయించవచ్చును.

## VIII ట్రస్టు మేనేజిమెంటు

కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ సంఘమువారు నేనిందుమూలముగా నిచ్చిన చర స్థిరాస్తులకు Executors and Trustees గా నుండి సరిగా, ఆచంద్రార్కముగా నాధర్మమును పాలింతురని నమ్ముచున్నాను. ఈట్రస్టు మొత్తమంతయు యెల్లపుడును, యెంతవడ్డీ వచ్చినను, కోఆపరేటివు ల్యాండుమార్గేజి బ్యాంకు డిబెంచర్లలోనే యుండవలెను. ఈధర్మమునందభిమానముగల నాయాంధ్రసోదరులలో నెవరైనను, పై సంఘమువారి యొద్దనుండి లెఖ్ఖకాపీని, తడవకు రెండేసి రూపాయీలిచ్చి పొందవచ్చును. అట్లు వారీయని యెడల Act XIV of 1920 ప్రకారం యేలూరు జిల్లా కోర్టులో పిటిషన్ పెట్టి కావలసిన సముజాయిషీని పొందగలరు. ఈసంఘమువారు యీధర్మమును సరిగా పాలించుటలేదని తెలిసినపుడు, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు యీఆస్తినం

తేయు కోర్టుద్వారా స్వాధీనముచేసికొని నాయుద్దేశ్యములను యీకొవ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠములోనే నెరవేర్చుచుండుటకు, వారికిష్టమైన యేర్పాట్లు చేయవచ్చును.

పైకొద్దియాస్తిలో కూడ, యెంతమిగులునో నేనిప్పుడు చెప్పజాలను. ధర్మసంరక్షణలో, ప్రజలుదాసీనులై యుండుట వలన, నాచిరకాలానుభవమునుబట్టి మన న్యాయస్థానములు తరుచుగా జూదపుటిండ్లని నేను తెలిసికొనియున్నను, ప్రకృతి యంతటిలోవలెనే, మానవసంస్థలన్నియు అపరిపూర్ణస్థితిలోనే యుండక తప్పవని గ్రహించి సదరు న్యాయస్థానములే, న్యాయశుద్ధికి కొంతవరకైనను మనకు శరణ్యములని నమ్ముచున్నాను కాబట్టి, ధర్మసంరక్షణోద్యమములో నేను వెచ్చించగా మిగిలిన యాస్తియే, కొవ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠమునుండి వెలువడు గ్రంథముల కుపయోగపడగలదు.

ఈ ఉయిలుమీద సాక్షిదస్కతులను, నేను స్వయముగా వెల్లి చేయించుకొంటిని.

కొవ్వూరు<br>ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము } వల్లూరి సూర్యనారాయణరావు<br>1—1—36

ఇందుకు సాక్షులు

1. కొంపెల్ల సత్యనారాయణశాస్త్రి సాక్షివ్రాలు 1-1-36
2. అయ్యగారి బాపిరాజు సాక్షివ్రాలు 1-1-36

రాజమండ్రి

3. కందుకూరి వీరబసవరాజు సాక్షివ్రాలు 1-1-36

4. ముడుంబ దొడ్డయాచార్యులు సాక్షివ్రాలు 1-1-36

5. చిత్రపు బుచ్చివెంకయ్య సాక్షివ్రాలు 1-1-36

దస్తూరి కందుకూరి వీరబసవరాజుది—సా॥ కొవ్వూరు

ఈ విల్లుయొక్క అసలు ఒకటి ఆంధ్రగీర్వాణవిద్యాపీఠపు ఆఫీసులోను, ఒకటి నాబాల్యస్నేహితుడగు చిత్రపు వెంకటచలంగారి కుమారుడు బుచ్చివెంకయ్య బి.ఏ., బి.యల్., గారి వద్దను, మూడవది రాజమండ్రి సరస్వతీ పవరు ప్రెస్సులో మేనేజరుగారగు అయ్యగారి బాపిరాజుగారి వద్దనున్నూ ఉంచడమైనది.

వల్లూరి సూర్యనారాయణరావు
1—1—36

210

ఈ క్రింది గ్రంథములు, పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు

ఆంధ్రగీర్వాణ విద్యాపీఠాధ్యక్షులగు

జటావల్లభుల పురుషోత్తం ఎం. ఎ. గారికి

వ్రాసి తెప్పించుకొనవచ్చును.



(పోస్టేజి గాక)

| | | | |
|---|---|---|---|
| 1. | వర్ణాశ్రమ ధర్మపరిణామము | ... | 0—8—0 |
| 2. | అంతర్జాతీయ ధర్మశాస్త్రము | ... | 0—6—0 |
| 3. | మనస్స్వాతంత్ర్యము, ప్రథమభాగము | | 0—8—0 |
| | డిటో ద్వితీయభాగము | | 0—8—0 |
| | డిటో తృతీయభాగము | | 0—9—0 |
| 4. | రాజ్యాంగవివేకము | ... | 1—0—0 |
| 5. | వేదకాలపు స్త్రీలు | ... | 0—10—0 |
| 6. | స్మృతికాలపు స్త్రీలు | ... | 0—10—0 |
| 7. | సూర్యనారాయణీయము (సామాన్య సంసారి జీవితకథ) | ... | 0—10—0 |

వల్లూరి సూర్యనారాయణరావు
సెక్రటరీ,
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము
కొవ్వూరు,
పశ్చిమగోదావరిజిల్లా

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారిచే
రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్సందు ముద్రింపబడియె—9648-1936.

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | GVP01R105 | Date | 26-3-2021 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, B, F, V, 209 | | |
| Missing Pages | NO | | |
| Prepared | G. Soundari | Scanned | Shahina. |
| BOOK SIZE | H 7.4 W 4.9 | Pages | 225 |